Shortly Coming




KAY PRODUCTIONS'

# Dil Diya Dard Liya

EASTMANCOLOR

A. R. KARDAR NAUSHAD

# ఈ సంచికలో



ముఖచిత్రం ఆశా కుసుమం

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

---


యువ సాలుచందా 12-00

దీపావళి ప్రత్యేక సంచికతో 16-00

యువ, పోస్ట్‌బాక్స్ 216 హైద్రాబాద్-1

# HERE COMES THE BLUSHING BRIDE





SWASTIK AB-14

Yes, indeed—this is the finest and sweetest hour of her life: wedding bells and prospects of many years of happily married life. And a wealth of gratitude to father for his thoughtful planning and SAVING to make her future so secure

Your SAVINGS ACCOUNT assures you financial security You are welcome to open your account at any of our branch nearest to you.

**INTEREST 4% p.a.**

**Unlimited number of withdrawals**



# THE ANDHRA BANK LIMITED

(The Bank For Friendly Service)

Regd. Office: Machilipatnam — Central Office: Hyderabad (A. P.)




**N. S. DUTT**
Chairman

**T. R. BHAGAVAT**
General Manager




ఆహార ధాన్య ప్రస్తావన సంపాదకీయంతో, మంచి మంచి కథలతో, 'గోరా' సంక్షిప్త నవలతో, అందమైన ముఖచిత్రంతో ముస్తాబైన 'యువ' ఉగాది సంచిక నన్ను విశేషంగా ఆకర్షించింది.

వరుల శ్రీనివాస్
వేములవాడ

పత్రికలో ముఖ్యంగా ఆకర్షించేది మీ సంపాదకీయం – వ్యవసాయం, నదీ జలాలు, నిరుద్యోగం ఈ మూడు సమస్యలు చాలు భారతదేశాన్ని బంగారు దేశం చేయడానికి. మీ సంపాదకీయాల వల్లనైనా కనీసం మన పార్లమెంటు సభ్యులకు, మంత్రులకు జ్ఞానోదయం కలిగితే సంతోషం.

'ఉదయ కిరణాలు' మాతృహీనులైన బాలబాలికల దుస్థితిని చక్కగా రూపొందించుచున్నది కవయిత్రిగారు. ఈ నెల కార్టూన్లు మరీ కడుపుబ్బ నవ్విస్తున్నాయండీ! 'బీనాదేవి' గారి 'నల్లంచు తెల్లచీర', 'శర్వాణి' గారి 'అందవిహీన' కథలు చాలా బాగున్నాయి.

కోటమర్తి లక్ష్మి,
రాజమండ్రి

ఏప్రిల్ 'యువ' (ఉగాది సంచిక) ఎక్సెలెంటుగా యున్నది. 'అసంగ శస్త్రేణ దృఢేనఛిత్వా', 'ఊర్మిళాదేవి కల' అన్న ఈ రెండు కథలు ఎంతో బాగున్నవి. 'కారు చీకటిలో కాంతి పుంజం', 'ఎన్నదగ్గ రోజులు' అన్న ఈ రెండూ చిన్నకథలైనా ఎన్నతగ్గవి. పవని నిర్మలప్రభావతిగారి పెద్దకథ 'ఉదయ కిరణాలు' చాలా బావుంటున్నది. ముగింపు ఎలా వుంటుందో యని ఎదురుచూస్తున్నాము ఇంత మంచి రచనలు ప్రచురిస్తున్న మీకుఅభినందనలు.

యేలేశ్వరపు కృష్ణమూర్తి
విజయవాడ-4

ఉగాది సంచిక ముఖచిత్రం చాల అందముగా ఉన్నది. ఈ సంచికలో నన్ను ఆకర్షించిన కథలు 'అందవిహీన', 'నల్లంచు తెల్లచీర'. ఉత్సాహకరమైన మంచిమంచి కథలను ముందుముందు ఆంధ్రులకు అందచేయగలరని ఆశిస్తూ ప్రతినెలా "యువ"ను ఆకర్షవంతముగా తయారు చేయుచున్న సంపాదకులకు కృతజ్ఞతలు అందచేయుచున్నాను.

బి. చెన్నకిషన్‌రావు
మామిడాల

## బచ్చు లింగయ్య & సన్స్

పేపర్ మర్చంట్స్

సికిందరాబాద్
జనరల్ బజార్
ఫోన్ : 72997



హైదరాబాద్
సిద్దిఅంబర్ బజార్
ఫోన్ : 41429

మంచి ముద్రణకు సౌకర్యముగా అన్ని రంగుల ఇంకులు
సప్లయి చేయుదుము.

డిస్ట్రిబ్యూటర్స్ :
"కోట్స్" ప్రింటింగ్ ఇంక్స్

---

ESTD : 1952 Phone: 43077

## *Ashok* DRESSES

( *Manufacturers* : Quality Garments. )

SULTAN BAZAR, HYDERABAD A. P.

---

Phone: 46407

## MANDAL APPARELS

Quality Garments & Seasonal Wears
Abid Circle, Station Road, HYDERABAD A. P

---

## DRESS CENTRE

Quality Garments, Children & Gents Wears
Sultan Bazar, HYDERABAD A. P.

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 13 | మే, 1966 | సంచిక 5


బాగుపడాలనే కోరిక అందరికీ వుంటుంది. వుండవలసిందే. పొరుగువాడినోట్లో మట్టికొట్టి బాగుపడేవాళ్ళుకూడా చాలామంది ఉన్నారు. "నా నోట్లో మట్టికొట్టి నువ్వు బాగుపడుతున్నావు. ఇకముందు నే నది సహించను సుమా!'' అని పొరుగువాడు అన్నప్పుడు, అలా అనడం చెడ్డతనం అని అన్నవాళ్ళని చూస్తేమాత్రం అందరికీ ఆశ్చర్యపడకపోరు.

ఇటీవల మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని విమర్శించడంలో మదరాసు విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సెలర్ డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియార్ అవలంబించిన ధోరణి, యిదే పద్ధతిలో వున్నది. డాక్టర్ మొదలియార్ పండువృద్ధు; గొప్ప మేధావి; డాక్టరుగా ప్రపంచప్రసిద్ధి పొందినవారు; పరిపాలనా వ్యవహారాలు బాగా తెలిసినవారు; రాజ్యాంగవిధానం స్పష్టంగా ఆకళింపుచేసుకున్నవారు. అటువంటి ఒక మహావ్యక్తి రాష్ట్రరాజకీయాలు, రాష్ట్రాభివృద్ధి యత్నాలలో ...చేటప్పటికి, యిరుగుపొరుగు రాష్ట్రాల అభివృద్ధికి మదరాసు మంత్రులు ఆటంకాలు కలిగించడాన్ని గర్హించవలసింది. అలా చెయ్యకపోగా, మదరాసు మంత్రుల చర్యలను గర్హించక ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని విమర్శించడం చాలా శోచనీయం.

మదరాసు రాష్ట్రం ఆర్థికంగానూ, పారిశ్రామికంగానూ చాలా అభివృద్ధికి వచ్చిన రాష్ట్రం. ఒకప్పుడు పది ఆంధ్రజిల్లాలుకూడా మదరాసు రాష్ట్రంలో వుండేవి. ఆ ఆంధ్రజిల్లాలనుంచి వచ్చిన రెవిన్యూ ఆదాయంతో, మదరాసు నగరాన్నీ, తమిళజిల్లాలనూ బాగుపరచుకుంటూ, ఆంధ్రప్రాంతాన్ని అధోగతిలోనే

వుంచుతున్నారన్న కారణంచేతనే కదా, తమిళప్రభుత్వం మాకు వద్దని ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రంకోసం ఆందోళనచేసి ప్రబలత్యాగాలను చేసి ఆంధ్రరాష్ట్రాన్ని సంపాదించారు. ఈ విషయము డాక్టర్ మొదలియార్‌కు తెలియదా ?

ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నంతకాలమూ ఆంధ్ర ప్రాంతంలోని ఒక్క పరిశ్రమా ముందుకు రాలేదు. మదరాసు, కోయంబత్తూరు, మధుర, తిరుచిరాపల్లి, సేలం జిల్లాలు ఎంతో అభివృద్ధికి వచ్చాయి. తమిళదేశం అంతటా చక్కని రోడ్లు ఏర్పడ్డాయి. తమిళదేశంలో వున్న రోడ్లలాంటి రోడ్లు ఈనాటికికూడా ఒక్కటైనా ఆంధ్రప్రదేశ్‌లో లేవు. ఈనాడు మదరాసు రాష్ట్రంలోని గ్రామాలలో నూటికి తొంభై తొమ్మిదిటికి విద్యుచ్ఛక్తి సప్లయివుంది. ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాలలో నూటికి ఇరవై గ్రామాలకుకూడా విద్యుచ్ఛక్తి సప్లయిలేదు. ఇక పరిశ్రమలా ? మదరాసులోవున్న పరిశ్రమలలో పదోవంతుకూడా ఆంధ్రప్రదేశ్‌లోలేవు. కేంద్ర ప్రభుత్వపు పరిశ్రమలే మదరాసురాష్ట్రంలో తొమ్మిదివున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మూడు వున్నాయి. జనాభాలోనూ, వైశాల్యంలోనూ ఆంధ్రప్రదేశ్ మదరాసుకంటె ఎంతో పెద్దది. ఐనా, ఆంధ్రప్రదేశ్ ముందుకురావడానికి ఆటంకాలు కలుగుతూనేవచ్చాయి.

దీనికి కారణాలు – ఉమ్మడి రాష్ట్రంలో వున్నప్పుడు, అధికారంలోవున్న తమిళులు పరిశ్రమలన్నిటినీ తమ జిల్లాలలోనే స్థాపించడం ఒకటి; రాష్ట్రవిభజన తరువాత, ఆంధ్రరాష్ట్రం ఏ పరిశ్రమను కోరినా, దానికి ఆటంకం కలిగించి, కేంద్ర ప్రభుత్వాన్ని ఏదోఒక విధంగా మభ్యపెట్టి తమ రాష్ట్రంలోనే ఆ పరిశ్రమను స్థాపించడానికి ఏర్పాటు చేసుకోవడం, రెండు.

రాష్ట్రాల అన్నిటి సమగ్ర అభివృద్ధికి అనుకూలంగా పరిశ్రమలను స్థాపించడానికి అనుమతి నివ్వవలసింది కేంద్ర ప్రభుత్వం. పరిశ్రమలను స్థాపించడానికి కావలసిన విదేశీ మారకాన్ని ఇవ్వవలసింది కేంద్ర ప్రభుత్వం. అంచేత కేంద్ర ప్రభుత్వపు సానుభూతీ, సహాయం లేనిదే ఏ రాష్ట్రమూ ముందుకు రాజాలదు. ఈనాడు మదరాసు రాష్ట్రం పారిశ్రామికంగా ఎంతో ముందుకు వచ్చిందంటేనూ, ఆంధ్రప్రదేశ్ ఎంతో వెనుకబడి వుందంటేనూ, దానికి కారణం కేంద్ర ప్రభుత్వంలో కీలకస్థానాలలో వున్న తమిళులు తమ రాష్ట్రానికి కావలసిన సదుపాయాలన్నిటినీ కలిగించడమే కాక, మదరాసు రాష్ట్ర మంత్రులు అవలంబిస్తున్న ఒక చక్కని పద్ధతి బాగా లాభించడమే. ఈ పద్ధతి రెండు విధాలు – ఒకటి: కేంద్ర ప్రభుత్వం దక్షిణదేశంపట్ల సవతితల్లి ప్రేమ చూపుతోందనే ఆందోళనను లేవదీసి, దక్షిణదేశం అంటే తమిళదేశం మాత్రమే అనే భ్రమను పెంపొందించి, కొత్త పరిశ్రమలను పెట్టుకోవడానికి కావలసిన సదుపాయాలన్నిటినీ సంపాదించడం.

రెండు: ఏదైనా ఒక పరిశ్రమను స్థాపించుకోవడానికి, ఇతర రాష్ట్రం ప్రయత్నం చేస్తోందని తెలియగానే, ఆ రాష్ట్రం కేంద్ర ప్రభుత్వపు అనుమతిని సంపాదించే లోపలనే ఆ పరిశ్రమను స్థాపించడానికి అవసరమైన హంగులలో ఒకటి రెండింటిని ఏర్పాటు చేసుకోవడం; ఫలానా పరిశ్రమను స్థాపించడానికి కావలసిన హంగులన్నిటినీ బోలెడు డబ్బు ఖర్చుపెట్టి ఏర్పాటు చేసుకున్నాము కనుక, ఆ పరిశ్రమను మాకే ఇమ్మని కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడి చెయ్యడం.

మాటవరసకి, ఉక్కు ఫాక్టరీ విషయం తీసుకుందాము. ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి, రాజ్యాంగ విధానంలోని ఆదేశ ప్రకారం, ఏ రాష్ట్ర ప్రభుత్వానికీ అధికారం లేదు. ఈ అధికారం కేవలం, కేంద్ర ప్రభుత్వానిది. దేశంలో ఉక్కు ఫాక్టరీ అవసరమా కాదా అనే విషయాన్నీ, అవసరమైతే దానిని ఎక్కడ స్థాపించాలనే విషయాన్నీ పరిశీలించి నిర్ణయం చెయ్యవలసింది, కేంద్ర ప్రభుత్వం. ప్రస్తుతం, దేశంలో నాలుగు ఉక్కు ఫాక్టరీలు వున్నాయి. ఈ నాలుగింటి స్థాపన నిర్ణయంలోనూ, కేంద్ర ప్రభుత్వం పై విధానాన్నే అవలంబించింది. అయిదవ ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయించగానే మదరాసు ప్రభుత్వం తన ఎత్తుగడను ప్రారంభించింది. సేలందగ్గర ఉక్కు ఫాక్టరీని నిర్మించడానికి తగిన ఏర్పాట్లు చేశాము కనుక, అయిదవ ఉక్కు ఫాక్టరీని సేలంవద్ద స్థాపించాలంటూ ఒక ఆందోళన ప్రారంభించింది. సేలంవద్ద ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి ఏర్పాట్లు చెయ్యవలసిందని మదరాసు ప్రభుత్వాన్ని అడిగిన వారెవరు? కేంద్ర ప్రభుత్వపు అనుమతి ముందుగా పొందకుండా, అలాటి ఏర్పాట్లను మదరాసు ప్రభుత్వం ఎందుకు చెయ్యాలి? ఈ మాట, ఆంధ్రులు అడిగేటప్పటికి మదరాసు నాయకులు ఆగ్రహోవేశులవుతున్నారు.

మదరాసు ప్రభుత్వ పరిశ్రమల మంత్రి, ఆర్. వెంకటరామన్ గారు, ప్రతి సంవత్సరం విదేశాలకు వెళ్ళివస్తున్నారు. ఆయన యునైటెడ్ నేషన్సుకు భారత దేశంనుంచి వెళ్ళే ప్రతినిధి వర్గంలో ఒక సభ్యుడుగా, కేంద్ర ప్రభుత్వంచే నియమింపబడి, అమెరికాకు వెళ్ళి వస్తూవుంటారు. వస్తూనో, పోతూనో, ఇతర దేశాలను కూడా దర్శిస్తారు. ఇలాటి అవకాశం ఏదైనా మనకు వస్తే మనం ఏం చేస్తాము? ఒక ట్రాన్సిస్టరూ, రెండు వాచీలు నాలుగు కలాలూ, ఒక అరడజను టెరిలీన్ షర్టులూ తెచ్చుకుంటాము మురిసిపోతాము. వెంకటరామన్‌గారు అలా చెయ్యరు. తాను వెళ్ళిన దేశంలోని పరిశ్రమల వ్యవస్థను బాగా పరిశీలిస్తారు అక్కడి పరిశ్రమల యజమానులను కలుసుకొని అనేక విషయాలను తెలుసుకుంటారు. మదరాసు

రాష్ట్రంలో కొత్త పరిశ్రమలను స్థాపించడానికి సలహాలనూ, సహాయాన్నీ అడుగుతారు. వారిని మదరాసు రమ్మని ఆహ్వానిస్తారు. వారు చెప్పిన సలహాల ప్రకారం, ఒకటి రెండు ఏర్పాట్లు చేసి, ఫలానా పరిశ్రమకు అన్ని ఏర్పాట్లూ చేశాము కనుక, ఆ పరిశ్రమను స్థాపించడానికి అనుమతి ఇచ్చి తీరవలసిందే అని కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తారు. ఇప్పుడు ఉక్కు ఫ్యాక్టరీ విషయంలో జరుగుతున్నది అదే.

కేంద్రప్రభుత్వం ఒకవంక ఆంగ్లో-అమెరికన్ నిపుణులచేత యీ విషయాన్ని పరిశీలన చేయిస్తూవుంటే, మదరాసు ప్రభుత్వం జపాను నిపుణులచేత సేలందగ్గర ఉక్కు ఫ్యాక్టరీని స్థాపించడాన్ని గురించి ఒక రిపోర్టు తయారు చేయించింది. ఇలా చెయ్యడం న్యాయం కాదని ఆంధ్ర ముఖ్యమంత్రి అంటే, డాక్టర్ మొదలియార్ ఆగ్రహించారు. కేంద్ర ప్రభుత్వం చెయ్యాల్సినపని, ఒక రాష్ట్రప్రభుత్వం చెయ్యకూడదని, దానివల్ల నష్టపడే మరొక రాష్ట్రం ముఖ్యమంత్రి అనకూడదా? ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం తన యిష్టంవచ్చినట్లు నడచుకుంటే కేంద్రప్రభుత్వం ఊరుకోవలసిందేనా? ఈ విషయాన్ని పార్లమెంటు సభ్యులు, కేంద్రప్రభుత్వ మంత్రిని ప్రశ్నించవలసివుంది. రాష్ట్రాలకు యీవిషయంలో కేంద్రప్రభుత్వం స్పష్టమైన తాకీదు నివ్వాలి.

ఈ సందర్భంలో మరొక విషయం బైటపడుతూవుంది. డాక్టర్ మొదలియార్ విషయాంతరం. మదరాసు కౌన్సిలులోనే మదరాసు ముఖ్యమంత్రి, కేంద్ర ప్రభుత్వపు అనుమతితోనే వెంకటరామన్‌గారు జపాను వెళ్ళారని చెప్పారు. వెంకటరామన్‌గారికి కేంద్రప్రభుత్వం ఇచ్చిన అనుమతి జపాన్ వెళ్ళడానికి మాత్రమేనా, ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణం విషయంలో సలహాలనూ, సహాయాన్నీ ఇవ్వడానికి జపాను నిపుణులను ఆహ్వానించడానికి కూడానా? ఈ విషయాన్నికూడా కేంద్ర ప్రభుత్వం స్పష్టంగా ప్రజలకు చెప్పవలసివుంది. నిజంగా, వెంకట్రామన్‌గారికి జపాను నిపుణులను ఆహ్వానించడానికి కేంద్రప్రభుత్వం అనుమతిని ఇచ్చినట్లయితే, కేవలం ఒక అధికారానికే లోబడిన విషయంలో ఒక రాష్ట్రమంత్రి జోక్యం కలిగించడం, ముఖ్యంగా దీనివల్ల మరొకరాష్ట్రానికి అపకారం జరుగుతున్నపుడు కేంద్ర ప్రభుత్వం చెయ్యవలసిన పనేనా? ఇది పక్షపాత బుద్ధితో వ్యవహరించడం కాదా?

అలాంటి అధికారాన్ని వెంకటరామన్‌గారికి కేంద్రప్రభుత్వం ఇచ్చివుండకపోతే, జపాను నిపుణుల నాయన ఆహ్వానించినప్పుడు కేంద్రప్రభుత్వం ఎందుకూరుకుంది?

ఇలాంటి యక్షప్రశ్నలుగల విషయంలో, తమకు అన్యాయం జరుగుతున్నదని ఆంధ్రప్రజలు ఆవేదన పడుతూవుంటే, ఆంధ్ర ముఖ్యమంత్రి నిజాన్ని బైటపెట్టి, మదరాసు మంత్రిపద్ధతి న్యాయంకాదని అంటే, డాక్టర్ మొదలియార్ ఆగ్రహించడం న్యాయమా?



భారత వైమానికదళపు ముప్పదిమూడవ వార్షికసమావేశంలో హంటర్ విమాన దాడి దృశ్యాన్ని తిలకిస్తున్న రాష్ట్రపతి ప్రభృతులు

శ్రీకృష్ణపాండవీయం చిత్రానికి ద్వితీయ బహుమతి "ముఖ్యమంత్రి వెండినంది"ని శ్రీ త్రివిక్రమరావు అందుకుంటున్నారు



# చిత్రహారలం



ఉత్తమచిత్రాలకు బహుమతిసత్కారం జరిపిన సందర్భంలో ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రసంగం



ఉత్తమ చిత్రాలకు బహుమతుల విచ్చే సందర్భంలో మంత్రి శ్రీ వి. వి. గురుమూర్తి ఆహూతుల నుద్దేశించి మాట్లాడారు.

# త్వరలో

## మొగలు దర్బారు కుట్రలు

చారిత్రక వాతావరణం ఆధారం చేసుకుని ఇంగ్లీషులో కొన్ని 'నిగూఢ రహస్యాలతో కూడిన నవలలు వచ్చాయి. వాటిచేత ప్రేరేపితుడై ధీరేంద్ర నాథ్‌పాల్ అనే బెంగాలీ రచయిత మొగలులనాటి వాతావరణాన్నీ, చరిత్ర ప్రసిద్ధమైన పాత్రలనూ ఆధారం చేసుకుని ఈ సుదీర్ఘమైన నవల రచించాడు.

ఇందులో జహంగీరూ, నూర్జహానూ, వారి పిల్లలూ, రాజకీయాలూ మొదలైె వాస్తవ విషయాలతో బాటు అద్భుత రసప్రధానమైన అనేక సన్నివేశాలూ, కల్పితపాత్రలూ కూడా ఉన్నాయి. ఈ ప్రసిద్ద నవలను సంగ్రహపరచి సీరియల్‌గా ప్రచురిస్తున్నాం.



మీ కాపీలను ముందుగానే ఏజెంటువద్ద రిజర్వుచేసుకోండి; లేదా చందాదారులుగా చేరండి.

—సంపాదకుడు



[రెండవ భాగం]

[జరిగిన కథ: ఆనందమయీ కృష్ణదయాళులు గోరా పుటుక రహస్యాన్ని గోప్యంగా వుంచి, పెంచి పెద్దవాణ్ని చేశారు. గోరా వినయులు చాలా స్నేహంగా వుంటూండేవారు. గోరాకు దేశభక్తి మెండు - అందుకే జైల్లో పడ్డాడు. పరేశబాబు కుటుంబానిది బ్రహ్మమతం. వినయా లలితలమధ్య ప్రేమబీజం మొలకెత్తి పెరుగుతోంది. సుచరిత గోరా హృదయంలో మొదటిసారిగా స్త్రీ మనుగడను గుర్తింపచేసింది. వినయుడు ప్రేమకొరకు బ్రహ్మమతం తీసుకొని అధోగతిపాలు అవుతాడని గోరాకు భయం. వినయునికి శశిని యిచ్చి ముడేయాలని మహిముడి ఉద్దేశము.]

సుచరితా సతీసుల పెద్దమ్మ హరిమోహిని రావటంతో పరేశబాబు ఇంటి వాతావరణం చాలా కలతచెందింది. ఇది ఎలా జరిగినదీ తెలుసుకునేముందు హరిమోహిని జీవితచరిత్ర కొంత తెలుసుకోవటం అవసరం.

హరిమోహిని సుచరిత తల్లికన్న రెండేళ్ళు పెద్దది. తల్లిదండ్రులకు వాళ్ళిద్దరే పిల్లలు కావటాన చాలా గారాబంగా పెరిగారు. ఎనిమిదో ఏట హరిమోహినికి పెళ్ళి అయింది. కట్నందగ్గిర పేచీవచ్చి ఆమెను అత్తగారి వైపువాళ్ళు హీనంగా చూశారు. అత్తగారివైపు బారీకుటుంబం. అరవై డెబ్బయి మందికి తొమ్మిదేళ్ళ హరిమోహిని తానే వంట చేసేది. అందరూ తిన్నాక, అపరాహ్ణం ఆమె ఎంగిలి పడేది. ఒక్కొక్కసారి అన్నంతప్ప ఏమీ మిగిలేవి కాదు. మెతుకులు నాలుగూ నోట్లో వేసుకుంటూనే మళ్ళా రాత్రివంట ప్రారంభించేది. రాత్రి భోజనాలయేసరికి దాదాపు అర్ధరాత్రి అయేది. ఆమె అప్పుడు వెళ్ళి ఎవరిమంచంలో ఖాళీవుంటే అక్కడ పడుకునేది. ఆమెకు ప్రత్యేకించి ఒక గదిగాని మంచంగాని లేదు.

పదిహేడో ఏట ఆమెకు మనోరమ పుట్టింది. మరి మూడేళ్ళకు కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడు పుట్టకమునుపే హరిమోహిని భర్తా, అతని తమ్ములూ వేర్లుపడ్డారు. పెళ్ళీడు వచ్చాక మనోరమను పదిమైళ్ళదూరాన ఇచ్చారు. ఆమెభర్త సుపమన్మధుడు, కాని పట్టి భ్రష్టుడు, తాగుబోతు.

హరిమోహిని తన భర్తయొక్క ప్రేమగౌరవాలు సంపాదించే సమయంలో కలరా వచ్చి, ఆమె భర్తా, కొడుకూకూడా నాలుగురోజుల తేడాలో పోయారు. అల్లుడు ఆమెను వేధించి డబ్బు తీసుకుపోయి దుర్వ్యసనాలకింద ఖర్చు చెయ్య సాగాడు. మనోరమ డబ్బు ఇవ్వవద్దన్నది; అయినా అల్లుడికి కెక్కడ ఆగ్రహం వస్తుందోనని హరిమోహిని చాటుగా డబ్బిస్తూవచ్చింది. కొంతకాలానికి మనోరమ గర్భిణిగా వుండి పుట్టింటికి వచ్చేసింది. తల్లి తన భర్తకు డబ్బివ్వకుండా నిరోధించటాని కామె తల్లి డబ్బంతా తన అధీనంలో వుంచుకున్నది. మనోరమ భర్త వచ్చి చిందులు తొక్కాడు. మనోరమ లొంగలేదు.

ఒకరోజు మనోరమకోసం అత్తవారు పల్లకీ పంపారు. మనోరమ వెళ్ళనంటున్నకొద్దీ హరిమోహిని ఆమెను పంపింది. మనోరమ ఆమెకు మళ్ళీ కనిపించలేదు. ఆమెకు గర్భస్రావమై చనిపోయినట్టు కబురు వచ్చింది. హరిమోహిని వెళ్ళేసరికి శవదహనంకూడా అయిపోయింది.

భర్త చనిపోయాక భర్తవంతు ఆస్తి హరిమోహిని దయింది. దాన్ని తమకు రాసిఇవ్వమని మరదులు అదివరకే ఒత్తిడి చేశారు. దాన్ని మనోరమకు ఇద్దామని ఆమె అనుకున్నది. మనోరమ పోయాక ఆమె విరక్తి చెంది, తన మరదులు రాసి తెచ్చిన దస్తావేజుమీద సంతకం పెట్టేసింది. ఆ సంతకంతో వాళ్ళు ఆమెకు భరణ మన్నా లేకుండా ఆస్తి కాజేసి, ఆమెను ఇంటినుంచి వెళ్ళగొట్టారు. ముప్ఫైనాలుగేళ్లు కాపరం చేసిన ఇంటినుంచి ఆమె బయటికి నడిచింది. తన చెల్లెలు పెళ్ళికికూడా వెళ్ళలేదు. ఆమె ఎన్నో తీర్థాలు తిరిగింది. కాని మనశ్శాంతి రాలేదు. ఆఖరుకు, ఆమె తన చెల్లెలిపిల్లలను చూసుకుంటూ కాలం గడుపుదామని పరేశబాబుగారింటికి వచ్చింది.

పరేశబాబు ఇంట అడుగు పెట్టగానే హరిమోహినికి తన మనోరమ తిరిగి బతికి నట్టయింది. సుచరిత మనోరమ వయసుదే. అదీగాక ఇద్దరికీ చాలా పోలిక ఉండి ఉండవచ్చు. అనేక పర్యాయాలు సుచరితను చూసి హరిమోహినికి మనోరమనే చూసినట్టు భ్రమకలిగింది. అందుచేత ఆమె సుచరితను ఎంతో అపేక్షగా దగ్గరికి తీసుకుని, ముఖం నిమిరి, ముద్దులాడ నారంభించింది. మాతృవాత్సల్యం కరువైన సుచరితకుకూడా పెద్దమ్మను చూస్తుంటే తనకు తల్లి దొరికినట్టయింది.

ఇదంతా చూస్తుంటే పరేశబాబు భార్యకు మండుకొచ్చింది. ఇంత ఆచారవంతు రాలిని తన భర్త ఎందుకు చేరదీయాలి? హరిమోహిని మేడపైభాగాన ఉన్న ఒంటి గదిలో ఉండటంకూడా ఆమె సహించలేకపోయింది. భర్తతో ఇదేమిటంటే, "మా అందరి బరువూ మోసే నీకే దిక్కులేని విధవరాలు బరువయిందా?" అని అడిగాడు. ఆయనతో పోట్లాడి ప్రయోజనంలేదు. ఆయన చేసిన నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరు.

హరిమోహినికి నీరు తెచ్చిపెట్టటానికి బ్రాహ్మణనౌకరును ఏర్పాటు చేశారు. కాని పరేశబాబు భార్య అతని కింకేవో పనులు పురమాయించి, "పని చేయించు కోవాలంటే రామ్‌దీన్‌కు చెప్పరాదా ఏం?'' అనేది. రామ్‌దీన్ తెచ్చిన నీరు హరి మోహని తాకదు.

పరేశబాబు భార్యకు తన భర్తతో పోట్లాడి ఆయన గౌరవాన్ని కోల్పోయే సాహసంలేదు. అందుచేత ఇలాటి పనులు చేసి కసి తీర్చుకునేది. బయటికి వెళ్ళి బ్రహ్మసమాజం వాళ్ళందరితోనూ తనకు వచ్చిన కష్టం చెప్పుకుని, ''మూఢాచారా లను ఇలా సహిస్తే బ్రహ్మసమాజం మట్టికొట్టుకుపోక ఏం చేస్తుంది?" అని ప్రచారం చేసేది.

సుచరిత హరిమోహినిపట్ల అపేక్షగా ఉండటంకూడా ఆమె సహించలేక పోయింది. "నాకు ముందే తెలుసు. సుచరిత కిన్నాళ్ళూ పెద్దమ్మే చేసింది కాబోలు ఆ మనిషి కెంతచేసీ ఏమీ లాభంలేదు. ఇప్పు డొచ్చిన పెద్దమ్మ ఆప్తురాలై పోయింది," అని విమర్శించింది.

హరిమోహినీ, సుచరితా, సతీశుడూ ఒక జట్టుగా తయారయారు. మిగిలిన వాళ్ళంతా ఒక జట్టు. మధ్య లలితమాత్రమే ఉంకె మిగిలినవా ళ్ళందరినీ నివారించినట్టు లలితను నివారించి, హరిమోహినిదగ్గిరికి వెళ్ళకుండా చేసేటందుకు పరేశబాబు భార్యకు గుండెధైర్యం లేదు.

సుచరిత తన పద్ధతులను పెద్దమ్మకు అనుకూలంగా మార్చుకోసాగింది. ఆమె ఆచారానికి భంగం రాకుండా తాను పెద్దమ్మకు సేవ చెయ్యాలని ఆమె ఉద్దేశం. అలా చెయ్యవద్దనీ, పరేశబాబు నేర్పిన సిద్ధాంతాలనే అనుసరించమనీ హరిమోహిని అన్నది, కాని సుచరిత వినిపించుకోలేదు.

పరేశబాబు భార్య తన ఇంటికి వచ్చే బ్రహ్మసమాజ స్త్రీలను పై డాబామీద, హరిమోహిని గది కెదురుగా సమావేశపరచేది. వాళ్ళంతా హరిమోహినికేసి అదో రకంగా చూసి, సనాతనాచారాలను దుమ్మెత్తి పోసేవారు. పెద్దమ్మ దగ్గిరే ఎప్పుడూ ఉండే సుచరిత ఈ సూటిపోట్లను మౌనంతో సహించేది; కాని, వారితోబాటు ఫలహారం చెయ్యమన్నప్పుడు నిరాకరించింది. "ఆవిడగా రిప్పుడు సనాతనాచారాలు అవలంబిస్తున్నది. మనతో కలిసి తింటే మైలపడిపోతుంది," అన్నది పరేశబాబు భార్య వారద.

ఒకనా డొక బ్రహ్మసమాజస్త్రీ హరిమోహిని గదిలోకి అడుగు పెట్టబోతే సుచరిత వాకిలి కడ్డం నిలబడి, "అక్కడ పెద్దమ్మ దేవు డున్నాడు," అన్నది.

"అంటే విగ్రహమా? ఆవిడ విగ్రహాలను పూజిస్తారా?"

"అవును, తల్లీ, పూజిస్తాను," అన్నది హరిమోహిని

"మీకు విగ్రహంలో గురి ఎలా కుదిరింది?'' అన్నది బ్రహ్మసమాజికురాలు.

''గురా? అది ఉంటే బాగుపడేదాన్నే," అన్నది హరిమోహిని.

లలిత ఆ సమయాన అక్కడే ఉండి ఆ స్త్రీని, ''మీ రారాధించే దేవుడిమీద మీకు గురి ఉన్నదా?'' అని అడిగింది.

"లేకుంటా ఎలా ఉంటుంది?'' అన్న దా స్త్రీ.

లలిత తల అడ్డంగా తిప్పి, "మీకు గురి లేకపోవటమే గాక, లేదని కూడా తెలీదన్నమాట!'' అన్నది.



ఒక నాడు పానుబాబు, "నువ్విప్పుడు దేవుడి నైవేద్యం తప్ప తినవుటగా?" అని సుచరితను అడిగాడు.

సుచరిత ముఖం జేవురించింది. పరేశబాబు: "పానుబాబూ, మనం ఏది తిన్నా అది ఈశ్వరుడి నైవేద్యమే,'' అన్నాడు.

"కాని సుచరిత మన దేవుణ్ణి విసర్జించేలా కనబడుతుంది," అన్నాడు పానుబాబు.

"అది సాధ్యమే అనుకున్నా, అందు గురించి దిగులు పడి ఏం లాభం?" అని పరేశబాబు అడిగాడు.

"ఎవరైనా నీటిలోపడి మునిగి పోతుంటేరక్షించి ఒడ్డుచేర్చమా?"

"రాళ్ళతో కొట్టటమూ, రక్షించటమూ ఒకటి కాదు. సుచరితను చంటప్పటి నుంచీ ఎరుగుదును. ఆమె నీటిలో పడిపోతే మీ అందరి కన్నా నాకు ముందే తెలిసేది. నేను చూస్తూ ఊరుకుని ఉండేవాణ్ణి కాను," అన్నాడు పరేశబాబు.



"నేను అర్థమైనవాళ్ళ చేతి తిండీ తినటం మానేశానని నాన్న గారికి తెలుసు. ఆయన అది సహిస్తే నా కింకేమీ అవసరం లేదు. మరెవరికన్నా నా పద్ధతి నచ్చక పోతే, అనే దేదో నన్నే అనవచ్చు. ఆయనను క్షోభపెట్టటం దేనికి?" అని సుచరిత పానుబాబు నడిగింది. ఆమెధాటికి పానుబాబు విస్తుపోయాడు.

ఆటుతరవాత బ్రహ్మసమాజంలో పరేశబాబును గురించి తరచు చర్చలు జరుగుతూ వచ్చాయి. వాటిని అరికట్టట మెలాగో సుచరితకు అంతుచిక్కలేదు.

ఇదంతా ఇలా ఉండగా పరేశబాబును ఆయన భార్య, సుచరితకూ పాను బాబుకూ త్వరగా పెళ్ళి చెయ్యమని తొందర పెట్టసాగింది.

ఈ సమయంలోనే పానుబాబు, పేరుచెప్పకుండా, పరేశబాబు మీద ఒక వ్యాసం రాశాడు. పరేశబాబు బ్రహ్మసమాజాదర్శాల గురించి పతన మవుతున్నాడని ఆ వ్యాసంయొక్క తాత్పర్యం. సుచరిత ఆ వ్యాసాన్ని చూసి, చించి ముక్కలు ముక్కలు చేసేస్తుండగా పానుబాబు వచ్చాడు. వచ్చి, "సుచరితా! ఇవాళ నీతో

అతిముఖ్యమైన విషయం ఒకటి మాట్లాడాలి," అన్నాడు. సుచరిత వినిపించుకోక, అతని వ్యాసాన్ని ఇంకా చిన్నచిన్న తుంపులు చెయ్యటంలో నిమగ్నురాలయింది.

ఇంతలో లలిత అక్కడికి వచ్చింది. ఆమెతో పానుబాబు, "నేను సుచరితతో మాట్లాడాలి" అన్నాడు. కాని లలిత వెళ్ళిపోబోతుంటే పోనీకుండా సుచరిత పట్టి, తనపక్కన కూర్చోబెట్టుకున్నది.

వాతావరణాన్ని పసిగట్టలేని పానుబాబు, "చూడు సుచరితా, మన వివాహం వాయిదాపడటం ఇంకెంతమాత్రమూ భావ్యంకాదు. పరేశబాబుతోకూడా మాట్లాడాను. వచ్చే ఆదివారంగాక పై ఆదివారంనాడు—" అని ఆరంభించాడు

"వల్లకాదు," అన్నది సుచరిత.

పానుబాబు దిమ్మరపోయి, "వల్లకాదా? అంటే? మరికొంచెం ఆవతలగా ముహూర్తం పెడదామంటావా?" అన్నాడు.

"లేదు" అన్నది సుచరిత.

"మరి నీ ఉద్దేశం?"

"నాకి పెళ్ళి ఇష్టంలేదు."

"ఇష్టంలేదా? అంటే?"

లలిత కలిగించుకుని, "పానుబాబుగారూ మాతృభాష మరిచారా ఏమిటి?" అన్నది వెటకారంగా.

"మాతృభాష రాకపోవటంకన్నా దారుణం ఇతరులు పదేపదే అన్నమాటలు అర్థం చేసుకోలేకపోవటం — అందులోనూ నేను గౌరవించిన మనిషిమాటలు!" అన్నాడు పానుబాబు.

"నేను మిమ్మల్ని ఏమాత్రమూ తప్పుపట్టను," అన్నది సుచరిత.

"నా తప్పేమీ లేనప్పుడు నన్నిలా అవమానించటం దేనికి?"

"అవమానం నాదే. ఎందుకంటే నేను మిమ్మల్ని—" అని సుచరిత అంటుండగా బయటినుంచి వినయుడి పిలుపు వినపడింది, సుచరిత అతన్ని లోపలికి రమ్మన్నది. వినయుడు లోపలికి వచ్చి, తాను చాలా రోజులుగా రానందుకు క్షమాపణ చెప్పుకున్నాడు. తాను సుచరితతో అతిముఖ్యమైన విషయం మాట్లాడుతున్నానని పానుబాబు అనేసరికి, వినయుడు వెళ్ళిపోబోయాడు. కాని సుచరిత అతన్ని పోనివ్వక, తమ సంభాషణ అయిపోయిందని చెప్పి, అతన్ని కూర్చోబెట్టింది. పానుబాబు ఆట కట్టయింది, కాని అతను తాను తేల్చుకోదలచినది తేలేదాకా ఆ గది నుంచి పోదలచలేదు.

ఈలోపల ఆ గదిలో మరొక నాటకం జరుగుతున్నది. వినయుడి గొంతు వినిపించిన క్షణంలోనే లలితకు తత్తరంలాటిది కలిగింది. అతనితో మామూలుగా మాట్లాడటం ఆమెకు సాధ్యంకాలేదు. వినయుడికికూడా లలితను పలకరించే సాహసం లేకపోయింది. కాని ఆ ఇద్దరి మధ్య జరిగిన నాటకం పానుబాబు గ్రహించి, పరేశబాబుపై ఆగ్రహించాడు. ఆయన తన కుమార్తెలను బ్రహ్మ సమాజంలో లేనివాళ్ళ కెందుకు పరిచయం చేశాడు?

పానుబాబుకు వెళ్ళిపోయే ఉద్దేశం లేదని గ్రహించి సుచరిత వినయుణ్ణి పెద్దమ్మను చూడటానికి తీసుకుపోయింది.

లలిత పానుబాబుతో, "మీకు నాతో మాట్లాడే దేమీ లేదనుకుంటాను?" అన్నది.

"లేదు కావలిస్తే నువుకూడా వాళ్ళతోబాటు వెళ్ళిపోవచ్చు." అన్నాడు పానుబాబు—ఆమెకు తన అనుమతి అవసరమైనట్టు.

"అవును. నేను వినయబాబుతో మాట్లాడాలి; ఈలోపల మీరు కాలక్షేపానికి మీ వ్యాసం చదవదలిస్తే - అన్నట్టు దీదీ దాన్ని తుంపులు తుంపులుగా చించేసింది కదూ! కావలిస్తే ఇది చదువుకోండి." అంటూ వెనక వినయుడు సుచరితకు తెచ్చి ఇచ్చిన గోరా వ్యాసాలకట్టను మూలనుంచి తీసి, పానుబాబు ముందు పెట్టి, పైకి వెళ్ళిపోయింది.

కొంచెంసేపుండి పానుబాబు విసిగి, పరేశబాబు భార్యను వెతుక్కుంటూ వెళ్ళి, సుచరిత తనను పెళ్ళాడనంటున్నదని చెప్పేశాడు.

"పానుబాబూ, మీ మెత్తదనమే దాన్నిలా చేస్తున్నది. మీరు మాత్రం గట్టిగా నిలబడండి. అది ఎలా చేసుకోదో చూస్తాం." అన్నా దావిడ ఉగ్రురాలై పోయి.

గట్టిగా నిలబడటంగురించి పానుబాబు కొకరు చెప్పే పనేలేదు.

"సిద్ధాంతంకోసం నేను గట్టిగా నిలబడితీరాలి. సుచరితను విడిచిపుచ్చటం నాకో లెక్కలోది కాదు. కాని ఈ విషయంలో బ్రహ్మసమాజ ప్రతిష్ఠ నిలబెట్టవలసి ఉంది." అన్నా డతను.

వారద హరిమోహిని గదికి వెళ్ళి, "ఇక్కడున్నావా, మహారాణీ! నే నప్పుడే అనుకున్నాను. పాపం, పానుబాబు పొద్దుట్నుంచీ నీకోసం పడిగాపు లున్నాడు. నీ కీ చేష్ట లెవరు నేర్పుతున్నారో నా కర్థం కాకుండా ఉంది. ముగ్గురు కూతుళ్ళను నేను పెంచాను గాని ఇలాటి దెన్నడూ ఎరగను. బ్రహ్మసమాజంలో ఎలా తల ఎత్తుకు తిరిగేటట్టు?" అన్నది.

"నీ కోసం ఎవరో కాచుకున్నారని నాకు తెలీదు, తల్లీ! వెళ్ళు వెళ్ళు," అన్నది హరిమోహిని. సుచరిత కిందికి వెళ్ళిపోయింది.

"నీ కిక్కడ పనేమైనా ఉన్నదా, లలితా?" అని వారద అడిగింది.

"అవును. చాలా రోజు లయాక వినయబా బొచ్చారు. నే నాయనతో మాట్లాడాలి," అన్నది లలిత.

లలిత మొరాయించిందని గ్రహించి ఆమె తల్లి, వినయుణ్ణి పలకరించకుండానే కిందికి వెళ్ళిపోయింది.

సుచరిత కిందకి వెళ్ళి పానుబాబుకు ఎదురుగా నిలబడి, "నాతో ఏదో చెప్పాలని వేచిఉన్నారుట; ఏమి టది ?" అని అడిగింది.

"సుచరితా! నువు నాకు అన్యాయం చేశావు," అన్నా డతను.

"మీరూ నా కన్యాయం చేశారు."

"నేను ఇచ్చిన మాటమీదనే నిలబడిఉన్నాను."

అన్యాయం మాటలతోనే చెయ్యాలా ? మాటకన్న సత్యం ఎక్కువకాదా ? ఒక పొరపాటు మళ్ళీమళ్ళీ చేశానుగనక దానికి నేను కట్టుబడాలా ? నేను ఇచ్చిన మాట దక్కించుకోలేను. అలా చెయ్యడం తప్పవుతుంది," అన్నది సుచరిత.

సుచరిత ఇలా ఎందుకు మారిపోయిందో పానుబాబుకు అర్థంకాలేదు. తన మొండిపట్టుదలవల్లనే సుచరిత తన సహజవిగ్రహం కోల్పోయిందని అతనికి తట్టనైనాలేదు. అందుచేత అతను తప్పంతా ఆమె కొత్త స్నేహితులపైన తోశాడు.

"ఏం పొరపాటు చేశానని తెలుసుకున్నావు ?" అని అత నడిగాడు.

"దాంతో మీ కేం పని ? నేను పెళ్ళాడనన్నది చాలదా ?"

"కాని బ్రహ్మసమాజం నిన్ను తప్పక సంజాయిషీ అడుగుతుంది. ఏం చెబుతావు ? మన సభికులకు నే నేం చెప్పాలి ?"

"నేనుమటు కేమీ చెప్పను. మీరు కావలిస్తే సుచరిత మరీ పసిదనో, బుద్ధిలేనిదనో, నిలకడ లేనిదనో చెప్పండి. మీ రేం చెప్పినాసరే, మనిద్దరిమధ్యా చర్చించేటందు కేమీలేదు," అన్నది సుచరిత.

ఇంతలో పరేశబాబు వచ్చాడు. పానుబాబు, అవతలికి వెళ్ళిపోతున్న సుచరితను, "వెళ్ళిపోకు. పరేశబాబు సమక్షంలో ఇది తేలాలి," అన్నాడు. సుచరిత పోతున్నదల్లా ఆగింది.

"పరేశబాబూ! ఇంతా అయాక సుచరిత నన్ను పెళ్ళాడ నంటోంది. పెళ్ళి

లాటి ముఖ్యవిషయంలో ఆమె ఇలా ప్రవర్తించటం భావ్యమేనా? ఇందులో మీ బాధ్యతకూడా కొంత వుండదూ?" అన్నాడు పానుబాబు.

పరేశబాబు సుచరిత తల నిమిరి, మృదువుగా, "అమ్మా, నువ్వు వుండనవసరంలేదు. వెళ్ళిపోవచ్చు." అన్నాడు. కృతజ్ఞతతో చెమ్మగిల్లే కళ్ళతో సుచరిత వెళ్ళిపోయింది.

"సుచరిత తన మనసుకు తానే అర్థం చేసుకోకుండా పెళ్ళికి అంగీకరించిందన్న అనుమానంతోనే నేను నిశ్చితార్థం గురించి తటపటాయించాను," అన్నాడు పరేశబాబు.

"ఆమె మంచికోరి మీ రేమీ సలహా ఇవ్వరా?" అని పానుబాబు అడిగాడు.

"ఆమె మంచికోరకుండా ఎన్నడూ సలహా ఇవ్వనని మీరు గ్రహించాలి."

"అలాగే మీరు చేసిన పక్షంలో ఇంతదాకా వచ్చేది కాదేమో? మీ పొరపాటు వల్లనే మీ కుటుంబపరిస్థితు లిలా పరిణమించాయని మీ ముఖంఎదటే నే నంటాను."

పరేశబాబు చిరునవ్వు నవ్వి, "నా కుటుంబానికి నేను బాధ్యత వహించకపోతే మరెవరు వహిస్తారు?" అన్నాడు.

"కాని, చూస్తూండండి, మీరు పశ్చాత్తాపపడే రోజు వస్తుంది."

"పశ్చాత్తాపం భగవదనుగ్రహం లేనిదే కలగదు. పానుబాబూ! నేను తప్పు చేయ్యటానికి వెరుస్తానుగాని, పశ్చాత్తాప పడటాని కెన్నడూ వెరవను."

సుచరిత తిరిగివచ్చి, "నాన్నా, మీ పూజకు వేళఅయింది," అని పరేశబాబుతో అన్నది.

పానుబాబు వెళ్ళిపోయాడు.

## 2

తన జీవితంలో ఒక విషమఘట్టం వచ్చినట్టు సుచరిత గ్రహించింది. తాను తన లోపలా, వెలపలా ఇంత ఘర్షణను ఎదుర్కోవలిసి వస్తుందని ఆమె ఊహించ లేదు. గోరాపట్ల ఆమెకు గలభావం, అతను అరెస్టయాక మరింత ప్రస్ఫుటమయింది. అయితే దాన్ని గురించి ఆమె ఎవరితోనూ చెప్పలేదు. తానుకూడా ఆలోచించటానికి భయపడింది. ఆలోచింతామన్నా ఆమెకు ఏకాంతం దొరకలేదు—పానుబాబు బ్రహ్మ సామాజకులను ఆమెపైకి ఉసికొల్పుతూవచ్చాడు.

ఇంతకన్న ఆమెను హెచ్చుగా బాధించినది 'పెద్దమ్మ' సమస్య. ఆ సమస్య వెంటనే పరిష్కారం అయితీరాలి. వారద సుచరితమనసును మళ్ళించలేకా, తన భర్తను తనపక్షం చేసుకోనూలేకా, తన అక్కన్నంతా హరిమోహినిపైన వెళ్ళ

గక్కింది. "చూడండి. మీ రీ ఇంటో ఎంతకాలం ఉన్నా నా కభ్యంతరంలేదు. మేం సంతోషంగా మీభారం మోస్తాం. కాని మీ పూజావిగ్రహాలుమాత్రం ఇక్కడ ఉండటాని కెంతమాత్రమూ వీల్లేదు," అన్న దామె హరిమోహినితో.

ఆమె ఆ మాట అన్నప్పుడు వినయుడు హరిమోహినిగదిలోనే ఉన్నాడు. ఆతనికి మండుకొచ్చింది. "మా అమ్మ దగ్గరికి తీసుకుపోతాను. పిన్నీ! నీ మూటా ముల్లె సర్దుకో," అన్నా డతను

"న న్నెక్కడికన్నా తీర్థానికి తీసుకుపో బాబూ!" అన్నది హరిమోహిని. పాపం, ఆమె చాలాకాలం తీర్థాలలో గడిపింది భగవంతుడిమీద మనస్సు లగ్నం వెయ్యాలని యత్నించింది. కాని ఆమెకు మనిషివాపి జాస్తి. మనస్సు భగవంతుడి మీద నిలవలేదు. తన చెల్లెలిపిల్లలైన సుచరితా సతీశులను కలుసుకోగానే ఆమెకు ప్రాణం లేచివచ్చింది. ఇప్పుడు దానికికూడా విఘాత కలుగుతున్నది. ఇక ఈ ఇంట్లో తనకు స్థానంలేదు.

"ముందు మా అమ్మ దగ్గరికి వచ్చిఉంటే, అటునుంచి ఏ తీర్థానికైనా తీసుకు పోతాను," అన్నాడు వినయుడు. హరిమోహిని ఆ చూరుకింద క్షణం ఉండటం ఆతనికి సమ్మతంగాలేదు

హరిమోహిని తన సామానంతా సర్దుకోవటం చూసి సుచరిత, "ఈ రాత్రివేళ ఎక్కడికి వెళతావు, పెద్దమ్మా? రేపు తెల్లవారనీ చూద్దాం. నాన్నతో చెప్పకుండా వెళ్ళిపోతే ఆయన నొచ్చుకోరూ?" అన్నది.

ఆమాట నిజమేనని వినయుడుకూడా ఒప్పుకున్నాడు.

పరేశబాబే హరిమోహిని సమస్యకు పరిష్కారమార్గం చూపాడు ఆయన సుచరితతో, "మీ పెద్దమ్మ ఎక్కడికో వెళ్ళిపోవటం దేనికి, తల్లీ? నీ ఇంట్లోనే ఉంటుంది," అన్నా డాయన.

"నా ఇంటోనా?" అన్నది సుచరిత ఆశ్చర్యంగా.

"అవునమ్మా. కలకత్తాలో నీ కో యిల్లున్నది, సతీశుడి కో యిల్లున్నది. మీ నాన్న నాకు అప్పగించిపోయిన ఆస్తిమీద వడ్డీ చేర్చి, మీ ఇద్దరికీ చెరొక ఇల్లూ కొన్నాను. వాటిమీద మీకు బాడుగకూడా వస్తున్నది. నీ ఇల్లు ఈమధ్యనే ఖాళీ అయింది. అందులో మీ పెద్దమ్మ సుఖంగా ఉండవచ్చు. ఎంతోదూరంకూడా లేదు. మన ఇంటిపక్క సందులో మూడోయిల్లు," అన్నాడు పరేశబాబు.

"ఆ ఇంట్లో ఆమె ఒంటరిగా ఉండగలదా?" అన్నది సుచరిత.

"ఒంటరిగా ఎందుకుండాలి. నువుకూడా ఉండు. ఇల్లు దగ్గిరేగనక నువు దూరం రానవసరం కూడాలేదు."

సుచరిత ఇతరులు గీసే గిరులు దాటి అవతలికి వెళ్ళి తన స్వేచ్ఛాజీవితం తాను జీవించదగిన సమయం వచ్చిందని పరేశబాబు అదివరకే గ్రహించాడు. ఇక నుంచి ఆమె తనబాట తానే వెతుక్కుంటుంది. తనకు ప్రాప్తించే సుఖదుఃఖాలను తానే ఎదుర్కొంటుంది.

మర్నాడుఉదయం హరిమోహిని పరేశబాబువద్ద శలవు తీసుకుని, తన చెల్లెలి పిల్లల కాయన చేసిన ఉపకారానికి కృతజ్ఞత తెలుపుతూండగా. వినయుడు వచ్చి, ఆమెను తీసుకుపోవటానికి ఆనందమయి వచ్చి కింద ఉన్నదని చెప్పాడు. సుచరిత చప్పున కిందికి దిగిపోయింది.

"నేను ముందుగా వెళ్ళి మీకు ఇల్లు సిద్ధంచేస్తాను," అంటూ పరేశబాబు వెళ్ళిపోయాడు. హరిమోహినికోసం ఒక ఇల్లు సిద్ధంగా ఉన్నదనీ, అది సుచరిత సొంత ఇల్లనీ విని వినయు డాశ్చర్యపడ్డాడు.

కొంచెంసేపటికి ఆనందమయి, సుచరితా లలితలను వెంటబెట్టుకుని పైకి వచ్చింది. హరిమోహిని ఆప్యాయంగా ఆమెను తనసరసన కూచోపెట్టుకున్నది. వాళ్ళు మాట్లాడుకుంటుండగా సతీశు దొక కుక్కపిల్లను తెచ్చి పెద్దమ్మ కివ్వబోయాడు. ఆ అపవిత్రజంతువును చూసి కంగారుపడి హరిమోహిని. "దాన్ని లోపలికి తీసుకురాకురా బాబూ." అంటూ దూరంగా తొలగింది.

వారద పైకి వచ్చి ఆనందమయినీ, వినయుణ్ణీ భోజనానికి పిలిచింది. తనకు ఎక్కడ భోజనం చెయ్యటానికీ అభ్యంతరం లేదుగాని ప్రస్తుతం ఆకలి లేదని ఆనందమయి అన్నది; వినయుడు ఆ అనాచారుల భోజనం చెయ్యటానికి ఎగిరి గంతేశాడు. ఇది చూసి హరిమోహిని నిర్ఘాంతపోయింది. ఆమె ఆనందమయిని నోరు చేసుకుని అడిగిందికూడా.

"ఏం చెయ్యను? నా కులాన్ని ఆ ఈశ్వరుడే లాగేశాడు," అన్నది ఆనందమయి. ఆమెకు బలవంతంగా ఎవరో కిరస్తానీమతం అంటగట్టారు కాబోలనుకున్నది హరిమోహిని.

ఉదయం సుచరిత ఆఖరుసారి పరేశబాబు ప్రార్థనకు అన్ని సన్నాహాలూ చేసి ఆయన వెంట ఉన్నది. వాళ్ళు బయటికి వచ్చేసరికి పానుబాబు వచ్చి ఉన్నాడు. సుచరిత మరొక ఇంటికి వెళ్ళిపోతున్నదనీ, ఆ ఇంట తనకు ప్రవేశ ముండదనీ గ్రహించి, ఆతను ఈ పూటనే తాడోపేడో తేల్చాలని నిశ్చయించుకున్నాడు.

సుచరితను చెయ్యి జారిపోవిచ్చే ఉద్దేశం అతని కెంత మాత్రమూ లేదు. సుచరితను చూడగానే అతను కుర్చీలో నిక్కి కూర్చుని, "సుచరితా ఈ నాడు నీ పతనం ప్రారంభమయింది. ఇది మాకు దుర్దినం," అన్నాడు.

"పతన మవుతున్నదీ, పురోగమిస్తున్నదీ ఎవరి అంతరాత్మలో వారికి తెలుస్తుంది," అన్నాడు పరేశబాబు.

పానుబాబు పరేశబాబు అంతరాత్మను అధిక్షేపించటానికిగాను, ఆనాడు లలితా-వినయులు ఒకే స్టీమరులో ప్రయాణించిన విషయం ప్రస్తావించి, ఆయన తన కూతుళ్ళకు బ్రహ్మసమాజేతరుల పరిచయం కలగనిచ్చినందుకు తప్పు పట్టాడు.

"ఈ విషయాలతో మీ కేమిటి సంబంధం?" అని సుచరిత పానుబాబును కోపంతో అడిగింది. తాను సమాజం తరపున మాట్లాడుతున్నా నన్నాడు పానుబాబు.

"బ్రహ్మసమాజం మిమ్మల్ని జడ్జిగా నియమించిన పక్షంలో మేం దానికి దూరంగా ఉండటం మంచిది," అన్నది లలిత.

"అమ్మా, లలితా! ఈపూట సుచరిత వెళ్ళిపోతున్నది. ఈ కీచులాటిప్పుడొద్దు. పానుబాబూ! మా వల్ల ఏ తప్పులు జగిరినప్పటికీ ఈ సమయాన మీరు మమ్మల్ని క్షమించాలి," అన్నాడు పరేశబాబు. పానుబాబు నోరు మూసుకోవలసివచ్చింది.

సుచరిత హరిమోహినివద్దకు వెళ్ళి, "పెద్దమ్మా, ఈపూటకు వాళ్ళందరి పంక్తినా భోంచేస్తాను. నువ్వేమీ అనుకోకు," అన్నది. హరిమోహిని కిదేమీ అర్థంకాలేదు. సుచరిత పూర్తిగా ఆచారవంతురా లయిందని ఆమె నమ్మింది.

"అంచే అన్నావుగాని, ఆ రామ్‌దీన్ గాడి చేతినీళ్లమాత్రం తాగకు," అన్న దామె.

"అదేమిటి పెద్దమ్మా? వాడేగా రోజూ ఉదయం నీకు ఆవుపాలు పితికి తెచ్చేదీ?" అన్నది సుచరిత.

"అంత విడ్డూరంగా మాట్లాడతా వేమిటే? పాలూ, నీరూ ఒకటా?" అన్నది హరిమోహిని.

"సరే పోనీగాని సతీసుడికి మాత్రం అంక్ష లేమీ పెట్టకు. వాడు పద్దన్న పనే చేస్తాడు." అన్నది సుచరిత.

"వాడిదారి వేరు!" అన్నది హరిమోహిని.

సతీసుడు మగవాడు; వాళ్ళు అన్ని నియమాలూ ఉల్లంఘించవచ్చు.

# 3

పానుబాబు ధ్వజమెత్తాడు. లలిత వినయుల పడవప్రయాణం గురించి అతను బ్రహ్మసమాజప్రముఖు లందరినీ రెచ్చగొట్టాడు. అది కారుచిచ్చులాగా వ్యాపిం

చింది. అతను సుచరిత పతనమై నిష్ఠాచారంలో పడిపోయిందనీ, మూఢవ్రతాలూ, నియమాలూ పాటిస్తున్నదనీకూడా ప్రచారం సాగించాడు.

సుచరిత వెళ్ళిపోయాక లలిత చివరంటా పోరాటం సాగించ తీర్మానించు కున్నది. ఆమె వినయుణ్ణి గట్టిగా ప్రేమిస్తున్నది. అతని కంఠం వింటేచాలు, ఆమె గుండె గబాగబా కొట్టుకుంటుంది. అతను రెండుమూడురోజులు కనిపించక పోతే ఆమె ప్రాణం గిలగిలలాడుతుంది.

ఈ మనోవేదనకు తట్టుకోలేక లలిత ఆడపిల్లలబడి పెడదామని ఆలోచించింది. పరేశబాబు నడిగితే, అందుకు చాలా డబ్బు కావాలనీ, అనేకమంది సహకరించాలనీ అన్నాడు. లలిత సుచరిత ఇంటికి వెళ్ళి, తన ఆలోచన చెప్పింది.

"దానికి నియమాలూ, నిబంధనలూ, నిర్వాహకమూ కోలెడన్ని కావాలి ఆడపిల్లలం మనవల్ల ఏమవుతుంది?" అన్నది సుచరిత.

"అదే అనొద్దు. మనం ఆడపిల్లలుగా పుట్టాంగనుక నాలుగుగోడలమధ్య నలిగి పోవాలా? మనవల్ల ప్రపంచానికేమీ మేలు జరగగూడదా?" అన్నది లలిత. ఆమాట అన్న మీదట సుచరితలోకూడా చైతన్యం వచ్చింది.

ఈ స్కూలు విషయంలో లావణ్యకూడా ఉత్సాహం చూపింది. ఆమె చుట్టు పక్కల ఉండే ఆడపిల్లలను కూడగట్టాలని చూసింది; కాని బ్రహ్మసమాజస్త్రీలు నడిపేబడికి హిందువులు తమ కూతుళ్ళను పంప నిరాకరించారు.

లలిత నిరుత్సాహం చెందక పేద బ్రహ్మసామాజికుల ఆడపిల్లలతో బడి నడపవచ్చునన్నది. అరడజను విద్యార్థినులతో కొద్దిరోజులపాటు బడి సాగింది. కాని క్రమంగా విద్యార్థినులు ఒక్కొక్కరే జారుకున్నారు. ఒకరోజు బడికి ఎవరూ రాలేదు. లలిత పనిపెట్టుకుని దగ్గరలో ఉండే విద్యార్థినుల ఇళ్ళకు వెళ్ళి కారణం అడిగింది. పెద్దవాళ్ళు అయోమయమైన కారణాలు చెప్పారు. అసలు కారణం సుధీరుడు చెప్పాడు — హారానబాబు ఈ బడికి విరుద్ధంగా కత్తికట్టాడు — కారణం వినయుడూ, లలితా కొన్నివారాలక్రితం చేసిన పడవప్రయాణం.

"అంతేకాదు; వినయుడూ, అతని మిత్రులూ ఈ బడిలో చల్లగా దూరుతారని భయం," అన్నాడు సుధీరుడు.

"భయమా! అంతకన్న అదృష్ట మేముంటుంది? అలనిలో సగం తెలివితేటలున్నవాళ్ళను వాళ్లు సంపాదించగలరా?" అన్నది లలిత. బ్రహ్మసమాజాన్ని శుద్ధంగా ఉంచటంకోసం సమాజోద్ధారకులు ఇలాటి పద్ధతుల నవలంబించటం ఆమెకు అసహ్యం పుట్టించింది.

ఆమె సుచరితవద్దకు వెళ్ళి, "దీన్ని నేను సహించను; ప్రతిఘటించి తీరుతాను."

"ఏవిధంగా ప్రతిఘటిస్తావు ?'' అని సుచరిత అడిగింది.

"నాకు తెలీదు. నే నింకా ఆలోచించలేదు. మనవంటి అసహాయబాలికలపై ఇలా చాటుమాటు దెబ్బ తీసేవాళ్ళు పిరికిపందలు. వీళ్ళచేత నేను చచ్చినా ఓడిపోను."

"నాన్నగా రేమంటారో తెలుసుకోవటం మంచిదికాదూ ?" అన్నది సుచరిత.

లలిత ఇంటికి బయలుదేరింది. తలవాకిలివద్ద వినయుడు తలవంచుకుని బయటికి వస్తూ ఎదురయాడు. ఆమెను చూసి అతను క్షణం ఆగి, ఏదో ఆలోచించినవాడల్లే కనబడి, తనను తాను నిగ్రహించుకుని, ఆమెకేసి తలవంచి వెళ్ళిపోయాడు. లలిత హృదయాన్ని శూలాలు పొడిచినట్టయింది. ఆమె గబగబా లోపలికి వెళ్ళి తన తల్లితో, ''ఇప్పు డిక్కడికి వినయబాబు వచ్చారా ?" అని అడిగింది.

"నే నిప్పుడు పనిమీద ఉన్నాను. నన్ను విసిగించకు." అన్నది వారద.

''ను వ్వాయనతో ఏమన్నావేం ?''

''అబ్బో, దానికంతా చాలా ఉందిలే.'

''నన్నుగురించి మాట్లాడావా, లేదా ? అది చెప్పు చాలు !''

''మాట్లాడాను తల్లీ ! ఎందుకు మాట్లాడను ? సమాజంలో అంతా మననిగురించి మాట్లాడుకునేవాళ్ళే. అందుచేత అతన్ని హెచ్చరించవలసివచ్చింది."

లలితముఖం అవమానంతో జేవురించింది. "వినయబాబును ఇంకమీదట రావద్దని నాన్న అన్నారా ?" అని ఆమె అడిగింది.

"ఆయన కీ విషయాలు తలకుపట్టేమాటుంటే ఇంతదాకా వచ్చేదేకాదు."

'' పానుబాబు మాత్రం ఇక్కడికి వస్తూ ఉండవచ్చునా ?"

"ఎలా అడుగుతోందో ! పానుబాబు రావటాని కేం ?"

"అయితే వినయబాబు రావటానికిమటు కేం ?"

''లలితా, నీతో వాదిస్తూ కూర్చోవటానికి నాకు తీరిక లేదు, చచ్చేటంత పని ఉంది," అన్నది వారద.

లలిత బడిలో ఉండే సమయం చూసి ఆవిడ వినయుణ్ణి పిలిపించి, చెప్పవలసినవి నాలుగూ చెప్పేసింది. లలితకు తెలియబోతుందా అనుకుంటే లలిత సమయానికి తిరిగివచ్చి, అంతా తెలుసుకున్నది.

లలిత మనసులో తుఫాను చెలరేగుతున్నది. ఆమె వెళ్ళి, ఉత్తరాలు రాసుకుంటున్న తన తండ్రివి, ''నాన్నా, వినయబాబు మనింటికి రాతగరా ? అని అడిగింది.

యువ.

ఆ మాటతో పరేశబాబు పరిస్థితి గ్రహించి, ''నా ఉద్దేశంలో వినయుడు నిజంగా చాలా సత్పురుషుడు. అతని శీలమూ, తెలివితేటలూ, సంస్కృతీ ఉన్నతమైనవి.'' అన్నాడు.

''గౌరబాబు తల్లి రెండుసార్లు ఇదివరకే మనింటికి వచ్చారు, సుచీదీదీని వెంటబెట్టుకుని వారింటికి పోదా మనుకుంటున్నాను,'' అన్నది లలిత.

పరేశబాబు కొంచెం ఆలోచించి, ''అలాగే వెళ్ళరండి, నేను కూడా వచ్చి ఉందును గాని నాకు తీరిక లేదు,'' అన్నాడు.

# 4

తాను పరేశబాబు ఇంటికి వస్తూ పోతూ ఉండటాన ఇంత రభస జరుగుతుందని వినయుడు కలలోకూడా అనుకోలేదు లలితను గురించిన ప్రవాదు అతనికి పిడుగుపాటయింది. అతనికి లలితపట్ల గల భావం సామాన్య స్నేహానికి మించినది. ప్రస్తుత పరిస్థితులలో అలాటి భావం అనుచిత మని అతనికి తెలుసు. దీనివల్ల పరేశబాబు కుటుంబానికీ తనకూ మధ్య ఒక సందిగ్ధ బాంధవ్యం ఏర్పడింది. ద్వారంవద్ద లలిత ఎదురైనప్పుడు అతను తన తప్పు ఒప్పేసుకుందా మనుకున్నాడు. గాని అది సాధ్యంకాక, తలవంచి వచ్చేశాడు.

దారిలో సతీశుడు అతన్ని పేరుపెట్టి పిలిచాడు. ఆ కుర్రవాణ్ణి చూడగానే వినయుడికి కంట నీరు తిరిగి, గొంతు బిగుసుకుపోయింది. దానితో అతనికి పరేశబాబు కుటుంబంతో తనకుండిన పరిచయం ఎంత మధురమైనదో తెలిసివచ్చింది. అతను సతీశుణ్ణి తన ఇంటికి తీసుకుపోయి, మిఠాయి తినిపించి, పరేశబాబు ఇంటిదాకా సతీశుణ్ణి దిగబెట్టి, లోపలికి రమ్మని సతీశు డెంత మారాం చేసినా, వెళ్ళకుండా, ఆనందమయివద్దకు వెళ్ళాడు.

"ఏం, వినయా? ఎందు కలా పాలిపోయివున్నావు?" అని అడిగింది ఆనందమయి.

"అమ్మా, నేను మొదట్లో పరేశబాబింటికి వెళుతున్నప్పుడు గోరా ఆగ్రహిస్తే, అతని ఆగ్రహం పొరపాటనుకున్నాను. పొరపాటు అతని ఆగ్రహంకాదు, నా బుద్ధితక్కువ. మనకూ వాళ్ళకూ సాంఘికాచారాలలో గల తేడాను నేను లక్ష్యపెట్టలేదు. వాళ్ళ సమాజంవాళ్ళు ఎలాటి దుమారం లేపి, ఎంతదారుణమయిన అపవాదు వేశారంటే– నేనక్కడికి ఎన్నటికీ పోలేను," అన్నాడు వినయుడు.

"అంతశ్శాంతి లేకుండా బహిశ్శాంతి వుండటం చాలా దారుణ మంటాడు

గోరా. వాళ్ళ సమాజంలో దుమారం రేగితే, మధ్య నీకు విచారం దేనికి? నీ చిత్త శుద్ధి నీకు ముఖ్యం,'' అన్నది ఆనందమయి.

వినయుడికి తన చిత్తశుద్ధిలో గురికుదరలేదు. అతనికి లలితపైన ఉన్న ప్రేమ మానసికపాపంలాగా అతనికి తోచింది.

''నేను శశిముఖిని పెళ్ళిచేసుకున్నట్టయితే, కాళ్ళూ, చేతులూ కట్టేసి పడేసినట్టుండేవాణ్ణి,'' అన్నా డతను.

''అంటే శశిముఖి నీకు భార్యగా వుండక కట్టుతాడు కావాలనా నీ ఉద్దేశం? ఎంత అన్యాయం!''

ఇంతలో పరేశబాబు కుమార్తెలు వచ్చినట్టు నౌకరు వచ్చి చెప్పాడు. వినయుడు వెళ్ళిపోతానని లేచాడు.

''వెళ్ళకు, కాస్సేపు కిందనే ఉండు,'' అంటూ ఆనందమయి వెళ్ళిపోయింది.

కింద వినయుడికి మహిముడు తగిలి, ''అంతా స్థిరం అయేపోయిందిగదా. ఇంక ఎందుకు —'' అని ప్రారంభించాడు.

''గోరాను తిరిగి రానియ్యి, ముహూర్తం పెట్టుకుందాం,'' అన్నాడు వినయుడు.

''అదెంత? ఇంకా కొద్దిరోజులేగా?'' అంటూ మహిముడు వెళ్ళిపోయాడు.

ఇంతలో వినయుణ్ణి పైకి రమ్మంటూ కబురువచ్చింది. అతను గదిలోకి అడుగు పెట్టగానే అతని అవతారం చూచి సుచరితా లలితలు నిశ్చేష్టిత లయారు. అతను తిన్న దెబ్బ అతని ముఖాన బాగా తెలుస్తున్నది.

ఎన్నడూ అతనితో స్వేచ్ఛగా మాట్లాడలేని లలిత, ''ఇదుగో, వినయబాబూ, మాకు అవసరంగా మీ సలహా కావాలి,'' అన్నది. ఈ మాటలతో అతని పాలి పోయిన ముఖంలోకి జీవం వచ్చింది.

తాము ఆడపిల్లలబడి ప్రారంభింతా మనుకుంటున్నామనీ, హిందువులు తమ పిల్లల్ని పంపకుండా ఉన్నారనీ, స్కూలు నియమావళి వగైరాలు అతను రాసిపెట్టి సహాయం చెయ్యాలనీ లలిత అన్నది. ఆమె సరిగా తన తల్లి వద్దన్నపనే చేస్తూ, వినయుడితో మరింత దగ్గిరసంబంధం కలిగించు కుంటున్నది. సుచరిత భయపడింది.

''మనం నాన్నగారిని సంప్రదించిగాని ఏ నిర్ణయమూ చెయ్యరాదు,'' అన్న దామె, లలిత అన్నమాటలను కొంతవరకు రద్దుచేస్తూ.

కాని లలితధోరణి మారలేదు.

''అవును మరి, నాన్నగారికి చెప్పకుండా ఎలాగ? వినయబాబు సహాయం

చేస్తామన్నారుగనక నాన్నగారితో చెప్పవచ్చు. స్కూలు నడవటంలోకూడా ఆయన సహాయం అనవసరం — మీ సహాయంకూడానూ," అన్నది లలిత ఆనందమయికేసి తిరిగి.

"దానికేం భాగ్యం. మీస్కూలుగదులు చక్కగా ఊడ్చిపెడతాను," అన్నది ఆనందమయి నవ్వుతూ.

తరవాత ఆనందమయి ఒంటరిగా ఉండగా మహిముడు వచ్చి, "వినయుడు కాస్త సుముఖంగా ఉన్నాడు. వాడిబుద్ధి మళ్ళీ మారేలోపున పని జరిగిపోతే బాగుం దును," అన్నాడు.

"ఇంతలో వాడిబుద్ధి ఎప్పుడు మారింది? నా కేమీ చెప్పలేదే?" అన్నది ఆనందమయి.

"ఇంతకుమునుపే మాట్లాడానుగా? గోరా రాగానే ముహూర్తం పెట్టుకుందా మన్నాడు."

ఆనందమయి తల అడ్డంగా తిప్పి, "లేదు మహిమ్. నువు పూర్తిగా పొర పడ్డావు నామాట నమ్ము," అన్నది.

"నువ్వీ విషయంలో జోక్యం కలిగించుకోకుండా ఉంటే అంతా సవ్యంగా జరిగిపోతుంది," అంటూ మహిముడు కోపంగా వెళ్ళిపోయాడు.

* * *

"మనం బ్రహ్మసమాజికులమని హిందువుల పిల్లలు మా దగ్గిర చదువుకో రంటూ ఉన్నారు. అందుచేత ఎవరన్నా హిందువును సాయం తెచ్చుకుంటే ఎలా ఉంటుంది, నాన్నా?" అని లలిత పరేశబాబు నడిగింది.

"హిందువు లెవరు దొరుకుతారమ్మా?" అన్నాడు పరేశబాబు.

"ఏం కష్టం? పనికొచ్చేవాళ్ళు చాలామంది ఉన్నారు వినయబాబుగారు—"

"వినయుడా? అతనెందు కొప్పుకుంటాడు?"

ఇది లలితకు చాలా అవమానమయింది. తాను వినయుణ్ణి ఒప్పించలేకపోతే ఇంకెందుకు? "అతనెందు కొప్పుకోడంటావు?" అన్న దామె.

"కొంచెం ఆలోచించినట్టయితే అతనెంతమాత్రమూ ఒప్పుకోడు."

లలితముఖం జేవురించింది. ఆమె తన చీరకొంగున ఉన్న తాళపుచెవులగుత్తిని గలగల ఆడిస్తూ ఆందోళనతో, "అయితే మరి ఈ స్కూలు సాగదా, నాన్నా?" అన్నది.

"ప్రస్తుతానికి కన్నీ ప్రతిబంధకాలే కనిపిస్తున్నాయి. కాదు కూడదని ముందుకు వెళ్ళావో రకరకాల విమర్శలు బయలుదేరుతాయి."

ఇంత అక్రమాన్ని సహించటం లలితను చాలా బాధపెట్టింది. ఇది పానుబాబుకు విజయం. తన తండ్రికాక మరెవరు తనను తిరోగమించమన్నా లలిత లక్ష్యపెట్టివుండదు. ఆమె లేచి తనగదికి వెళ్ళిపోయింది.

అక్కడ ఆమెకు వచ్చిన ఉత్తరం ఒకటి వున్నది. పెళ్ళాడి, బంకిపూరులో కాపురం చేస్తున్న చిన్ననాటి సహాధ్యాయిని శైలబాల రాసింది. "...నిన్నుగురించి పుకార్లు విని చాలా బాధపడ్డాను. ఒకానొకరు (పేరు చెప్పనక్కరలే) నిన్నుగురించి దారుణమైనవార్త తెలుపుతూ రాశారు. అదే మరొకరు రాస్తే నమ్మకపోదును. నువ్వు నిజంగా ఒక హిందూ యువకుణ్ని పెళ్ళాడదామని చూస్తున్నావా? ఇదే నిజమైతే..."

లలితకు కోపం వచ్చి వెంటనే జవాబు రాసింది.

"...నిజమా, అబద్ధమా అని ప్రశ్నించడం చాలా విడ్డూరంగా వుంది. బ్రహ్మసామాజికుల మాటకు ఇతర సాక్ష్యం కావాలా? ఎవరో హిందూ యువకుణ్ణి నేను పెళ్ళాడజూస్తున్నందుకు నన్ను చూసి నువ్వెంత ఆశ్చర్యపడాలా? నేనొకటి చెబుతాను విను. సుప్రసిద్ధులయిన బ్రాహ్మయువకుల్లో కొందరిని పెళ్ళాడాలంటే నాకు కంపరం పుట్టుకొస్తుంది. ఏ బ్రహ్మకన్య అయినా గర్వంగా పెళ్ళాడదగిన హిందూ యువకులను ఒకరిద్దరిని నే నెరుగుదును. ఇప్పుడింతకంటె నీ కేమీ రాయలేను..."

పరేశబాబు ఆనాడు ఏ పనీ చెయ్యలేక విచారంలో పడిపోయాడు. ఆయన సుచరితవద్దకు వెళ్ళి, "లలితను గురించి గట్టిగా ఆలోచించవలసిన సమయం వచ్చింది," అన్నాడు.

"నాకు తెలుసు నాన్నా," అన్నది సుచరిత.

"నేను అపవాదుగురించి ఆలోచించడంలేదు. లలితకు నిజంగా...

"లలిత ఈమధ్య నాతో మనసువిప్పి చెప్పటంలేదు."

"లలిత చాలా పెద్దసమస్యతో సతమతమవుతున్నది. దాన్ని ఇతరులతో చెప్పదు. వినయుణ్ని మన ఇంటికి స్వేచ్ఛగా రానిచ్చి లలితకు కష్టం తెచ్చి పెట్టానా?"

"వినయుడు నిష్కల్మషుడని నీకు తెలియదా, నాన్నా? అతని స్వభావంలో లొల్లన్నదిలేదు. అలాటివాళ్ళు చాలా అరుదు," అన్నది సుచరిత.

పరేశబాబు మనస్సు అకస్మికంగా తేలికపడింది. ఆయన స్వేచ్ఛగా ఊపిరి తీయగలిగాడు.

"ఇవాళ నీ దగ్గర మంచిపాఠం నేర్చుకున్నానమ్మా." అన్నా డాయన.

"అబ్బే; అదేంమాట, నాన్నా!" అంటూ సుచరిత ఆయన పాదా లంటుకున్నది.

"పాక్షిక బుద్ధి ఆవహించినప్పుడు, మానవుడు ఎనవుడన్న అల్పసత్యాన్ని కూడా మరిచిపోతాం ఆ సుడిగుండంలోపడి. వాడు హిందువుడా, బ్రహ్మసమాజి కూడా అన్నదానికి ప్రాముఖ్యం ఇస్తాం. నే నలాటి సుడిగుండంలోనే పడిపోయాను. లలిత ఆడపిల్లల బడి ప్రారంభించాలని చాలా పట్టుదలగా ఉన్నది; వినయుడి సహాయం తీసుకోవటానికి నా అనుమతి కోరింది." అన్నా డాయన.

"తొందరపడవద్దు, నాన్నా! లేకపోతే అమ్మ చిరాకుపడుతుంది," అన్నది సుచరిత.

నాలుగురోజులు గడిచాక, శైలబాలకు లలిత రాసిన ఉత్తరం పట్టుకుని, పానుబాబు వారదవద్దకు వచ్చి, "ఇదుగో తెరవెనక జరిగే భాగోతం!" అంటూ ఉత్తరాన్ని ఆమె కిచ్చాడు.

ఆమె ఉత్తరమంతా చదివి, "ఈ జరిగే అంతకూ మూలకారణం అనుచరితే దాన్ని మీరంతా బ్రహ్మరథం పట్టి, బ్రహ్మసమాజంలో అలాటి పిల్ల లేదని తెగ పొగిడేశారు. దాని అసలుస్వభావం నాకు మొదటినుంచీ తెలుసు. ఈ ఉత్తరం నాకు చూపటంకూడా దేనికి? మీ కేం చెయ్యాలనితోస్తే అలా చెయ్యండి," అన్నది.

పరేశబాబును పిలిపించి, లలిత ఉత్తరం ఆయన కిచ్చాడు. ఆయన ఆ ఉత్తరాన్ని రెండుసార్లు చదివి "ఏముంది ఇందులో?" అన్నాడు.

"ఇం కేముండాలి? ఇం కెంత సాక్ష్యం కావాలి? విగ్రహారాధన సహించారు. కులతత్వం సహించారు మీ కూతుర్ని హిందువుడి కిచ్చి పెళ్ళి చెయ్యటం ఒకటే తరివాయి! ఆ తరవాత మీరుకూడా హిందువుల్లో చేరిపోయి, ముక్కు మూసుకుని తపస్సు చేసుకోవచ్చు," అన్నది భార్య.

"లలిత హిందువుణ్ణి చేసుకోవటానికి నిశ్చయించినట్టు మీరంతా ఎందు కను కుంటున్నారో నాకు బోధపడలేదు. అలాగని ఈ ఉత్తరంలో ఎక్కడాలేదు," అన్నాడు పాపరేశబు.

"దేనితో మీ కళ్ళు తెరుచుకుంటాయో నా కీ క్షణానికూడా తెలీకుండా ఉంది. ఈ ఉత్తరంలో కన్న స్పష్టంగా రాయటం ఎలా?" అన్నది భార్య.

లలితనే పిలిచి, ఆ ఉత్తరం రాయటంలో ఆమె ఉద్దేశం అడిగి తెలుసుకుందా

న్నాడు పానుబాబు ఎవరూ పిలవకముందే లలిత తుఫానులాగా ప్రవేశించి, "నాన్నా, ఈ ఉత్తరం చూడు. మన బ్రహ్మసమాజంనుంచే ఇలాటి ఆకాశరామన్న ఉత్తరాలు వస్తున్నాయి." అన్నది

పరేశబాబు ఆ ఉత్తరాన్ని చదివారు. ఆ ఉత్తరం రాసిన అనామకుడు లలితా వినయుల పెళ్ళి రహస్యంగా అదివరకే స్థిరపడ్డట్టు భావించి, వినయుడు తన బ్రహ్మ సమాజపు భార్యతో త్వరలోనే విసిగి మరొక హిందూస్త్రీని పెళ్ళాడతాడని జోస్యం చెప్పాడు. ఉత్తరం నిందాపూరితంగానూ లలితకు హితబోధ చేస్తున్నట్టూ ఉన్నది.

పానుబాబు ఉత్తరం తీసుకుని చదివి, "లలితా! ఈ ఉత్తరం చదివి నీ కాగ్రహం కలిగింది కాని అలాటి ఉత్తరానికి కారకురాలు నువ్వే కదా? ఇలాటి ఉత్తరం ను వెలా రాసుకగలిగావు?" అన్నాడు.

"అయితే వినయుడితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నది మీరే నన్న మాట!" అన్నది లలిత.

"సమాజంపట్ల తనకుగల బాధ్యత గుర్తించి, ఆమె నీ ఉత్తరం నాకు చూపింది" అన్నాడు పానుబాబు,

"ఇంతకూ బ్రహ్మసమాజం అనే దేమిటి?" అని లలిత విలవదీసినట్టు అడిగింది.

"నిన్నూ వినయబాబునూ గురించి సమాజంలో అంటూ చెప్పుకుంటున్న మాట నేను నమ్మటం లేదనుకో. అది అబద్ధమని నీ నోటిగుండా వినాలని ఉంది." అన్నాడు పానుబాబు.

లలిత జీగేలున మెరిసేకళ్ళతో, "మా కెందుకు నమ్మకం కలగటంలేదూ?" అన్నది

పరేశబాబు ఆమె భుజంమీద చెయ్యి వేసి, "లలితా, నువ్వు మరీ ఉద్రేకంలో ఉన్నావు ఈ విషయం ఇప్పుడు చర్చించటం మంచిదికాదు. తరవాత నాతో చెబుదువుగాని." అన్నాడు.

"తీరా ఆరంభించిన చర్చను పడగొట్టకండి పరేశబాబూ," అన్నాడు పానుబాబు.

ఈ మాటతో లలిత మరింత రెచ్చిపోయి, "నాన్నను తప్పుపట్ట నవసరం లేదు. ఆయనకు మీలాగా నిజమంటే బెదురులేదు నేను వినయుణ్ణి పెళ్ళాడటంలో తప్పుగాని, అసంభావ్యంగాని ఏమీ లేదంటున్నాను." అన్నది.

"ఆ మన బ్రహ్మమతం పుచ్చుకోవటానికి నిశ్చయించాడా?"

"ఏమిటి దాని అవసరం?"

పరేశబాబు భార్య కలిగించుకుని, "లలితా, ఏమిటి నువ్వనేది? నీ కేమైనా మతి పోయిందా?" అన్నది.

"నా కేమీ మతి పోలేదు. నన్ను నలుగురూ చుట్టుముట్టి ఇలా ఊదర పెడితే నేను సహించను. పానుబాబూ! మీ కొక్క సలహా ఇస్తాను. మీకన్న అన్ని విధాలా గొప్పవాళ్ళకు ఎన్నడూ సలహా ఇవ్వకండి." అంటూ లలిత అక్కడినుంచి వెళ్ళిపోయింది.

జరిగినదంతా లలితనుంచి విని సుచరిత, "నాకు భయంగా ఉంది," అన్నది. బ్రహ్మసమాజంలో ఇంత దుమారం రేగుతున్నది గదా; వినయుడు లలితను పెళ్ళాడనంటాడేమో నన్నదే ఆమె భయం.

''ఆయన ఒప్పుకుంటారు,'' అన్నది లలిత ధీమాగా. తాను తొందరపడి ఏమీ చెయ్యలేదనీ, పానుబాబు ముఠావాళ్ళు తనను ఎంత వేటాడినా తనకు భయంలేదనీ, తాను వాళ్ళకు లొంగేమాట కల్ల అనీ కూడా ఆమె చెప్పింది. తన స్వేచ్ఛకు పరేశబాబు ఎలాటి అవరోధమూ కలిగించడని ఆమెకు స్పష్టంగా తెలుసు.

''నాన్నగారు ఒప్పుకుంటారే అనుకుందాం. ఏం చెయ్యదలిచావు?" అని అడిగి, లలిత జవాబు చెప్పేలోపుగానే, ''నువ్వేమీ చెయ్యక్కర్లేదు. నే నొక ఉపాయం ఆలోచించాను," అనేసింది సుచరిత.

ఆ సాయంకాలం పరేశబాబు సుచరితవద్దకు వచ్చాడు. ఆయన ఆందోళనగా కనపడటం గమనించి సుచరిత కారణ మడిగింది.

''నాకు మరేమీ ఆందోళన లేదు—తాను లేపిన దుమారానికి లలిత తట్టుకోగలదా అని! ఉద్రేకంతో తలఎత్తిన అహంకారం ఫలితాన్ని అనుభవించవలసినప్పుడు నిలబడదు. కనీసం తన భావికర్తవ్యం ఏమిటో లలిత నిర్ణయించుకున్నదా?'' అన్నాడు పరేశబాబు.

"ఒక్కటి చెప్పగలను. లలిత క్రోధావేశంతో ఈ తిరుగుబాటు చెయ్యలేదు. దీనివల్ల ఏనష్టం కలిగినా ఎదుర్కొంటుంది. ఎంతోకాలంగా దాని మనసులో ఉండే భావాలే ఈ దెబ్బతో పైకి వచ్చాయి. లలితలాటి మనిషిని బలవంతాన నిగ్రహించటం మంచికాదు,'' అన్నది సుచరిత.

"కాని వినయుడు బ్రహ్మసమాజంలో చేరుతాడా?"

"ఏమో? మనం వెళ్ళి గౌరబాబుతల్లిని ఒకసారి చూస్తే?"

"నువ్వు వెళితే బాగుంటుం దనుకుంటున్నాను," అన్నాడు పరేశబాబు

# 5

వినయుడికి కూడా ఒక ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది దానిలో ఉన్నదేమంటే: వినయుడు లలితను పెళ్ళాడటం వాంఛనీయంకాదు; అందువల్ల వినయుడికి సుఖం లేకపోగా లలితజీవితం నాశన మవుతుంది; అదీగాక, లలితకు ఊపిరితిత్తుల జబ్బున్నది; క్షయ కావచ్చునని వైద్యులు శంకిస్తున్నారు

మెడమీద తల ఉన్నవా డెవడూ అలాటి ఉత్తరం బనాయిస్తాడని వినయుడనుకోలేదు లలితకూ, తనకూ సాంఘికాచారాలలో గల వ్యత్యాసంవల్ల వాళ్ళిద్దరికీ మధ్య పెళ్ళి అనూహ్యం అందుకనే అతను తన ప్రేమను దోషంగా పరిగణించుకుంటూ వస్తున్నాడు.

అయినా బ్రహ్మసమాజంవాళ్ళలో తనకూ లలితకూ పెళ్ళి సాధ్యమన్నభావం వ్యాపించిఉండటం తెలుసుకుని, అతను ఒకవిధంగా ఆనందం పొందాడు.

ఇంతలో పానుబాబు ప్రత్యక్షమయాడు వెంటనే ఆకాశరామన్న ఉత్తరంవెనక ఏమున్నదీ వినయుడికి తెలిసిపోయింది పానుబాబు వెంటనే అసలువిషయానికి రాక, మనుషుల ప్రవర్తనగురించీ, అందువల్ల ఇతరులకు కలిగే చిక్కులను మనుషులు గ్రహించకపోవటం గురించీ దొంకతిరుగుడుగా ఉపన్యసించసాగాడు.

"ఇదంతా అనవసరం. అసలువిషయానికి రండి. నేను మీదపడి కొట్టను," అన్నాడు వినయుడు.

"మీరు హిందువై ఉండి పరేశబాబుగారింటికి వస్తూ పోతూ, వారికుమార్తెల మీద ప్రవాదం పుట్టేలాగ చెయ్యటం భావ్యమేనా?" అన్నాడు పానుబాబు.

"చూడండి, పానుబాబూ! జనం సృష్టించే ప్రవాదులకు నేను బాధ్యుణ్ణికాను. మీ బ్రహ్మసమాజంవాళ్ళు పరేశబాబుగారి కుమార్తెలను గురించి ప్రవాదులాడటం సమాజంవారికే తలవంపులుగాని, పరేశబాబు కుమార్తెలకుకాదు," అన్నాడు వినయుడు.

"ఒకపిల్ల తన తల్లిచాటున ఉండక, పరాయివాడితో స్టీమరులో ప్రయాణిస్తే నలుగురూ అనుకోరా?"

"బాహ్యసంఘటనలనూ, మనుష్యుల మనస్తత్వాలనూ ఏకంచేసి చూడదలిచిన పక్షంలో మీరు హిందూసమాజాన్ని వదలి బ్రహ్మసమాజంలో ఎందుకు చేరవలిసి వచ్చిందో చెప్పగలరా? అయినా ఈ విషయాలు చర్చించి ప్రయోజనం లేదు. నా ధర్మం ఏమిటో నేను నిర్ణయించుకోగలను. అందులో మీరు నాకు రవంత సహాయంకూడా చెయ్యలేరు."

పానుబాబు వెళ్ళినాక వినయుడు చాలా వ్యధపడ్డాడు. తన కారణంగా పరేశబాబు కుమార్తెలపైన కళంకం ఆపాదించబడటమూ, లలిత భవిష్యత్తుకు అపాయం కలగటమూ అన్న ఆలోచనలు ఆతన్ని బాధించాయి.

వినయుడి ఇంట అతనికీ, పానుబాబుకూ సంభాషణ నడిచే సమయంలోనే అవినాశుడు ఆనందమయివద్దకు వచ్చి, వినయుడు లలితను పెళ్ళిచేసుకోబోతున్నాడనీ, బ్రహ్మసమాజంవాళ్ళద్వారా తనకీ సంగతి రూఢిగా తెలిసిందనీ, వినయుడు చివరకిలాటి పని చేస్తాడని తాను గోరాతో ఏనాడో అన్నాననీ చెప్పాడు. అతను వెళ్ళిపోతూ మహిముడి చెవినకూడా ఈ శుభవార్త వేసి మరీ వెళ్ళాడు.

అవినాశుడి మాటలు ఆనందమయి నమ్మలేదు. వినయుడు లలితను పెళ్ళి చేసుకునేదాకా వస్తే, ఆ సంగతి తనకు ఏనాడో తెలిసేది. వినయుడు చూచాయగానైనా ఆమాట ఆమెతో అనిఉండలేదు. అందుచేత ఆమె ఆపూట వినయుడికి భోజనం పెట్టినాక, "ఏం నాయనా, అలా ఉన్నావు?" అని అడిగింది.

వినయుడు తనకు వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాన్ని ఆమెకిచ్చి, తనకూ పానుబాబుకూ మధ్య జరిగిన ఘర్షణ గురించి చెప్పాడు.

"ఇందులో అపవాదేముంది నువ్వు పరేశబాబు కుమార్తెను పెళ్ళాడబోతున్నట్టు చెప్పుకుంటున్నారటగా?" అన్నది ఆనందమయి.

"మా వివాహం సాధ్యమై ఉంటే అపవాదుండకపోను. కాని అది సాధ్యంకాదు కదా," అన్నాడు వినయుడు.

"నీకు సాహసం ఉంటే లలితను పెళ్ళాడి ఆమెపైన పడిన అపవాదును తొలగించు," అన్నది ఆనందమయి

"ఏమిటమ్మా నువ్వనేది? నీ వినయుడు ఎక్కడినుంచో ఊడిపడ్డాడనుకుంటున్నావా? నేను చేసుకుంటాననగానే లలిత ఎగిరి గంతేస్తుందా?"

"నాకా భయం లేదు. అయినా నీ చేతిలో వున్నపని నువ్వు చెయ్యి. నువ్వు చేసుకోవటానికి సిద్ధంగా ఉన్నాననటానికేం?"

"దాన్ని లలిత అవమానంగా భావిస్తే?"

"కొత్తగా వచ్చే అవమానమేమిటి? మీ రిద్దరూ పెళ్ళాడతారని జనం చెప్పుకుంటూనే ఉందిరిగా?"

"కాని మనం గోరా సంగతికూడా ఆలోచించాలిగా?"

"ఇది గోరాను సంప్రదించే విషయంకాదు. వాడికి కోపం వస్తుందని నాకు

తెలుసు. కాని మన మేం చెయ్యగలం? నీకు లలితపట్ల ఏమాత్రం ఆదరం ఉన్నా వాళ్ళ సమాజంవాళ్ళు ఆమెపైన చేసే దుష్ప్రచారాన్ని అరికట్టితీరాలి."

వాళ్ళిలా మాట్లాడుతుండగా మహిముడు వచ్చి వినయుణ్ణి నానా దుర్భాషలూ ఆడాడు పరేశబాబు కుటుంబం వినయుణ్ణి బుట్టలో వేసుకున్నదన్నాడు వాళ్ళు వినయుణ్ణి నాశనం చేస్తారన్నాడు. అతను వెళ్ళేదాకా వినయుడు తలవంచుకుని, నోరెత్తలేదు.

మహిముడు వెళ్ళగానే ఆనందమయి వినయుడితో, "నీవు వెళ్ళి పరేశబాబుతో మాట్లాడు అలా అయితే అన్ని చిక్కులూ విడిపోతాయి," అన్నది.

ఆమె సుచరితను చూడబోయి, "ఈ గొడవ వినగానే కంగారుపడి వచ్చాను. తప్పు వినయుడిదేనా? వాడు నేరమంతా తనమీద వేసుకుని మహాబాధ పడు తున్నాడు," అన్నది.

"లేదు, లేదు. ఈ అల్లరంతా లలిత చేజేతులా తెచ్చిపెట్టుకున్నదే. ఆ స్టీమరు లోనే లలితకూడా ఎక్కుతుందని వినయబాబుకు తెలియదు. వాళ్ళిద్దరూ కూడబలుక్కుని స్టీమరుప్రయాణం చేసినట్టుగా అంతా మాట్లాడుకుంటున్నారు. అభిమానంకొద్దీ లలిత నిజం చెప్పటంలేదు," అన్నది సుచరిత.

"ఏమైనా దీన్నిగురించి ఏదో ఒకటి చెయ్యలిగదా!" అన్నది ఆనందమయి. లలితకోసం వినయు దేమైనా చెయ్యటానికి సిద్ధంగా ఉంటాడని ఆమె సూచించింది.

"లలితకూడా పెళ్ళికి ఒప్పుకుంటుంది దానిమనసు నాకు తెలుసు. కాని వినయ బాబు తన సమాజాన్ని విడిచిపెడతారా?" అన్నది సుచరిత.

"తప్పనిసరి అయితే విడుస్తాడేమో. కాని అది అవసరమా? నాయింటో దిగి రినవాళ్ళు పాటించే ఆచారాలన్నీ నేను పాటించను. నన్ను వాళ్ళు కిరస్తానీ అంటారు. అంతమాత్రాన అది నాయిల్లు కాకపోయిందా? వాళ్ళు నావాళ్ళు కాక పోయారా? మనుషులు కలపటానికి అభిప్రాయభేదాలు అడ్డురావాలా?" అన్నది ఆనందమయి.

ఈ ధోరణిలో ఆనందమయి చాలాసేపు మాట్లాడింది. వారి సంభాషణ మధ్య లలితకూడా వచ్చింది. కాని ఆనందమయి వాదన సుచరిత అభిప్రాయాన్ని మార్చి నట్టు కనబడలేదు. ఆనందమయికి నిరాశ కలిగింది. అసలుసంగతేమంటే గోరాకు సుచరితను చేసుకోవాలని ఆమె కాంక్ష. గోరాకు హిందువ్ముఅపిల్ల నిచ్చి చెయ్యటం సమ్మతంకాక ఆనందమయి చాలా సంబంధాలు తిప్పికొట్టి, గోరాకు పెళ్ళి ఇష్టం లేదని చెప్పింది. ఇంక రెండుమూడు రోజులలో గోరా విడుదల అయివస్తాడు.

ఈలోపల సుచరితను కదిలించి చూతామనుకున్నది ఆనందమయి. కాని సుచరిత కదలలేదు. దంపతులిద్దరూ ఒకే సమాజానికి చెందిఉండాలన్న విశ్వాసాన్ని ఆమె ఆనందమయి మాటలు విని వదులుకునేలాగా కనబడలేదు.

ఈలోపల వినయుడు పరేశబాబు దగ్గరకు వెళ్ళి, లలితపైన వచ్చిన అపవాదును రద్దుచెయ్యటానికి తాను ఆమెను పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నానని చెప్పాడు.

"ఈ అలజడి అంత ముఖ్యమైనదికాదు. వాళ్ళు ఇవాళ గోలగా చెప్పుకున్నది రేపు మరిచిపోతారు. ఇందుకోసమై నువు తొందరపడి ఎలాంటిత్యాగమూ చెయ్యనవసరంలేదు," అన్నాడు పరేశబాబు.

"నేను అచ్చగా నా ధర్మంగా భావించి ఈ సూచన చెయ్యటంలేదు. మీరు సరే నన్నట్టయితే ఎంతో సంతోషంగా — నేను భయపడిందల్లా —" అని వినయుడు తడువుకున్నాడు.

"నీ భయానికి కారణ మేమీ లేదు. లలితకు నువంటే ఇష్టమని సుచరిత నాతో అన్నది," అన్నాడు పరేశబాబు.

ఒక్కసారిగా వినయుడి శరీరం ఆనందంతో పులకించింది: "నే నామెకు తగిన వాణ్ణని మీకు తోస్తే నాఅంత భాగ్యశాలి ఉండడు," అన్నాడు.

వినయుణ్ణి అక్కడే ఉండమని పరేశబాబు తనభార్యను చూడబోయాడు. తరవాత వినయుణ్ణి పైకిపిలిచాడు. అతన్ని చూస్తూనే పరేశబాబుభార్య, "మతం పుచ్చుకోవటానికి ముహూర్తం నిర్ణయించవలసిఉంటుంది," అన్నది.

"మతం పుచ్చుకోవటం తప్పనిసరా?" అన్నాడు వినయుడు.

"అదేమన్నమాట? తప్పనిసరికాదా? లేకుండా బ్రహ్మసామాజికుల పిల్ల నెలా పెళ్ళిచేసుకుంటారు?" అన్నదామె.

"బ్రహ్మసమాజ మంటే నాకుచాలా అభిమానం. దానికి వ్యతిరేకంగా నే నెన్నడూ ప్రవర్తించలేదుకూడా."

"అలాంటప్పుడు మతం పుచ్చుకోవటానికేం?"

"ఏమీలేదు. కాని నేను హిందూసమాజాన్ని త్యజించలేను."

"అలాటప్పుడీ ప్రస్తావన తేవటమేతప్పు. మా పిల్లలను పెళ్ళాడేది మమ్మల్ని చూసి జాలిపడా, లేక మా ఉద్ధరింపుకా?"

తనసూచన వారి కవమానకర మయిందని తెలిసి వినయుడు చాలా బాధపడ్డాడు. తాను లలితను పెళ్ళాడటానికి పరేశబాబు సమ్మతించడని తేలిపోయింది. "నన్ను మన్నించండి," అని అతను అక్కడినుంచి బయల్దేరాడు. వెళ్ళిపోతుండగా వరండా

మూల లలిత ఉత్తరాలు రాసుకుంటూ, అతని అడుగులచప్పుడుకు తల ఎత్తిచూసి. ఆందోళన చెందింది అతను ఆమెను చూసి తలవంచి, మాట్లాడకుండా వెళ్ళి పోయాడు.

# 6

గోరా జైలునుంచి విడుదల అయి బయటికి వచ్చేసరికి అతనికోసం పరేశబాబూ, వినయుడూ వేచిఉన్నారు. పరేశబాబును చూడగానే గోరాకు ఎన్నడూ లేనంత ఆనందం పొంగివచ్చి, ఆయన పాదాలు తాకి ప్రణామం చేశాడు. వారు ముగ్గురూ కలిసి బండిలో ఎక్కబోతూండగా, అవినాశుడు కొంతమందిని వెంటబెట్టుకుని వచ్చి, రోడ్డు పక్కనే గోరాకు గొప్ప సన్మానసభ జరప యత్నించాడు. అతను తెచ్చిన పూలదండలూ అందరూ కలిసి పాడిన పాటా చూసి గోరా చీదరించుకుని "ఆపండి. ఆపండి! ఏమిటీ పొగడ్త?" అని అరిచాడు.

స్టీమరులో వాళ్ళు కలకత్తాకు తిరిగి వచ్చాక, గోరా కృష్ణదయాళుడితో, "జైలులో నేను అపవిత్రుణ్ణయాను ప్రాయశ్చిత్తం చేయించుకుంటాను," అన్నాడు.

అలాటి దేమీ అవసరం లేదు నీ విషయంలో ఎలాటి ప్రాయశ్చిత్తమూ అక్కర్లేదు; నా మాట నమ్ము.'' అన్నాడు కృష్ణదయాళుడు ఆచారాలను గురించి ఎంతో పట్టుదల గల తన తండ్రి తన ప్రాయశ్చిత్తాన్ని అంత తీవ్రంగా ఎందుకు వ్యతిరేకిస్తున్నదీ గోరాకు బోధపడలేదు. భోజనాలదగ్గిర కూడా, వినయుడు మైలపడి పోతాడని గోరా కొంచెం ఎడంగా కూర్చుని భోంచేశాడు.

భోజనా లయాక, గోరావద్దకు మహిముడు వచ్చి, వినయుడికీ తన కూతురికీ పెళ్ళిరోజు నిశ్చయించమనీ, లేకపోతే వినయుడు ఏ బ్రహ్మసామాజికులనో పెళ్ళి చేసుకుని మత భ్రష్ఠుడవుతాడనీ గట్టిగా చెప్పివెళ్ళాడు.

"ఏమి టిదంతా?'' అని గోరా వినయుణ్ణి అడిగాడు.

"అది కొద్దిలో చెబితే తేలేది కాదు. అసలువిషయం మేమంతే, నేను లలితను పెళ్ళాడని పక్షంలో ఆమె యావజ్జీవమూ వాళ్ళ సమాజంవారిచేత తిట్లు తినే పరిస్థితి ఏర్పడింది. ఆ పరిస్థితినుంచి ఆమెను కాపాడటం నా చేతిలో ఉన్నది," అన్నాడు వినయుడు.

గోరా మండిపడ్డాడు; లలితకు న్యాయం చెయ్యటంకోసం నీ సమాజానికి ద్రోహం చేస్తావా అన్నాడు. తాను లలితను వివాహం చేసుకోబోవటం లేదని చెప్పక వినయుడు వివాహం చేసుకోవటం సక్రమమేనని వాదించాడు. మతం మనుషుల కోసమేగాని, మనుషులు మతంకోసం కాదన్నాడు. ఇద్దరూ ఘాటుగానే వాదించు

కున్నారు. వినయుడి సవాళ్ళకు గోరా సమాధానం చెప్పలేక, ''నన్ను బాధించేటట్లా నువ్వు ఒక బ్రాహ్మకన్యకోసం నీ సమాజానికి దూరం కాగలుగుతున్నావు. నాకది సాధ్యంకాదు ఎన్ని లోపాలుండనీ, నాకు భారతదేశం కావాలి. దానికీ నాకూ మధ్య వెంట్రుకవాసి ఎడం ఏర్పడ్డా నేను సహించలేను.'' అన్నాడు.

గోరా ఈ మనోవేదనను మరవలేకపోయాడు. వినయుడు ఒక పిల్లమీది మోజుతో, ఇంతకాలమయాక, తనకు శాశ్వతంగా దూరం కాబోతున్నాడు. అవినాశుడు మళ్ళీ కొంతమందిని వెంటవేసుకు వచ్చి, గోరా ఆర్యధర్మాన్ని ఉద్ధరించటానికి సృష్టించ అవతారపురుషుడని ఉపన్యాసం ఇచ్చి, అందరిచేతా గోరాకు జేజేలు కొట్టించాడు. గోరాకు తాను ఒంటరిగాడైపోయినట్టు భావన కలిగింది.

ఇంతలో ఆనందమయి అతన్ని రమ్మని కబురుచేసింది. అతను వెళ్ళేసరికి ఆనందమయి వెంట సుచరిత ఉన్నది. సుచరితకు ఇప్పుడు గోరా మనసులో ప్రత్యేక స్థానమున్నది. ఆమె మూలానే అతను దేశంలో ఆడవాళ్ళుకూడా ఉన్నారన్న సంగతి మొదటిసారి గుర్తించాడు. జైలులో ఉన్న నెలరోజులూ అతను విడవకుండా ఆమెను స్మరించి, జైలు పరిసరాలను అవాస్తవికంగా కనబడేటట్టు చేసుకున్నాడు. వినయుడు బ్రాహ్మబాలికను 'సుకోరాని వాదించినప్పుడు, గోరా ఆ వాదనను కొంతవరకు తనకే చెప్పుకున్నాడుకూడా. అందుచేత, అనుకోకుండా సుచరిత కనిపించేసరికి అతనికి ఆశ్చర్యానందాలు కలిగాయి. అతనామెను చూస్తూనే, "మీ రిక్కడ ఉన్నారా?" అన్నాడు.

గోరా జైలుమూలంగా చిక్కిపోయి, కాంతి తరిగి ఉండటం సుచరిత గమనించింది. ఆమెకు అతనిపైన గౌరవం మరింత పెరిగింది.

"నువ్వు లేని రోజుల్లో సుచరిత ద్వారా నే నెంత ఊరటపొందానో చెప్పలేను. నా కొక కూతురుంటే ఎంత సుఖపడిఉందునో ఇప్పుడు తెలిసి వస్తున్నది." అన్నది ఆనందమయి.

సుచరిత కొంచెంసేపు కూర్చుని, వెళ్ళిపోతూ వినయుణ్ణి తమ ఇంటికి రమ్మని ఆహ్వానించింది. ఆమె తనను ఆహ్వానించలేదని గోరా కొంచెం కష్టపడ్డాడు. కాని, అందుకు కారణం గ్రహించాక లోపం తనలోనే ఉందని అతను గ్రహించాడు: వినయుడు ఏ మనుషుల మధ్యనైనా మసలగలడు. అది గోరాకు చేతగాకపోవటం అతని లోపమే.

లలితను గురించి మాట్లాడటానికే సుచరిత వినయుణ్ణి తమ ఇంటికి పిలిచింది. అతన్ని చూడగానే ఆమె, ''చూడండి, వినయబాబూ! అంతస్సులో ప్రతిబంధకాలు

లేనప్పుడు ఇలాంటి అవాంతరాలను పాటించ వలసిన దేమిటి ?'' అని అడిగింది.

"ఇలాంటి అవాంతరాలను బొత్తిగా తృణీకరించగలమా?" అన్నాడు వినయుడు.

మతం వ్యక్తికి సంబంధించినదా, సమాజానికి సంబంధించినదా అన్న సమస్య గురించి ఇద్దరూ వితర్కిస్తుండగా సతీశుడొక పత్రికా, ఒక చీటీ తెచ్చి సుచరితకిచ్చాడు.

పత్రిక బ్రహ్మసమాజంవాళ్ళది. అందులో లలితా వినయుల పెళ్ళి తప్పిపోయిందనీ, దానికి కారణం వినయుడు మతం మార్చుకొని నిరాకరించటమే ననీ, పేర్లు లేకుండా వార్త వేశారు

వినయుడు తన ఇంట ఉన్నట్టు తెలపకుండా, సుచరిత లలిత నొకసారి రమ్మని కబురుచేసి, తాను స్నానం చెయ్యబోయింది. ఈలోపుగా హరిమోహిని వంట ఇంట్లోనుంచి వచ్చి వినయుడితో ఏదో సంభాషణ ప్రారంభించింది. అంతలో లలిత వచ్చి, వినయుణ్ణి చూసి, కోపంముఖం పెట్టింది. అది వినయుడికి పరిచితమైన ముఖమే. కాస్సేపు చూసి లలిత, "నేను వెళ్ళాలి. మరొకసారి వస్తానని దీదీకి చెప్పు,'' అని హరిమోహినితో అని వెళ్ళిపోయింది.

సుచరిత స్నానం చేసివచ్చేటప్పటికి వినయుడు పత్రిక తీసి, అందులో గుర్తుపెట్టి ఉన్న వార్త చదివాడు. సమాజంవాళ్ళు లలితను పొమ్మనటం మానరని అతనికి తెలిసిపోయింది.

సుచరిత స్నానం చేసివచ్చి, సతీశుడికి భోజనం పెట్టి స్కూలుకు పంపింది, తరవాత వినయుడు చేతులూ, కాళ్ళూ కడుక్కోకుండా భోజనానికి కూర్చోవటం చూసి హరిమోహిని. "మన హిందూ ఆచారాలంటే లక్ష్యం లేనివాడివే బ్రహ్మసమాజంలో చేరరాదా, నాయనా?'' అన్నది.

"హిందూమతమంటే నిషేధాలూ, నియమాలూ తప్ప ఇంకేమీ లేదని తోచినప్పుడు బ్రహ్మసమాజంలో కాకపోతే, తురకల్లోనో, కిరస్తానీల్లోనో చేరతాను. కాని హిందూమతమంటే ఇంకా కొంతనమ్మకం ఉన్నది," అన్నాడు వినయుడు.

సుచరిత ఇంటినుంచి బయలుదేరిన వినయుడు ఒక చోటు చేరి, అక్కడ ఒక చెట్టునీడన కూర్చుని తన పరిస్థితి గురించి ఆలోచించసాగాడు. అతనికి తెలియకుండానే పొద్దువాలింది. సతీశుడు బడినుంచి వస్తూ అతన్ని చూసి, "మా ఇంటికి పోదాందా!" అని చెయ్యిపట్టుకుని వదల్లేదు.

వాళ్ళిద్దరూ పరేశబాబు ఇంటిదాకా వచ్చేసరికి వినయుడు తల ఎత్తి, పైఅంతస్తు గదిలో ఉన్న పరేశబాబునూ, వీధికి వీపుపెట్టి కూర్చునిఉన్న లలితనూ చూశాడు.

వెంటనే అతను సతీశుణ్ణి విడిపించుకుని లోపలికి వెళ్ళి, మెట్లెక్కి పైకి వెళ్ళాడు. గదిలో పరేశబాబుమాత్రమే ఉన్నాడు; లలిత వెళ్ళిపోయింది.

వినయుడు పరేశబాబు చూపిన కుర్చీలో కూర్చుంటూ "నేను ప్రతిరోజూ హిందూ నియమాలను ఉల్లంఘిస్తూనే ఉండటంచేత బ్రహ్మసమాజంలో తలదాచుకుందామనుకుంటున్నాను. నాకు మీరె సమాజం ఇప్పించాలని నా కోరిక," అన్నాడు. ఈ ఆలోచన అతనికి కలిగింది పొద్దుగుంకట కిందటనే.

"సరేకాని, దీన్నిగురించి సమగ్రంగా యోచించావా?" అని పరేశబాబు అడిగాడు.

"ఇందులో ఆలోచించటాని కేముంది. మంచి చెడ్డలు తప్పు; చేసిన తప్పు సవరించుకోవటమే నా తక్షణ కర్తవ్యం."

"మత విశ్వాసాల విషయంలో బ్రహ్మసమాజంతో నీ అభిప్రాయాలు ఏకీభవిస్తాయా?"

"నిజం చెప్పాలంటే నాలో మతవిశ్వాస పరిణతి పొందిందని చెప్పలేను. నాకు జీవితంలో మతంతో అవసరం కలగలేదు. సంచితంగా వస్తున్నది గనక హిందూమతాన్ని అవలంబిస్తున్నాను."

చాలాసేపు మాట్లాడిన మీదట పరేశబాబు వినయుడిని తొందరపడవద్దని సలహా ఇచ్చాడు. బాగా ఆలోచించమన్నాడు.

ఇంతలో వరద వచ్చింది. వినయుడడిగిన మాట గురించి పరేశబాబు తన భార్యకు చెప్పనేలేదు. వినయుడే తాను బ్రహ్మసమాజంలో చేరదలిచినట్టు ఆమెతో చెప్పాడు.

"ఎల్లుండి ఆదివారంనాడు, పరేశబాబుగారు నాకు మతం ఇచ్చేట్టుంటే" అన్నాడతను.

"లేదు, నా కుటుంబానికి స్వార్థం ఉన్నచోట నేను ఔపదేశికుణ్ణి కాలేను. తిన్నగా బ్రహ్మసమాజానికే దరఖాస్తు పెట్టుకోవలసి ఉంటుంది," అన్నాడు పరేశబాబు.

వినయుడికి నిరుత్సాహం కలిగింది. బ్రహ్మసమాజంవాళ్ళకు తాను దరఖాస్తు పెట్టుకోవటమూ, దాన్ని వాళ్ళ పత్రికలో ప్రచురించటమూ, ఏ పరిస్థితులలో తాను బ్రహ్మమతం పుచ్చుకుంటున్నదీ తెలియకుండా తన హిందూ మిత్రులు ఆ వార్త చదవటమూ, అది గోరాకు తెలియటమూ, ఇవన్నీ ఊహించుకుంటున్నకొద్దీ వినయుడికి నీరసం వచ్చేసింది.

అత నేమీ అనకపోవటం చూసి పరేశబాబుభార్య, "వినయుడికి సమాజంలో ఎవరూ తెలీదు. నేనిప్పుడే పానుబాబును పిలిపిస్తాను," అన్నది. ఆమె సుధీరుణ్ణి పిలిచి, "వినయబాబు ఎల్లుండి ఆదివారంనాడు మన సమాజంలో చేరుతున్నాడు," అన్నది. వినయుడంటే గౌరవంగల సుధీరుడు చాలా సంతోషించాడు

పానుబాబును పిలిపిస్తున్నా రనగానే వినయుడు వెళ్ళిపోవటానికి లేచాడు. వారద అపినా ఆగలేదు.

"తొందరపడవద్దు. స్థిమితంగా ఆలోచించుకో," అని అతనికి పరేశబాబు మళ్ళీ సలహా ఇచ్చాడు.

వీథిలో అతనికి అవినాశుడూ మరి మగ్గురూ కనిపించారు.

"నువుకూడా రా, కాశీపూరుతోటలో గోరా ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడు" అన్నాడు అవినాశుడు.

"నా కిప్పుడు తీరిక లేదు," అంటూ వినయుడు అవినాశుణ్ని వదిలించుకుని వెళ్ళిపోయాడు.

# 7

పానుబాబు వస్తూనే లలితను పిలిచి, గంభీరంగా, "లలితా, ఇది నీ జీవితంలో పరీక్షా సమయం. ఒకవంక నీ మతం, మరొకవంక నీ కోరికలు. దేన్నో ఒకదాన్ని ఎన్నుకోవాలి," అన్నాడు.

లలిత మాట్లాడలేదు.

"నీ కోసమో, మరెందుకో వినయబాబు బ్రహ్మసమాజంలో చేరదలచిన సంగతి నీకు తెలిసేఉండవచ్చు."

జవాబులేదు.

"వినయుడి నిర్ణయం పరేశబాబుగారికి తృప్తినివవచ్చు; కాని ఇది సంతోష కరమైన విషయమూ అని తేల్చుకోవల్సినదానివి నువు. ఇందులో సంతోషప్రదమైన దేమైనా ఉందా అని సమాజం తరఫున నిన్ను నువు ప్రశ్నించుకోవాలని సమాజం తరఫున నిన్ను నేను కోరుతున్నాను."

జవాబులేదు.

"బ్రహ్మసమాజ చరిత్రలో ఇదొక దుస్సహ సంఘటనగా శాశ్వతంగా ఉండి పోవటం నీకు సమ్మతమేనా?"

లలిత రాయిలాగా కూర్చున్నది.

"కాంక్షలు మనిషిని నీరసపెడతాయి. అవి ఒక్కొక్కప్పుడు ఒక వ్యక్తినేగాక

అనేక వందలమంది జీవితాలను ధ్వంసంచేస్తాయి. అలాటి దౌర్బల్యం క్షమించ డగినదా, లలితా! ఒక్క క్షణం ఆగు.చు."

"వద్దు, వద్దు పానుబాబూ! మీరు మమ్మల్ని క్షమించవద్దు మీ సూటి పోట్లకు మే మలవాటు పడిపోయాం. మీరు మమల్ని క్షమించేట్టు చేసే మా కది దుఃఖ మవుతుంది!" అన్నది లలిత ఆవేశంతో.

పానుబాబువైఖరి పరేశబాబుభార్యకు కొంచెంకూడా నచ్చలేదు. వినయుణ్ణి సమాజంలో చేర్చాలని ఆమెకు తీవ్రమైనకాంక్ష. అందుకు తన భర్తసహాయం లేదు సరేకదా, పానుబాబుకూడా కలిసిరావటంలేదు. ఈపని తనవల్లనే కావాలని నిశ్చయించుకుని, ఆమె సతీశుణ్ణి వెంటబెట్టుకుని వినయుడి ఇంటికి వెళ్ళింది.

"చూడు, వినయబాబూ! నీకు సమాజం అధికార్లు తెలీదు. అందుచేత నా కొక ఉత్తరం రాసిఇచ్చావంటే నేను దాన్ని సమాజం అధికార్ల కిచ్చి, ఆదివారంనాడు నీ మతస్వీకారం జరిగేటట్టు చూస్తాను." అన్నదామె.

ఏమి జరిగినా వినయుడికి ఒకటిగానే తోచింది. అతను ఆమె కోరినట్టు ఉత్తరం రాశిచ్చాడు. ఆమె వెళ్ళిపోతూ లలితకూ, అతనికీ పెళ్ళి జరగటం గురించి చూచాయగా ఒకముక్క అని వెళ్ళిపోయింది. ఆమె ఇంటికి చేరుతూనే లలిత గదికి వెళ్ళింది.

"ఎక్కడికి వెళ్ళావమ్మా?" అని లలిత అడిగింది.

"వినయుడి గదికి."

"ఎందుకూ?"

"ఇందుకూ!" అంటూ వినయుడు రాసిచ్చిన ఉత్తరాన్ని ఆమె లలిత కిచ్చింది. దాన్ని చదివేసరికి లలిత ముఖం జేవురించింది.

"ఈ ఉత్తరం సంపాదించటానికి ఎంత ఒత్తిడి చెయ్యవలసివచ్చిందో తెలుసా?" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

మర్నాడామె సమాజానికి బయలుదేరబోతూ ఉత్తరంకోసం చూస్తే అది ముక్కలు ముక్కలుగా చింపిఉన్నది ...

మర్నాడు సాయంకాలం గోరా సుచరిత ఇంటికి వచ్చాడు. సుచరిత ఒంటరిగా అతనితో మాట్లాడటానికి జంకి, హరిమోహినిని తీసుకువచ్చి పరిచయం చేసింది. హరిమోహిని గోరానుగురించి చాలా విని సంతోషించిఉన్నది. అతను సాక్షాత్తు శివుడి అవతారంలాగా ఉంటాడని ఆమె కలలోనూనా అనుకోలేదు.

"నాయనా, మరొకసారి నీకు భోజనం పెడతానుగాని. ఈ పూటకు ఫలహారం చేసి మరీ వెళ్ళు." అంటూ హరిమోహిని వంటఇంట్లోకి వెళ్ళింది.

వెంటనే గోరా సుచరితకేసి తిరిగి, "వినయుడికి బ్రహ్మసమాజ నియమాల ప్రకారం పెళ్ళి జరిపాలని చూడటం న్యాయమా ?" అన్నాడు.

సుచరితకు కొంచెం రోషం వచ్చి, "బ్రాహ్మ వివాహవిధి అక్రమమైనదని నన్ను అనమంటారా ?" అన్నది.

"నిన్ను ఖచ్చితమైనమాట ఏదీ అనను. నువు సంకుచిత బుద్ధులలో చేరేదానివి కావని నాకు తెలుసు ఒక ప్రత్యేకమైన పార్టీకి సంబంధించిన మనిషిలాగా ఆలోచించవద్దు." అన్నాడు గోరా.

"మీరూ ఒక పార్టీకి చెందినవారే కదా ?"

"కాను, నేను హిందువుణ్ణి, హిందువుల కొక పార్టీ లేదు. హిందువు లొక జాతి; చాలా విస్తృతమై, వైవిధ్యంగల జాతి."

"అలా అయితే హిందువులు పార్టీవైఖరి అవలంబించటం దేనికి ?"

"దెబ్బతిన్నవాడెవడూ ఆత్మరక్షణ చేసుకుంటాడు : రాయి కాదు గనక ! ప్రాణం ఉన్నది గనక :"

"నేను ఉత్తమ మానవధర్మ మనుకునేదాన్ని హిందువులు ప్రమాదంగా భావిస్తే ఏం చెయ్యాలి?"

"నీ దృష్టిలో ధర్మమయినది. ఈ విస్తృత జాతికి దెబ్బ అయిన పక్షంలో నీ దృష్టిలోనే ఏదో దోషమున్నదన్నమాట. నీ సమాజంయొక్క విశ్వాసాలే సరైన వనుకుని ఆత్మార్పణాలకు పూనుకోవటం సరికాదు ఒక పెద్ద పడవలో ఒక చిన్న చిల్లి తొలచటం ఎలాంటి దృష్టిలో సరికావచ్చు; కాని అందువల్ల అధికమైన ప్రమాదం ఉంటుంది. నీ సంకుచిత విశ్వాసాలను అందరూ ఆమోదించాలనీ, అందరు మనుషులూ ఒకటేననీ, అందరూ బ్రహ్మసమాజంలో సభ్యులు కావటానికే పుట్టారనీ ఎలా భావించగలవు? ప్రపంచాన్నంతా నీ జయించి తమ అధీనంలోకి తెచ్చుకోవాలనుకునే బందిపోటు దేశాలకూ, ఈ వైఖరి గలవారికి తేడా ఏమిటి?"

గోరా ఈ విధంగా మాట్లాడుకుంటూ పోతుంటే సుచరిత తన్మయురాలై విన సాగింది అతనికి పట్టుదలేమీ కావు. అతని మాటల వెనక ఉన్న సత్యం కళ్ళకు కట్టినట్టూ, ఎటుచూసినా ప్రత్యక్షమైనట్టూ ఆమె భావించింది. ఆమె ఎదురు చెప్పలేకపోవటం చూసి గోరా, "నా మాటలు నీకు కటువుగా ఉండవచ్చు. నేను



ప్రతిపక్షానికి చెందినవాణ్ణనే భావంతో నామీద ఎదురు తిరగవద్దు. నువు నా ప్రతిపక్ష మనుకున్నట్టయితే నే నసలు మాట్లాడేఉండను.'' అన్నాడు.

"లేదు, లేదు. నా సంగతి మరిచిపోండి మీరు చెప్పేది చెప్పండి. నేను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తాను," అన్నది సుచరిత.

గోరా మరికొంతసేపు ప్రసంగించి చివర కిలా ముగించాడు.

"హిందూమతంలో అన్నిరకాల విశ్వాసాలకూ చోటున్నది. అది అందరికీ తల్లి. అది మనిషిని మనిషిగా పరిగణిస్తుంది గాని, ఒక మతంవాడుగా పరిగణించదు. వివేకులనూ, వివేచనా వైవిధ్యం గలవారినీ, అవివేకులనూకూడా ఆదరిస్తుంది. క్రైస్తవమతం వైవిధ్యాన్ని సహించదు. క్రైస్తవులవిద్య చదువుకోవటంచేత మనం హిందూమతంలోని వైవిధ్యం చూసి అసహ్యపడుతున్నాం. ఈ దుష్ప్రభావంనుంచి బయటపడితేనేగాని హిందూమతంతాలూకు పరమసత్యాలు మన కర్థంకావు."

అత సిలా మాట్లాడుతూండగా అక్కడికి పానుబాబు వచ్చాడు. అతను వీధిలో నుంచే గోరాగొంతు వినిఉండటంచేత, సుచరిత తనకు అతనితో ప్రసంగించే తీరిక లేదన్నాకూడా వచ్చి కూర్చున్నాడు. గోరాకు ఫలహారం అయిందేమో చూసే మిషమీద సుచరిత వెళ్ళిపోయింది.

పానుబాబు గోరాను చర్చలోకి దింపుతూ, "అవినాశంనాడు వినయబాబును బ్రహ్మ సమాజంలో చేర్చటానికి ప్రయత్నాలు జరుగుతున్నట్టు మీకు తెలుసునా?కుంటాను?" అన్నాడు.

గోరా తనకు తెలియదన్నాడు. పానుబాబు వేసే ప్రశ్నలకు సంపరకు జవాబుగా అతను, వినయుడు తన సమ్మతి కోరబోడనీ, ... సమ్మతించటమే ఆ మతంమీద అతనికి గురి ఉన్నట్టు గుర్తు అనీ అన్నాడు.

"నేను మిమ్మల్ని ముఖ్యంగా అడగాలనుకున్న దొకటే. వినయబాబు పరేశబాబు కుటుంబంలోవ్యక్తిని పెళ్ళాడటాన్ని మీరు ప్రతిఘటించరా." అన్నాడు పానుబాబు.

గోరాకు మండిపోయింది. నేనీ విషయాలు మీతో ఎందుకు చర్చించాలి పానుబాబూ? వినయుడు నాస్నేహితుడుగాని మీస్నేహితుడుకాడే!'' అన్నాడు.

"నేను బ్రహ్మసమాజం పక్షాన అడుగుతున్నాను.''

"ఆ సమాజానికీ నాకూ ఏమీ సంబంధంలేదు "

వీళ్ళిలా ఘర్షణపడుతుండగా సుచరిత వచ్చి, పక్కగదిలో ఫలహారం చెయ్యటానికి గోరాను తీసుకుపోయింది. ఆమెతో ఒంటరిగా మాట్లాడటానికి పానుబాబు చేసిన ప్రయత్నాల నామె లక్ష్యపెట్టలేదు ఆమెకోసం కొంతసేపు చూసి పానుబాబు ఆమెకు ఉత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయాడు.

తరవాత గోరా వెళ్ళిపోతూ సుచరితతో, "నీ స్థానం విస్తృతమైనది భారత దేశంలో। నిన్నిక్కడ సుస్థిరంగా నిలిపేదాకా నేను వదలను. నువు పాటించవలసిన విశ్వాసాలూ, సత్యమూ ఎవరో చెప్పేమాటలు కావు. నీవు అసంఖ్యాకులైన దేశీయులతో బంధాలు కలిగివున్నావు. నువు పుట్టకమునుపే నీ దేశప్రజలు నీ కొక స్థానం ఏర్పాటుచేశారు. వారు నీ కేమీ కారనీ, వారికి నువ్వేమీ కావనీ ఎన్నడూ అన వద్దు. అలా అన్నక్షణాన నీ మనసూ, నీ బలమూ కరిగి మాయమవుతాయి. రేపు మళ్ళీ కనిపిస్తాను.''

వినయు డానందమయివద్దకి వెళ్ళి తాను మర్నాడు బ్రహ్మసమాజంలో చేర బోతున్నాననీ, తనకు నిజంగా హిందూ మతాచారాలలో విశ్వాసం లేదనీ, కేవలమూ యుక్తితోనే వాటిని సమర్థిస్తూవచ్చాడు; గాని నిజమైన ప్రగాఢవిశ్వాసంతో కాదనీ చెప్పాడు.

అతను మతం మార్చుకోవటానికి ఆనందమయి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. "ముప్పైకోట్లమంది ఉంటున్న ఇంటిలో నీకు స్థానం లేకపోయిందా? చిత్తశుద్ధిగా

నువు కొన్ని ఆచారాలు పాటించలేకపోతే ఇతరులచేత తిట్లుతిను. నేను పడుతున్నాను కూనా! నన్నందరూ కిరస్తానీ అంటున్నారు. నేను నా సమాజాన్ని వదులుకున్నానా?" అన్న దామె.

"బ్రహ్మసమాజంలో చేరతానని మాట ఇచ్చాను. వెనక్కు లాగటానికి లేదు," అన్నాడు వినయుడు.

ఇంతలో లలిత వచ్చింది. వినయుడు అవతలికి వెళ్ళిపోయాడు. ఆనందమయీ లలితా వినయుణ్ణి గురించి మాట్లాడుకున్నారు. రేపు వినయుడు బ్రహ్మమత స్వీకరణ చేస్తున్నాడని ఆనందమయి అనేసరికి లలిత, "దేనికీ? అంత అవసర మేం వచ్చిందీ?" అని అడిగింది.

''అయితే అవసరమే లేదా?" అన్నది ఆనందమయి ఆశ్చర్యంతో.

''ఎంతమాత్రమూ లేదు.''

"మాట ఇచ్చాను, తిరగనంటున్నాడు వినయుడు."

"ఇలాటి విషయాల్లో మాట నిలబెట్టుకోవటంలో అర్థంలేదు. అభిప్రాయం మార్చుకోవచ్చు; దాని కేం?''

''అమ్మా, దావరికావి కిది సమయంకాదు. మతం మార్చుకోకుండా నిన్ను పెళ్ళాడటం సాధ్యంకాదని వినయుడి ఉద్దేశం.''

''నా కలాటి నమ్మకాలు లేనేలేవు. మనుషుల మధ్య సంబంధా లేర్పడటానికి మతాలు అడ్డొచ్చేమాటైతే భిన్నమతాలవారి మధ్య స్నేహానికి అవకాశమే ఉండదు. అన్ని మతాల మధ్యా ఎత్తయిన గోడలు లేవవలిసిందే.'' అన్నది లలిత.

ఆనందమయి మనస్సు చాలా తేలికనపడింది. ఆమె వినయుణ్ణీ, లలితనూ ఒక చోట చేర్చి, మాట్లాడుకుంటూ ఉండమని తాను ఫలహారం తయారు చేసే మిద్దె మీద అవతలికి వెళ్ళింది.

లలితా వినయులు మనసిచ్చి మాట్లాడుకున్నారు. ఒకరి మతాల ప్రమేయం మరొకరి కుండనవసరం లేదు.

"మీరు మతం మార్చుకునే అవమానానికి గురికావటం నేను సహించలేను.'' అన్నది లలిత. వా రిద్దరూ ఇరవై నిమిషాలపాటు సంభాషించుకున్నారు. తరవాత ఇద్దరూ కలిసి పరేశబాబువద్దకు వెళ్ళారు.

"నేను సంఘం ఎదట ఏ ప్రమాణాలూ చెయ్యదలచలేదు. మే మిద్దరమూ ఏకం కావటానికి మీ ఆశీర్వచనం ఒక్కటే చాలు," అన్నాడు వినయుడు పరేశబాబుతో.

పరేశబాబు కొంచెం ఆలోచించి, "అయితే నువు హిందూ సమాజంలోనే ఉంటావన్నమాట? బ్రహ్మసమాజంలో చేరవు?" అన్నాడు

"లేదు," అన్నాడు వినయుడు.

పరేశబాబు లలితకేసి చూశాడు

"నాన్నా, నా మతం నాకే ఉంటుంది. కాని నా విశ్వాసాలతో ఏకీభవించని వారిని వెలివెయ్యలేను. మన సమాజంలో నా విశ్వాసాలే గల వాళ్ళను కొందరిని నేను నావాళ్ళుగా చూడలేను. బ్రహ్మసమాజం వెలుపల అంతా భ్రాంతే అనుకునే దాన్ని. కాని ఆ అభిప్రాయం నా కిప్పుడు పూర్తిగా పోయింది," అన్నది లలిత.

"కాని రేపు మీకు పుట్టబోయే తరాలవాళ్ళందరి బాధ్యతా మీ సొంతం కాదు, సంఘానిది కదా!" అన్నాడు పరేశబాబు.

"అందుకు హిందూసమాజం ఉన్నది," అన్నాడు వినయుడు.

"హిందూసమాజం వాళ్ళను ఆదరించకపోతే?"

"హిందూసమాజం అన్ని మతాలవాళ్ళనూ ఆదరిస్తుంది."

ఇద్దరూ మతం గురించి తర్కించుకున్నారు. లలిత వారి వాదనకు అడ్డువచ్చి, "నాన్నా! బ్రహ్మసమాజం ద్వారా నే నవలంబించిన విశ్వాసాల మూలంగా నాకు మరొక సమాజంలో బాధలు ఎదురవుతాయని తెలుసు. కాని నే నందుకు భయపడను. నా బాధల్లా నా చర్యలు మీకు బాధ కలిగిస్తాయేమోననే," అన్నది.

పరేశబాబు వినయుడితో, "మన దేశంలో సాంఘికాచారాలు మతాచారాలతో ముడిపడిఉన్నాయి. ఇతర మతాలవారిని నీ సమాజంలోనికి తీసుకుపోవటం ఎలా సాధ్యం?" అన్నాడు.

వినయుడికి ఆ చిక్కు అర్థమయింది. అతను లలితను పెళ్ళాడేమాటైతే, లలిత విగ్రహానికి ప్రణామం పెట్టాలి. పెడుతుందా? ఆమె కది పరమద్రోహం. వినయుడికీ విగ్రహారాధనలో నమ్మకం లేదు. పెళ్ళిలో విగ్రహారాధన లేకుండా చూస్తాడు. కాని ఇలాటివి అసంఖ్యాకమైన సమస్యలుంటాయి. వివాహం వ్యక్తిగతమైన విషయం కాదు, సామాజికమైనది.

"కొంచెం వ్యవధి తీసుకుని సావకాశంగా ఆలోచించండి. తొందర పడవద్దు." అని తోటలోకి వెళ్ళిపోయాడు పరేశబాబు.

"సంఘంలో చెడ్డపనులకు తప్ప మంచిపనులకు చోటే లేదా?" అని లలిత వినయుణ్ణి అడిగింది

"నాకు సంతోషం కలిగించేదేమీ లేదు. సత్యం నీకన్నా మిద్దరమూ నిలవగలిగితే మనమే సంతోషం." అన్నాడు వినయుడు.

పరేశబాబు భార్య వచ్చి, "బ్రహ్మసమాజంలో చేరే ఉద్దేశం మానుకున్నావటగా ఏమిటీ వేషాలు? లలిత జీవితం నాశనం చేద్దామనా?" అని వినయుణ్ణి అడిగింది.

"వినయబాబు మతం స్వీకరించటం ఇష్టం లేనివాళ్ళు మన సమాజంలో ఉన్నారు. నీవు సత్రీక పెద్దవేదేగా? అలా మతస్వీకారం చేస్తే నేం, చెయ్యకపోతే నేం?" అని లలిత తల్లితో అన్నది.

"మతం మార్చుకోకపోతే పెళ్ళి ఎలా జరుగుతుంది?"

"హిందూవిధి ప్రకారం జరిగేటట్టు చూస్తాము." అన్నాడు వినయుడు.

పరేశబాబు భార్యకు పట్టరాని కోపం వచ్చింది.

"వినయ్. వెళ్ళు! ఈ ఇంటినుంచి వెళ్ళిపో. ఎన్నడూ తిరిగిరాకు." అన్న దామె అమర్యాదగా...

కొంతటిరోజుల అనంతరం గోరా సుచరితను చూడవచ్చాడు. అతను హరిమోహిని పూజాగృహంలో దేవుడికి నమస్కరించిరావటం చూసి, సుచరిత, "ఆ విగ్రహంలో మీకు నమ్మకం ఉన్నదా?" అని అడిగింది.

అతను పెద్ద ఉపన్యాసం ప్రారంభించాడు. తనకు దేవుడిఅవసరం కలగలేదని అతను ఒప్పుకున్నాడు; కాని తన దేశప్రజల ఆచారాలను తాను గౌరవిస్తానన్నాడు విగ్రహం దేవుడికి ప్రతినిధి. ఒక పుస్తకంలో ఒక మహత్తరమైన భావం ఉంటే ఆ భావాన్ని అసలు ప్రమాణాన్నిబట్టీ, అక్షరాల సంఖ్యను బట్టీ కొలవం. అలాగే దేవుడు అనంతుడు. ఆ అనంతుణ్ణి భక్తులు చిన్నరాయిలో చూడవచ్చు. ఇలా మాట్లాడుతూ గోరా సుచరితను తనపక్షం చేసుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు. "నువు దూరంగా వుండిపోతే నా భారతదేశం శోభించదు. నువు లేకపోతే అంతా వృథా! నేను నీకోసమే వచ్చాను." అన్నా డతను.

సుచరిత కళ్ళు చెమర్చాయి. గోరా వెళ్ళిపోయాక సుచరిత పైడాబామీదికి వెళ్ళి కాలం ఎలా గడుస్తున్నదీ తెలియకుండా, చల్లగాలిలో పచార్లు చెయ్యసాగింది. తనకోసం పరేశబాబు డాబాపైకి వచ్చినదాకా ఆమె అక్కడే ఉండిపోయింది.

ఇద్దరూ కిందికి వచ్చాక, పరేశబాబు, లలిత వినయుణ్ణి హిందూ వివాహవిధి ప్రకారం పెళ్ళాడబోతున్నదనీ, అందులో విగ్రహపూజ లేకుండా చేస్తానని వినయుడన్నాడనీ చెప్పాడు.

"మీరు ఒప్పుకున్నారా ?" అన్నది సుచరిత.

''లేదు; కాని ఒప్పుకుంటాను. లలిత ఈ పెళ్ళివల్ల తనకు ఏర్పడే కష్టాలను సంతోషంగా స్వీకరిస్తున్నది. ఆమె చేసేది తప్పుకానప్పు డెలా అడ్డుపుల్ల వేసేది ?'' అన్నాడు పరేశబాబు

# 8

ఉదయం లేగాయతు గోరా గదిలో ఒకటే పంచాయతి. మహిముడు వచ్చి గోరాచేతి కొక పత్రిక ఇచ్చాడు వినయుడు హిందూమతం విసర్జించి బ్రాహ్మ కన్యను పెళ్ళాడబోతున్నట్టు అందులో ఉంది. శశిముఖిని పెళ్ళాడతానని మాటఇచ్చి, ఇలా చేసినందుకు వినయుణ్ణి తిట్టి మహిముడు వెళ్ళిపోయాడు.

తరవాత అవినాశుడు వచ్చాడు. వినయుణ్ణి నానామాటలూ అన్నాడు. అతని వెనకగా గోరాశిష్యులందరూ వచ్చి ఏవేవో మాట లన్నారు. గోరా ఎవరికీ ఏమీ జవాబు చెప్పలేదు. వచ్చినవా రంతా వెళ్ళిపోయా? వినయుడు ఇంటికి వచ్చి గోరా గదిలోకి రాకుండా పైకి వెళ్ళిపోతుంటే, గోరా అతన్ని పిలిచి, ''బ్రహ్మసమాజంలో చేరుతున్నావా ?'' అన్నాడు

''లేదు, చేరనుకూడా,'' అన్నాడు వినయుడు.

గోరా తీవ్రంగా అతనితో వాదం వేసుకున్నాడు. వినయుడు యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాడు. "నేను సమాజానికి బలులు వేస రాక్షసిని మంచి చేసుకున్నట్టు చెయ్యలేను," అనేశా డతను.

అతను బ్రహ్మమతం స్వీకరించకుండానే లలితను హిందూ వివాహవిధి ప్రకారం పెళ్ళాడుతున్నా నని గోరాకు తెలియజేశాడు.

''మరి పరేశబాబు సమ్మతించాడా ?'' అని గోరా అడిగాడు

వినయుడు పరేశబాబు రాసిన సమ్మతిఉత్తరం గోరాకు చూపి, "పరేశబాబులాగే నువుకూడా మా పెళ్ళి అనుమతించు," అన్నాడు.

సమ్మతించ నన్నాడు గోరా

"నేను ముస్లిము మిత్రు ణ్ణయితే అనుమతించిఉందువా ?" అని అడిగాడు వినయుడు. అప్పు డనుమతించేవా ణ్ణని గోరా ఒప్పుకుంటూ, ''చెట్టు కొమ్మ విరిగితే అతకదు; చెట్టుకు పాకిన లత పడిపోతే ఎత్తిపెట్టవచ్చు,'' అన్నాడు.

అలాటప్పుడు, చెట్టు మరీ పెళుసుగా ఉండటమూ, స్వల్పకారణాలకు కొమ్మలు విరగటమూ ఉండరా దన్నాడు వినయుడు.

వినయుడు ఆనందమయిదగ్గిరికి వెళ్ళాక, మహిముడు వచ్చి తన సమస్యలు

వెళ్ళబోసుకున్నాడు. శశిముఖిని అవినాశుడి కిచ్చి పెళ్ళి చెయ్యాలి. అవినాశుడు గంతేసి ఒప్పుకున్నాడు. కట్నంమాట ఎత్తితే, చెవులు మూసుకున్నాడు. కాని అవినాశుడి తండ్రికి కట్నంపట్ల అంత నిర్లక్ష్యం లేదు. పిల్లకు భారీగా నగలు పెట్టాలన్నా డాయన. ఖరీదు పెంచకుండా నగలబరువు పెంచే కంసాలిని చూడాలి. తండ్రి కృష్ణదయాళుణ్ణి ఒక కొత్త స్వామీజీ పట్టాడు. రోజుకు మూడు స్నానాలూ, ప్రాణాయామాలూ చేయించి, ఆ స్వామీజీ ముసలాయన ప్రాణాలు తీసేట్టున్నాడు. కృష్ణదయాళుడు చూడబోతే, మహిముడు డబ్బు అడిగినప్పుడల్లా కళ్ళూ, ముక్కూ మూసుకుంటున్నాడు. అవినాశుడి తండ్రికి గల పుత్రవాత్సల్యం ఈయనలో కనబడదు...

హరిమోహినికి గోరా మీద ఏమీ సదభిప్రాయం కలగలేదు. అతని ఉపన్యాసాలు ఆమె తల కెక్కలేదు. అతను ఎంతసేపటికీ తన ప్రతిపక్షులను చీల్చి చెండాడతాడు గాని, తోటివారికి ఏమీ చెప్పడు. అతని నోట ఆమె ఏనాడూ నాలుగు మంచిముక్కలు వినలేదు. తమ ఇంటికి రావటంలో గోరా ఉద్దేశం సుచరితను బుట్టలో వేసుకోవటమేనని ఆమె రూఢి చేసుకున్నది. సుచరితకు ఆస్తి వున్నది: దానిమీద గోరా కన్ను పడివుండాలి.

గోరా మళ్ళీ ఇవాళకూడా వచ్చాడు. సుచరితతో ఏదో మాటలు ప్రారంభించాడు. గోరా సుచరిత శక్తులలో అంతులేని విశ్వాసం ప్రకటించాడు. హరిమోహిని మధ్యలో వచ్చి సుచరితను వంటపని చూడమని పంపింది. తరవాత ఆమె గోరాతో, "నువ్వు హిందువుడవే గదూ, నాయనా? నీకు హిందూ సంప్రదాయాలంటే గౌరవమేగా? అలాటప్పుడు రోజూ వచ్చి, ఈడొచ్చిన పిల్లతో ఏమిటి మాట్లాడతావు? ఇలాటి ప్రవర్తన మంచిదేనని ఏ ధర్మశాస్త్రంలో ఉంది? నీ శిష్యులు చాలా మంది ఉన్నారుట; నీ ప్రవర్తన చూసి వాళ్లేమనుకుంటారు? నిన్న పొద్దుపోయిన దాకా మాట్లాడితివి. తెల్లవారిందో లేదో మళ్ళీ వస్తివి. అది పొద్దున లేచి ఒక్క పని చెయ్యలేదు. మీ ఇంటో ఆడపిల్లలు పనీపాటా చెయ్యకపోతే ఊరుకుంటావా? నాకీ ప్రపంచంలో ఉన్నది అది ఒక్కతే. చెయ్యెత్తి దణ్ణం పెడతాను, దాని జోలికి రాకు. పరేశబాబు కింకా ఇద్దరు కూతుళ్ళున్నారు; వాళ్ళింటికి వెళ్ళు," అన్నది.

గోరా దిమ్మెరపోయాడు. అతను వెళ్ళిపోయేటప్పుడు కింద వంట చేస్తున్న సుచరితకు చెప్పనన్నా లేదు.

అతను వెళ్ళిన మరుక్షణమే పానుబాబు వచ్చాడు. అతను వంటఇంటి వాకిలి

బయట నిలబడి "విన్నావా, సుచరితా ? వినయుడు లలితను హిందూపద్ధతిలో పెళ్ళాడబోతున్నాడు. దీనికి కారకు లెవరు? నువ్వే ! బ్రహ్మసమాజం దృష్టిలో నువ్వు దోషివి. నువ్వే వినయుణ్ణీ, గౌరమోహనబాబునూ మీ ఇంటికి చేరనిచ్చావు. ఇవాళ ఏమవుతున్నదో చూడు. ఇవాళ నువ్వు లలితను చూసి జాలిపడవచ్చు; కాని రేపు నీకూ ఇదే పతనం కలగబోతుంది. ఆలోచించు. మనం కన్న కలలన్నీ ఒక్కసారి స్మరించు. వెనక్కు వచ్చెయ్యి." అన్నాడు.

ఈ ప్రసంగమంతా మౌనంగా విన్న సుచరిత అతనికేసి తిరిగి, "నేను హిందువును !" అన్నది.

"హిందువువా ? అంటే, గౌరమోహనబాబు ఉభయసంధ్యలా నీకు ఉపదేశం ఇస్తున్నాడన్నమాట !" అన్నాడు పానుబాబు.

"అవును. ఉపదేశం పొందుతున్నాను. ఆయన నాకు గురువు."

అంతదాకా తామెగురువు తానే అనుకుంటున్న పానుబాబుకు కొరడాదెబ్బ తిన్నట్లయింది : "హిందూసమాజం నిన్ను స్వీకరిస్తుందనుకున్నావా ? గౌరమోహనబాబు నిన్ను ఒక్కనాటికి పెళ్ళాడడు. చూస్తూఉండు !"

"ఆయన నా గురువని చెప్పలేదూ ?" అన్నది సుచరిత. ఆమె కళ్ళు క్రోధంతో మెరిశాయి.

"నువ్వు చెప్పనిదికూడా అర్థం చేసుకోవచ్చుగా ?"

"ఈ ఇంటినుంచి వెళ్ళు. మళ్ళీ నాకు కనిపించవద్దు." అన్నది సుచరిత.

ఈ సంభాషణ అంతా వింటున్న హరిమోహిని సమాధానం చెంది, తన ప్రార్థనలను దేవుడు ఆలకించాడనుకున్నది.

గోరా ఇంటికి వచ్చేసరికి మహిముడు కనిపించి, "వినయుడు ఆ బ్రహ్మసమాజం దాన్ని తెచ్చి ఈ ఇంట కాపరం పెడితే నే నింకెక్కడికైనా లేచిపోవలసివస్తుంది. కుటుంబీకుణ్ణి, ఆడపిల్లలు గలవాణ్ణి." అన్నాడు

"అలా ఎన్నటికీ జరగదులే," అని చెప్పి, గోరా ఆనందమయినదగ్గరకు వెళ్ళి తానే వినయుడిపెళ్ళి తమఇంటనే జరగబోతున్నట్లు తెలుసుకున్నాడు. "వారి పెళ్ళిప్రయత్నాలు నేను దగ్గరుండి చెయ్యకపోతే ఎవరు చేస్తారు?" అన్న దామె.

గోరా అందుకు తీవ్రంగా అభ్యంతరం చెప్పాడు. ఆనందమయి ఆ పెళ్ళికి వెళ్ళటానికే వీల్లేదన్నాడు. వినయుడు తన పెళ్ళి మరెక్కడైనా ఏర్పాటు చేసుకో వలసి ఉంటుందని చెప్పటానికి గోరా వెళ్ళిపోగానే ఆనందమయి తన భర్తవద్దకు



వెళ్ళి, ''గోరాను ఇం కెంతకాలం మోసం చేస్తారు. అంతకంతకూ పరిస్థితి విషమించుతున్నది,'' అన్నది.

నీ కేమన్నా పిచ్చా ఏం? గోరా సంగతి బయట పడితే నేను నలుగురికీ ఏమని సమాధానం చెబుతాను. పోలీసులు నా గొంతుమీదికి తెస్తారు. ఉంఛనుకూడా ఆగి పోవచ్చు. ఏదో విధంగా నువే చక్రం అడ్డువెయ్యి. పారితే పారుతుంది, లేకపోతే లేదు,'' అన్నాడు కృష్ణదయాళుడు.

వినయుడి పెళ్ళికి అతని బంధువు లెవరూ రావటంలేదు. లలిత కుటుంబం సహజంగా ఈ పెళ్ళితో ఎలాటి సంబంధమూ పెట్టుకోవటంలేదు. అందుచేత పరేశబాబు గోరాను చూడవచ్చి, ''లలిత తరపున నేనూ, వినయుడి తరపున నువూ ఈ పెళ్ళితంతు నడపవలసివున్నది,'' అన్నాడు.

''నా కీ పెళ్ళితో ఏమీ సంబంధం లేదు,'' అన్నాడు గోరా.

"అదేమిటి? వినయుడు నీ స్నేహితుడుగదా? స్నేహితుడు ఇలాటప్పుడు కాక మరి దేనికి?" అన్నాడు పరేశబాబు.

''నాకు సంఘంతో గల ఇతర సంబంధాలు కూడా పాటించాలి,'' అన్నాడు గోరా. పరేశబాబు తానే ఒంటరిగా పెళ్ళి చేయిస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

గోరా ప్రాయశ్చిత్తప్రక్రియ నిమిత్తం ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి. ముహూర్తం నిర్ణయమయింది. ఆహ్వానాలు వెళ్లాయి. గోరాను అభిమానించే ధనికులు చందాలు వేశారు. గోరా ఆ తతంగంలో మునిగిపోయాడు

పరేశబాబుకు బ్రహ్మసమాజంనుంచి తాఖీదు వచ్చింది. ఆయన తన కుమార్తెను హిందువుడి కిచ్చి పెళ్ళి చేస్తూ, తానే స్వయంగా పెళ్ళి చేస్తున్నాడు గనుక ఆయనను సమాజంనుంచి బహిష్కరించవలసి ఉంటుంది. ఆయన సంజాయిషీ ఇచ్చుకో దలిస్తే ఫలాని గడువులోపల ఇచ్చుకోవచ్చు.

పరేశబాబు వెంటనే సమాధానం రాశాడు. "లలిత వివాహం నేను స్వయంగా చెయ్యక తప్పదు. అందుకు మీరు నన్ను బహిష్కరిస్తే అది మీ తప్పని నేను భావించను."

* * * *

ఒకనాడు సుచరితను చూడవచ్చి ఆనందమయి, "అమ్మా! వినయుడి పెళ్ళికి ఈ దగ్గిరలోనే ఇల్లొకటి మాట్లాడాను. నువుకూడా వచ్చి పెళ్ళిప్రయత్నాలలో సహాయం చేస్తావా?" అన్నది.

సుచరిత ఆశ్చర్యంతో, "మీ రీ పెళ్ళికి వస్తారా? అందరూ మిమ్మల్ని ఆడి పొయ్యరూ?" అని అడిగింది.

"ఆడిపోస్తారు. తలవంచుకుని సహిస్తే సరిపోయే. నేను పెళ్ళికి రాకుండా ఎలా జరుగుతుంది. అయితే నేను వినయుడి పక్షాన రాను; పెళ్ళికూతురి పక్షాన పెళ్ళిలో పాల్గొంటాను. లలిత పెళ్ళి నా యింట జరుగుతుంది," అన్నది ఆనందమయి.

హరిమోహినికి మటుకు సుచరిత ఈ పెళ్ళికి రావటాని కెంతమాత్రమూ ఒప్ప లేదు. "మీ గోరా మాటలు తల కెక్కి, అది తాను హిందువునని కేకలు పెడు తున్నది. హిందువు కావటం మాటలా? ఇంత ఈడొచ్చి పెళ్ళి కాలేదేమని నలుగురూ అడగరూ? ఎంతో జాగ్రత్తగా ఉంటే, దాని భవిష్యత్తు ఒక ఒడ్డున పడేటట్టు చేస్తాను," అన్నది

ఆనందమయి హరిమోహిని వైఖరికి దిగ్భ్రమ చెంది, కలవు పుచ్చుకున్నది. కాని మర్నాడు సుచరిత పెళ్ళి జరిగే ఇంటికి రానేవచ్చింది. లక్ష్మి సహాయంతో ఆనందమయి పెళ్ళి ఇల్లంతా కడిగించింది. పెళ్ళి ఖర్చులకుగాను పరేశబాబు సుచరితచేతికి డబ్బిచ్చారు. తరవాత లలిత తన పుట్టింటినుంచి పరేశబాబువెంట ఏకంగా పెళ్ళింటికి వచ్చేసింది.

# 9

ఇంత కాలం నిలవక గోరా రోజూ గ్రామాలమీద సంచారం వెళ్ళివస్తున్నాడు. గ్రామప్రజలలో ఆచారాల కట్టుబాటు చాలా జాస్తి. ఆ ఆచారాలు గ్రామీణ జీవి తాన్ని ఎలా అధోగతికి ఈడ్చుకుపోతున్నదీ అతను కళ్ళారా చూశాడు. ఆచారాలు ప్రజలలో ఐకమత్యం పెంపొందించటం లేదు; వారి హితాన్ని బలపరచటం లేదు; పైపెచ్చు అవి వారిలో దయాదాక్షిణ్యాలుకూడా లేకుండా చేశాయి. ఎవ రన్నా చితికిపోతుంటే అంతా చూస్తూ ఊరుకుంటారు. ఎంత దారిద్ర్యంలో కూడా విధ్యుక్తకర్మలకు విఘాతం కలగరాదు. ఆచారం గ్రామీణులను బలి పుచ్చుకుంటున్నది ! ఇది చూసి గోరా కళ్ళు తెరిపుడుబడ్డాయి. ఈ అవలక్షణాలు అతనికి హిందువులలో కనిపించినట్టుగా ముస్లిములలో కనబడలేదు; వారిలో ఐక మత్యం ఉన్నది.

సోమవారం. రాత్రికి తన పెళ్ళి అనగా, వినయుడు తెల్లవారకుండానే వచ్చి గోరాను తన పెళ్ళికి ఆహ్వానించాడు.

“నేను పెళ్ళికి రాలేను. అయితే నేం ? నువు అమ్మను లాక్కువెళ్ళావుగద: నీదే విజయం,'' అన్నాడు గోరా

స్నేహితు లిద్దరూ కలిసి చాలా సేపు మాట్లాడుకున్నారు. వినయుడు తన మనసు విప్పి గోరాకు చెప్పేశాడు. ప్రేమ అతన్ని స్ఫూర్తిగామార్చేసి, అతని హృదయాన్ని అనిర్వచనీయానందంతో నింపేసింది. “ప్రేమ మన ఆత్మను మేల్కొలుపుతుంది. అంతదాకా మనహృదయాల్లో ఎంతచైతన్యం దాగఉన్నదో మనకు తెలీదు అందుకే జీవితం నీరసంగా ఉంటుంది.” అన్నాడు వినయుడు.

వినయుడు వెళ్ళాక గోరాకు ఆరోజు గ్రామసంచారం వెళ్ళబుద్ధికాలేదు. వినయుడి మాటలతో చైతన్యం పొందిన కారణంగా అతనికి సుచరితను చూడబోవాలనిపిం చింది. అతను సుచరిత ఇంటికి వెళ్ళి తలుపు తట్టేసరికి నౌకరొకడు తలుపు తెరిచి, ''చిన్నమ్మగారు ఇంట్లోలేరు. లలితమ్మగారి పెళ్ళిప్రయత్నాలు చూడబోయారు. రెండు రోజు లయింది,'' అని చెప్పాడు.

ఆ తరవాత ఎవరో కొత్తమనిషి హుక్కా తాగుతూ వచ్చి గోరాను లోపలికి ఆహ్వానించి, కాస్సేపు మాట్లాడి పంపేశాడు. గోరా ఈ మనిషిని ఎరగడు. ఇతను హరిమోహిని ఆఖరు మరిది, కైలాసుడు. ఇతనికి ముప్పైఅయిదేళ్ళు. భార్య పోయింది. అతనికి సుచరితనిచ్చి పెళ్ళిచెయ్యటానికి హరిమోహినిచేసినప్రయత్నాల

ఫలితంగా ఇతను కలకత్తా చేరాడు. కాని అప్పటికే సుచరిత లలిత పెళ్ళిపనులమీద వెళ్ళిపోయింది.

పెళ్ళి అయిపోగానే సుచరిత తిరిగి వస్తుందని హరిమోహిని అనుకున్నది. కాని పెళ్ళి అయాక సుచరితా, తానూ లలితవెంట కొన్నిరోజు లుండదలచినట్లు ... మయి హరిమోహినికి చీటీ పంపింది. వెంటనే హరిమోహిని పల్లకీ మాట్లాడి సుచరితను తీసుకుపోవటానికి వచ్చింది.

సుచరిత హరిమోహినివెంట బయలుదేరుతూ ఆనందమయితోనూ, లలితతోనూ తాను మధ్యాహ్నానికల్లా తిరిగివస్తానని చెప్పింది. ఆమె తన యింటికి చేరుతూనే, నౌకరుచేత ఒంటికి నూనె మర్దన చేయించుకుంటున్న కైలాసుణ్ణి చూసింది. కాని అతను తనకు నిర్ణయించబడిన భర్త అని గ్రహించలేదు.

ఆసంగతి హరిమోహిని బయటపెట్టి, "అలాటిమొగుడు దొరకటం నీ అదృష్ట మనుకో," అన్నది.

"నేను చచ్చినా పెళ్ళి చేసుకోను," అనేసింది సుచరిత...

అవినాశుడు గోరా ప్రాయశ్చిత్త కర్మగురించి చాలా పెద్ద హడావుడి చేసి, పత్రికలలో వ్యాసాలు రాసి, ఆహ్వానాలు పంపాడు. దేశం మూలమూలలనుంచీ ఉత్తరాలు రాసాగాయి. కృష్ణదయాళుడి మిత్రులు వచ్చి, "నీ కొడుకు నీఅంతవా డనిపించాడు," అని అభినందించసాగారు.

కృష్ణదయాళుడు సింగారుపడి గోరాకోసం బయలుదేరాడు. గోరా పూజా మందిరంలో పూజ చేస్తున్నట్టు తెలిసింది. కృష్ణదయాళుడు పూజామందిరానికి వెళ్ళి, వాకిలి అవతలికి పిలిచి, తక్షణం బయటికి రమ్మని గోరాను పిలిచాడు. గోరా వచ్చి ఏమిటని అడిగాడు.

"పూజామందిరంలో కెందుకు వెళ్ళావ్? నీ కక్కడేం పని?" అన్నాడు కృష్ణదయాళుడు చిరాకుగా.

"దేవుడి పూజ చేస్తున్నాను."

"నువు పూజ చెయ్యకూడదు. అదంతా పూజారి చూసుకుంటాడు. ఇదో సంగతి. నువు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నావుటగా. వద్దని చెబితినే?" అన్నాడు కృష్ణదయాళుడు.

"వద్దన్నారు గాని కారణం చెప్పలేదు."

"కారణాలతో నీ కేం పని? పెద్దవాళ్ళం వద్దంటే వినాలి."

దహనం చెయ్యబోతున్నాడు. అటుతరవాత తాను సన్యాసే. ఈలోపల ఈ అవకాశం తీసుకుని సుచరితను ఆఖరుసారి చూసి, మనసారా ఆనందం పొందితే తప్పేం ?

అతని కింకొక ఆలోచన వచ్చింది. తన తండ్రి తన ప్రాయశ్చిత్తానికి పూర్తిగా విరుద్ధంగా ఉన్నాడు. దానికి తప్పక కారణం ఉంటుంది. ఆ కారణం ఏమిటో ? తెలుసుకుంటే అదే తన సమస్యకు విమోచన మార్గం కావచ్చు. హరిమోహినిని ఒక్క క్షణం ఉండమని, గోరా, కృష్ణదయాళుడి గదికి వెళ్ళాడు. గది తలుపు గడియవెట్టిఉన్నది. ఆయన లోపల ఏదో యోగాభ్యాసంలో ఉన్నాడు; తలుపు తెరవడు.

అతను నిరాశ చెంది తిరిగి రాగానే హరిమోహిని, "ఒక్కసారి మా ఇంటికి రా, బాబూ!" అని బతిమాలింది.

"నేను రాను. నా కేమిటి సంబంధం ?" అన్నాడు గోరా.

"పోనీ కైలాసును చేసుకోమని ఒక్క ముక్క రాయి."

"నే నాయ న్నెరగను. ఎలా రాసేది ?"

ఆమె బాధ పడలేక చివరకు గోరా కాగితం తీసుకుని దానిమీద ఇలా రాశాడు: "స్త్రీలకు అందరి క్షేమమూ సాధించటమే సార్థక్యం. ప్రపంచంలో కష్టా లుండవచ్చు; సుఖా లుండవచ్చు–శీలమూ పవిత్రతా గల స్త్రీ అన్నిటినీ స్వీకరించి, తన మతాన్ని తన ఇంట ప్రతిష్ఠించటం తన ధర్మంగా భావిస్తుంది."

హరిమోహిని మర్నాడు ఉదయం సుచరితకు ఆ చీటీ చూపి, "మీ గురువువారు నీ కిది ఇచ్చారు." అన్నది. అందులో సుచరితకు తెలియని దేమీ లేదు; కాని గోరా తన కా చీటీని ఇవ్వ దెందుకు పంపాలి. తన పెద్దమ్మ ద్వారా ఎందుకు పంపా లన్నది ఆమెను బాధించింది. ఆమె మౌనంగా ఉండటం చూసి హరిమోహిని, "ఆ చీటీలో రాసినది సరిగానే ఉన్నదా ?...అయితే ఇంక జాప్యం దేనికీ?" అన్నది.

"జాప్యం చెయ్యను. నాన్నగారిని ఒక్కసారి చూసిరావాలి," అన్నది సుచరిత.

ఆమె వెళ్ళేసరికి పరేశబాబు పెట్టె సర్దుకుంటున్నాడు.

"రేపు ఉదయం మెయిలుకు సిమ్లా వెళుతున్నానమ్మా ?" అన్నా డాయన. ఆయనకు ఇంట్లో శాంతిలేకుండా పోయింది.

"నన్నుకూడా తీసుకువెళ్ళు, నాన్నా!" అన్నది సుచరిత, ఆయన పెట్టెను తానే సరిగా సర్దుతూ...

హరిమోహిని చేతికి చీటీ ఇచ్చాడే గాని దానిపైన అతని హృదయం సంతకం చెయ్యలేదు. అందుచేత గోరా ఆ రాత్రి గంగాతీరానికి వెళ్ళక తెల్లవార్లూ గంటలు

లేక్కుంబాడు. మర్నాడు ఉదయం అతను ప్రాయశ్చిత్తస్థలం చేరేసరికి అక్కడ వాలాకంది పండితులూ, శాస్త్రజ్ఞులూ చేరి, గోరాకు గల మతాభిమానాన్ని తెగ పొగడారు.

గోరా గంగాస్నానం చేసి బట్టలు కట్టుకుని ప్రాయశ్చిత్తవిధికి సిద్ధమవు తూండగా అవినాశుడు వచ్చి, "కృష్ణదయాళబాబుకు జబ్బుగా ఉంది," అని చెప్పాడు.

గోరా కట్టుబట్టలతోనే ఇంటికి వెళ్ళాడు. కృష్ణదయాళుడు జబ్బుగా పడుకుని ఉన్నాడు. ఆనందమయి ఆయన కాళ్ళు వత్తుతున్నది. ఎలా ఉంది అని గోరా అడిగితే, "ఇప్పుడు కాస్త నయమే. డాక్టరుకోసం కబురు వెళ్ళింది," అన్నది.

రోగి మంచంపక్కనే కుర్చీ వేసి ఉన్నది. అందులో కూర్చోమని కృష్ణ దయాళుడు సైగ చేశాడు. గోరా కూర్చున్నాడు. కృష్ణదయాళుడు మిగిలినవా ళ్ళందరినీ బయటికి వెళ్ళమని, ఆనందమయి కేసి ఒకసారి చూసి, గోరాతో, "నా కాలం దగ్గరపడింది. నీకు తెలియకుండా ఒక విషయం దాచాను. నీకు చెప్ప నవసరం లేకుండానే జరిగిపోతుం దనుకున్నాను; కాని జరగదు. నేను పోతే ఉత్తరక్రియలలో నీకు వంతెలా ఉంటుంది?" అన్నాడు బలహీనంగా.

గోరా తల్లి కేసి తిరిగి, "నే నాయనకు ఉత్తరక్రియలు చెయ్యగూడదా? ఏమి టమ్మా ఇదీ?" అన్నాడు.

"చెయ్యగూడదు నాయనా," అన్నది ఆనందమయి.

"అయితే నే నాయన కొడుకును కానా?" అన్నాడు గోరా ఆశ్చర్యంతో దిమ్మరపోయి.

"కావు."

ఈసారి ప్రశ్న గోరా హృదయంలోనుంచి బద్దలయివచ్చింది; "అయితే నువు నా అసలమ్మవు కావా, అమ్మా?"

"నాయనా, గోరా! నువేరా నా అసలుకొడుకువు. నేను గొడ్రాలిని. కాని నా కడుపున కన్నకొడుకుకన్నా ఎక్కువైనవాడివి," అన్నది ఆనందమయి.

"అయితే నేను మీ కెక్కడ దొరికాను?"

"తిరుగుబాటు సమయంలో మేం ఇటావాలో ఉండగా, ఒకరాత్రి నీతల్లి మాఇంట దాక్కున్నది. ఆమెభర్త కిందటిరోజే పోయాడు. అతని పేరు——" కృష్ణదయాళుడు అన్నాడు.

"ఆయనపేరు నా కనవసరం," అన్నాడు గోరా.



"అతను ఐరిషువాడు. ఆ రాత్రే నీ తల్లి నిన్ను ప్రసవించి చనిపోయింది. అప్పటినుంచీ మా ఇంటనే పెరిగావు."

గోరాకు ఒక్క క్షణంలో గతమంతా కలలాగా అయింది. అతని జీవితపు పునాదులు కూలిపోయాయి. అతనికి తల్లిలేదు, తండ్రిలేదు, జాతిలేదు, దేశంలేదు, వంశంలేదు, దేవుడులేడు. అతని కిప్పు డెలాటి ఆధారమూలేదు. అంతా సూన్యం.

ఒక ఇంగ్లీషుడాక్టరూ, బెంగాలీవైద్యుడూ వచ్చారు. ఆదివరకు ఇంగ్లీషువాడు కనిపిస్తేనే రోతపడే గోరా, ఈ ఇంగ్లీషు డాక్టరును చూసి, 'అందరికన్న నాకు సన్నిహితు డితనా?' అనుకున్నాడు.

డాక్టరు రోగిని పరీక్షించి ప్రమాద మేమీ లేదన్నాడు. ఆయన వెళ్ళిపోయాక గోరా ఆనందమయిని, "ఇదంతా నాకు ముందే ఎందుకు చెప్పలేదమ్మా?" అని అడిగాడు.

"నిన్ను పోగొట్టుకుంటానన్న భయంచేత, నాయనా!" అన్నది ఆనందమయి.

గోరా తల్లితో పరేశబాబు ఇంటికి వెళ్ళవస్తానని చెప్పి బయలుదేరాడు.

గోరా వచ్చేసరికి సుచరిత ఇంకా పెట్టె సర్దటం పూర్తికాలేదు. అత వింకా ప్రాయశ్చిత్తానికి ధరించిన పట్టుబట్టలతోనే ఉన్నాడు. అతన్ని చూడగానే సుచరి



తకు తాను మొట్టమొదట అతన్ని చూసిన అవతారం గుర్తుకొచ్చి, కొంచెం భయం కలిగింది.

గోరా లోపలికి వస్తూనే పరేశబాబు కాళ్ళవద్ద మోకరించి, తల నేలకు తగిలేటట్టు వందనం చేశాడు. పరేశబాబు కంగారుగా అతన్ని లేవనెత్తి, "కూర్చో నాయనా, కూర్చో," అన్నాడు.

"పరేశబాబూ! నా కిప్పు డెలాటి బంధాలూ లేవు," అన్నాడు గోరా.

"బంధా లేమిటి," అని పరేశబాబు అడిగాడు.

"నే నిప్పుడు హిందువును గాను. నా తల్లిదండ్రులు ఐరిషువాళ్ళనీ, నేను సిపాయీల తిరుగుబాటు సమయంలో దొరికాననీ ఇంతకుముందే తెలిసింది. ఈ భారతదేశంలో నేను ప్రవేశించదగిన ఆలయం లేదు. హిందువుల విందులలో నేను పాల్గొనరాదు...పరేశబాబూ! భారతదేశాన్ని నా జీవితంతో సాక్షాత్కరింపజేసుకుందామని విశ్వప్రయత్నంచేసి, అడుగడుగునా ఎదురుదెబ్బలు తిన్నాను. ఆ ఎదురుదెబ్బలను ఆరాధించాను. అంత తప్ప నే నిం కేపనీ చెయ్యలేకపోయాను. ఇండియా వాస్తవరూపం ప్రత్యక్షమైనప్పుడల్లా వెన్ను చూపి, నా విశ్వాసాలను దక్కించుకునేటందుకు బ్రహ్మప్రయత్నం చేశాను. ఇవాళ ఒక్క క్షణంలో నా కలలన్నీ మాయమై, నే నొక మహత్తర సత్యంమధ్య స్వేచ్ఛగా నిలబడ్డాను. ఇప్పుడు నాకు వాస్తవదేశంకోసం నిజంగా శ్రమించే అధికారం వచ్చింది."

"మనకు నిజం లభ్యమయాక దానికి కృత్రిమపు తొడుగులు తొడగకుండానే ఆనందం పొందగలం," అన్నాడు పరేశబాబు.

"ఇవాళ నాకు స్వేచ్ఛ లభించగానే ముందు మీదగ్గిరికి ఎందుకు వచ్చానో తెలుసా? స్వేచ్ఛామంత్రం మీకు తెలుసు; అందుకే ఇవాళ మీకు ఏ సమాజం లోనూ స్థానంలేదు. నన్ను మీ శిష్యుడుగా చేసుకోండి. హిందువులకూ, ముసల్మానులకూ, క్రైస్తవులకూ, బ్రహ్మసామాజికులకూ ఈశ్వరుడైనవాడి మంత్రం నాకు ఉపదేశించండి. ఆ ఈశ్వరుడే భారతదేశం!'' అన్నాడు గోరా.

తరవాత అతను సుచరిత చెయ్యి పట్టుకుని, ఆమెతో సహా పరేశబాబుకు ప్రణామం చేశాడు...

ఆ సాయంకాలం గోరా ఇంటికి వెళ్ళి ఆనందమయితో, "అమ్మా, నీ లక్ష్మిని కాసిని మంచినీళ్ళు తెమ్మను," అన్నాడు.

వినయుడికి కబురు చేస్తున్నాను, నాయనా!" అన్నది ఆనందమయి రహస్యంగా గోరాతో.





## జరిగిన కథ

రవి చనిపోవడంతో మీనాక్షి పరీక్షకు పోలేదు. చదువుకు అంతరాయం కలిగింది. సవత్తల్లి, ఆమెతమ్ముడు శంకరం విపరీతమైన భయాన్ని కలిగిస్తున్నారు మీనాక్షికి. విశ్వనాథం, భార్యకు భయపడ్డా. కుమార్తె శ్రేయస్సు కోరి, మీనాక్షి ఒప్పందలమీదే, వసుంధరకూ, శంకరానికీ ఏదో సాకుచెప్పి- తెలియనీయకుండా, రెండో పెళ్ళికి – శ్రీనివాసరావు అనే స్కూలుమాస్టరుతో పెళ్ళి నిశ్చయంచేసి, తిరుపతికొండకు మీనాక్షిని తెచ్చి పెళ్ళి జరిపించేసి, తీర్థయాత్రలకు వెళ్ళిపోయాడు. శ్రీనివాసరావు మీనాక్షిని చెంతకు చేర్చుకుని, ఆమె మంచితనానికి ముగ్ధుడై, తన పాపప్రక్షాళనకై మొదటిభార్య మరణం గురించి చెప్పసాగాడు. — ఇక చదవండి.

''మీనా! కలియుగంలో భగవంతు' డనే మాటకూ, రూపానికీ, మహత్యానికీ, ఇంకా కొంత విలువ అంటూ వుందంటే, ఈ తిరుపతి వేంకటేశ్వరుడే అందుకు నిదర్శనమని నామటుకు నే ననుకుంటాను ... ఆ విశాల నేత్రాలు సర్వ ఉత్కృష్ట



నికృష్ట కర్మలకూ సాక్షిభూతాలు ... ఆ చక్షువులు సర్వమంగ ళామంగళ శబ్దాలకూ శ్రోతలు! ఆ హస్తాలు పరమ పుణ్యులకు పాపులకుకు కూడా అభయ ప్రదాలు! ఆ దివ్య పాదాలు సర్వ ప్రాణికోటికీ శరణ్యాలు! అలాటి ఆ దేవుని సన్నిధిలో, ఈనాడు ... నీతో మరో క్రొత్త దాంపత్య జీవితాన్ని ఆరంభించబోతూ, నా పాపా లన్నిటినీ నా నోటితోనే చెప్పివేస్తాను ... బహుశా నా కుటిలకర్మలతో, నిరంతరం నన్ను వేదిస్తున నా మనస్సాక్షికి అది కొంత భారం తగ్గించవచ్చు... నిన్ను చూచిన నిముషంలో, బహుశా నీలో ప్రత్యేకమైన క్షమాపూరిత సహృదయ ముందని, మనసు ఎలుగెత్తి చెప్పింది ... అందుకే ఏదీ దాచను...ఆతర్వాత ఏదో దాచాననే బాధ నా కుండదు...వింటావా? విని భరిస్తావా?...'' శ్రీనివాసరావు క్షణంలో ఆవేశపూరితు డయ్యాడు. అంతటి ఉద్రిక్తతలోనూ అతడిముఖంలో విచారం గూడుకట్టుకుంది!

మీనాక్షి క్షణకాలం, వూహించని ఈ పరిణామానికి, కలవరపాటు చెందింది ... కానీ తప్పదు ... వినీతిరాలి ... భర్త వదనంలోని దుఃఖమూ, అభ్యర్థనా తననూ కలచివేస్తున్నాయి.

''చెప్పండి అంది మీనాక్షి.''

"మీనా! సరిగ్గా పది సంవత్సరాలక్రితం, ఈ దేవునిముందే, ఇదే విధంగా, శారద మెడలో మంగళసూత్రం కట్టాను. కానీ పెళ్ళి ఇంత గుట్టుచప్పుడుగా కాక,

బంధుమిత్రుల, వారివారి సకుటుంబాల, ఆనంద, ఆశీర్వచనాల మధ్య, మంగళ తూర్యారవాలలో, మహాగొప్పగా జరిగింది. ఇల్లాగే మూడురోజులూ మా నవదంపతులమూ, కొందరు బధుమిత్రులమూ ఇక్కడే గడిపాము మహా సరదాగా..."

శ్రీనివాసరావు గంభీరంగా మారిపోయాడు ... గతస్మృతుల బాధనల మేదో అతణ్ణి దహించివేస్తోంది! వెనుక తలగడాలు రెండూ, మంచానికి నిటారుగా చేసుకుని, వాటిని ఆనుకుని కూర్చున్నాడు...

"గతించిన సుఖం ఎప్పుడూ, తీయనికలలా హాయిగా వుంటుంది ... మననం చేసుకున్నప్పుడల్లా! శారద ఎంత అందమైనదో, అంత మంచిది. ఆమె మన స్వంతటి పవిత్రమైనది ... ప్రాచీన వేదకాలంనాటి మహాత్ములు స్త్రీరూప, లక్షణ, స్వభావాలను గురించి వర్ణించిన వర్ణనలకు ప్రతిబింబమే శారద! కాలానుగుణ్యమైన మార్పులతో, నా శారద, మెట్రిక్ పాసయ్యింది...ఈనాటి సభ్యతాసంస్కృతులను శృతిమించకుండా, తనలో జీర్ణింపచేసుకుంది ...

అమ్మనాన్నలకు మేం నలుగురం బిడ్డలం – నేను, ప్రభాకర్, ఇందిర, కళ్యాణి...''

మీనాక్షి, "మరి ఇంది రేదీ?'' అందా మనుకుంది ...

కానీ శ్రీనివాసరావు కళ్ళు మూసుకుని చెప్పుకుపోతున్నాడు.

అతడి పరితప్త హృదయంలోనుంచి వెలువడుతున్న ఆ వాక్ప్రవాహాన్ని ఆటంకపరచటం సమంజసం కాదనిపించింది మీనాక్షికి ... ప్రశ్న లోపలే అణచివేసింది.

* * * *

"పెద్దవాణ్ణనో, మరే కారణంవల్లనో, అతి గారాబంగా, అరిచేతుల్లో పెట్టుక పెంచారు అమ్మా నాన్నా!

ఫలితం ఇంటరు మూడుమార్లూ, బి.యస్‌సి. రెండుమార్లూ చదివి, నాన్న పలుకుబడి సాయంతో, ఎలాగో బి. ఇడి. కూడా అయిందనిపించాను ... తిన్నగా, ఇరవై సంవత్సరాలకు హైస్కూలు మాస్టరుగా రూపొంది, సకల దుర్గుణ సమన్వితుణ్ణీ అయాను. ఒక్కత్రాగుడు మినహా సప్తవ్యసనాలూ నాలోనే తిష్టవేశాయి!

ఆ ఉద్యోగం చెయ్యకున్నా, నాన్న సంపాదించిన ఆస్తితో, దిగుల్లేకుండానే నా జీవితం వెళ్ళమార్చవచ్చు; కానీ 'ఉద్యోగం పురుష లక్షణం' అంటూ ఓ 'సామెత వుండి ఏడ్చింది ... దాంతో, నాన్న సణుగుడునుంచి తప్పించుకోవటానికి చెయ్యక తప్పిందికాదు ... "పెళ్ళి చేసి పరాయితల్లి కన్నబిడ్డ గొంతు కొయ్యటమెందుకు? వాణ్ణలాగే తిరగనీ! మన గారాబం, అతి చనువూ వాణ్ణలా తయారు




చేసాయి ... మనం అనుభవిస్తున్నాం చాలదూ? ఇంకా వాడికి పెళ్లెందుకు?" అంటున్నారు నాన్నగా రొకరోజు అమ్మతో!

వరండాలోనే వుండిపోయాను అమ్మ సమాధానం వినాలనే కుతూహలంతో.

"మిగతా పిల్లల్ని మాత్రం గారం చెయ్యలేదూ? అంతా అలా తయారయ్యా రంటావా? బహుశా వాడికి మీ మేనమామ పోలికలు వచ్చుంటాయి! పెళ్ళయ్యాక ఎందరు బాగా మారటంలేదు? ఏదో కాస్త పిల్లతరహాగా తిరుగుతున్నాడని వాణ్ణి సన్యాసిగానే వుంచేద్దామంటారా? మిగతా పిల్లల గతేమిటి? అసలు మన బిడ్డలోని లోపం మనమే బయట పెట్టుకుందామా ఏమిటి?" అమ్మ కాస్త కాస్తగా గొంతు హెచ్చిస్తోంది!

"అలా అని ఎవరో అన్నెం పున్నెం ఎరుగని పిల్లను తెచ్చి ..."

నాన్న మాట సగంలోనే త్రుంచివేసిం దమ్మ.

"ఊరుకోండి ... పెళ్ళయితే అన్నీ చక్కబడతాయి ... మీకు తెలీదు ... శీనుకు పెళ్ళి సాధ్యమైనంత త్వరలో చెయ్యాల్సిందే!"

"'ఊరంతా మా నాన్నకు లోకువ ... మానాన్న మా అమ్మకు లోకువ' అన్నాడట ఎవరో పల్లెటూరు ఆసామీ ఎప్పుడో ... మా అమ్మ విషయంలో మాత్రం అది అక్షరాలా నిజం! నాన్న అంత ఆస్తిని సంపాదించిన ఘనుడే కావచ్చు, ఎంతో పలుకుబడి గలిగి, నాబోటివారిని 'ఉద్యోగులుగా' తయారు చెయ్యగల సమర్థుడే కావచ్చు, మిగతా పిల్లలందర్నీ అదుపులో పెట్టగల

ధీమంతుడే కావచ్చు. కానీ అమ్మమాటకు ఎదురు చెప్పలేని బలహీనుడు ... నాన్న నచ్చచెప్పచూచినా అమ్మ వినిపించుకోదు! అమ్మలోని ప్రత్యేకతే అది! తాను చూచింది తెల్లకాకి అని ఘంటాపథంగా వాదించి, ఇక నాన్న 'నీ యిష్టం ... నీ యిష్టమొచ్చిన ట్లనుకో ... మూర్ఖురాలితో వాదించటము వృధా శ్రమే తప్ప మరొకటిలేదు..." అంటూ వెళ్ళేవరకూ తన వాక్చాతుర్యాన్నీ, తన కంఠస్వర గంభీర నాదాన్నీ కొనసాగిస్తుంటుంది!

సరే! అమ్మా, నాన్నా నా పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారన్నమాట!

పెళ్ళి అన్నా, పెళ్ళా మన్నా ఓ నిర్దిష్టమైన అభిప్రాయమంటూ ఏమీలేదు. నాదేం పోయే పెళ్ళి చేసుకుంటేమాత్రం! అనుకున్నాను నవ్వుకుంటూ!

అమ్మకొకావల్సింది, కట్నమూ, నగలూ!

నాన్నకొకావల్సింది గుణమూ!

నాకొకావల్సింది, అనుభవమూ, జల్సా!

అందరి కోర్కెలూ తీరేలా, నాలుగువేల రూపాయల కట్నమూ, ముప్పై నవర్సుల బంగారునగలూ, చల్లటి వెన్నెల్లాటి స్వచ్ఛమైన రూపమూ, గుణముతో శారద, నా భార్యగా, ఈ ఇంటి పెద్దకోడలుగా వచ్చింది. శారదతో ఆరునెలలూ ఆరురోజులుగా గడిచిపోయాయి! పాత ఆడస్నేహితులవంక కన్నెత్తి చూడడం లేదు ఈమధ్య!

అమ్మ అసాధ్యురాలు! నామీద, నన్ను బేరంపెట్టి సంపాదించిన నాలుగువేల రూపాయలూ, ఇందిరా, కళ్యాణీలకు నగలు చేయించేసింది! అసలువాడికి నాకు, దమ్మిడీ దక్కలేదు!

ఓరోజు అలా వీధిన వెడుతూంటే సరోజ ఎదురైంది, వానిటీబేగ్ తిప్పుకుంటూ.

"ఏం రావ్! బొత్తిగా నల్లపూసవై పోయావ్! కొత్తభార్య మోజులో మేం మరపుకొచ్చాం కాబోలు!" సరోజ నిష్ఠూరంగా తల విదిల్చింది, చెవుల రింగులు చెంపలు తాగేలా!

"అబ్బే! లేదు సరూ! బొత్తుగా తీరటంలేదు ... ఇప్పుడు మాత్రం ... నడి వీధైపోయిందిగానీ ... లేకుంటే ... అలా ఎర్రగా వూరిస్తున్న నీ పెదాల్ని ... వృధా పోనిద్దునా ?" అన్నాను నవ్వుతూ...

"...చాల్లే...మాటలు మాత్రం చెబుతావు కడుపునిండిపోయేలా...సాయంత్రం నీకోసం వెయిట్ చేస్తుంటా ... వస్తావుకదూ?" అంది హృదయం గిలగిల లాడించే, చూపులు విసరుతూ!

"ఎన్నిగంటల కేమిటి? మళ్ళీ మరొకరికి ఎంగేజిమెంటు ఇచ్చినట్లైతే కాకుంటే సరి..."

"ఊరుకో ... కొంటెమాటలూ నువ్వూను..." వీధిలో జనానికి విన్పించనంతటి మృదువుగా మెల్లిగా అని, ఉల్లిపొరలాటి తన చేలాంచలాన్ని నాకు తగిలేలా విసరి, వెళ్ళిపోయింది సరు!

సాయంత్రం సరోజను సంతోషపెట్టక తప్పిందికాదు! మరోరోజు, సినిమా హాల్లో, నిలవేసింది బేగం!

"కొత్తొక వింత, పాతొకరోత! అంటారు ఇదేకాబోలు ... మీ మగబుద్ధి పోనిచ్చావుకాదు..." అంది పంజాబీ డ్రెస్సులో అందంగా వుండి, జారిపోతున్న నైలాన్‌ను సరిజూచుకోవాలనే లేశమాత్రం ఆలోచనకూడా లేకుండా.

'రేపు వస్తా' నంటూ ఒట్టుపెట్టుకున్నా విడవక, సినిమా అయిపోగానే, అటునుంచిటే లాక్కెళ్ళింది తన ఇంటికి.

ఇక కత్యాయని దదోరకంతరహా!

పైకి ఏమీ ఎరగనిదానిలా వుంటుంది. ఎవరికీ విన్పించకుండా, ఎవ్వరూ గమనించకుండా, సంకేతాలు చేస్తుంది! సరోజ, బేగంలు ఎవరికయినా ఇట్టే తెలిసిపోతారు 'ఫలానారకం' అని. కత్యాయని అలా బయటపడదు!

బుద్ధిపూర్వకంగానే వెళ్ళా నొకరోజు కాత్యాయని దగ్గరికి.

అలవాటుగా ప్రదర్శించే నునుసిగ్గు ఎంతో అందంగా వుంటుంది, ఎప్పటి కప్పుడు నవ్యరీతుల్లో!

ఇలాటి సిగ్గు శారద పడగలదా? ఊహూఁ మొద్దు! దొత్తిగా చేతకాదు. చెంపల్లో కెంపులు పూయాలి, అధరాలు కంపిస్తున్నట్లుండాలి ... క్రిందిపెదవి నొక్కిపట్టి, చిలిపికళ్ళతో నవ్వుతూ, కనుకొలకులనుంచి చూస్తూ, నేను తన చేలాంచలం చేత చిక్కించుకోగానే, చేతులు రెండూ ముఖాని కడ్డం పెట్టుకుంటూ, ఏదేదో చేయాలని తహతహలాడే నన్ను మృదువుగా వారించే కాత్యాయని 'కళ' వెయ్యిజన్మలెత్తినా శారదకురాదు. చిరునవ్వుల్తో కవ్వించి, చిలిపిమాటలతో, నన్ను తన చుట్టూ భ్రమరంలా త్రిప్పుకొనగల కాత్యాయని నేర్పు శారదలో ఏ కోశానా లేదు!

అందాకా ఎందుకు? కాస్త సన్నటి బట్టలు ధరించమంటే-

"ఛ. ఛ ... శరీరంలోని ఒంపుసొంపుల్ని ప్రదర్శించే బట్టలు స్త్రీకి అందాన్ని ఇవ్వవండీ!" అంటుంది...పాతకాలపు దద్దమ్మలా!

శారదేకాదు...ఈ 'భార్య' లనబడే స్త్రీలలో చాలామం దిలాటివారే! పలచని

బట్టలు ధరించలేరు...వంటినిండా, కప్పుకుని, పిసరంత శరీరమయినా పైకి కనిపించనీయరు...పట్టపగలు భర్త నీడలోకికూడా రారు! 'పెద్దవాళ్ళున్నారంటూ' తమకు తామే హద్దులు పెట్టుకుంటారు: లేదా, 'స్త్రీకి శీలం, అభిమానం ముఖ్యం' అంటూ అమ్మమ్మ కబుర్లు చెబుతారు. అసలీ భార్యలు అందంగా ఉన్నారని భ్రమే కల్గుతుందో, లేక, రోజులు గడిచేకొద్దీ వారిలో నిజంగానే మార్పు పస్తుందో తెలియదుగానీ, పెళ్ళయిన కొత్తల్లో వారిలోవున్న సౌందర్యమూ, అలంకరణా, చలాకీతనమూ, మెల్లిగా మరుగుపడిపోతాయి! లేనిపోని అరిందాతనం తెచ్చిపెటుకుంటారు అలంకరణ అసలు తగ్గించేస్తారు! పాతగొంగళ్ళలా, ఎక్కడికక్కడ పడివుంటారు!

శారదా అంతే! ఎప్పుడు చూచినా 'పనీపాటా' అంటుంది. పొయ్యిమీద పప్పు కలియబెడ్తూ, పొగచూరి, నీళ్ళు కారుతున్న కళ్ళతో, జేవురించిన ముఖంతో ప్రత్యక్షమైతే, అసహ్యం వెయ్యదూ? సరోజ నేసమయంలో కలుసుకున్నా చక్కగా డ్రెస్ చేసుకుని, మిలమిల తారకలా మెరుస్తుంటుంది! బేగం సరేసరి! నాముందే స్టౌ వెలిగించి టీ తయారు చేస్తుంది! ఆ పన్లు చేస్తున్నా ఎంత తమాషాగా వుంటుందనీ? ముఖానికి పౌడర్ వేసుకోదు శారద. కారణ మడిగితే ఒక ఉపన్యాసం దంచేస్తుంది.

"సహజంగా అందమంటూ వుండాలిగానీ, లేని అందాన్ని ఆ పౌడర్ తెస్తుందంటారా?" అంటూ! పెద్ద నాపసానిలా మారి, అస్తమానూ అమ్మ కొంగట్టుకు తిరుగుతూ, నీళ్ళు తోడుతూనో, అంట్లు తోముతూనో, వంట చేస్తూనో వున్న శారదను చూచేకొద్దీ నాలో జుగుప్స, నిర్లక్ష్యం, అసహ్యం కలుగుతున్నాయి. రాత్రిళ్ళు నాదగ్గర జేరినా, ఏదో కుటుంబ విషయాలు మాట్లాడ్తుంటుందే గానీ, నా పంగతా పరిచయస్థుల్లా నన్ను కవ్వించలేదు! ఏంమనిషో ఏమిటో! ఎలా వుంటేనా కేం? ఇవన్నీ చాలవన్నట్లు శారద ప్రస్తుతం గర్భిణి!

అసలు స్త్రీ అంటే నా ఉద్దేశ్యంలో అందమైనదీ, అందానికి నెలవైనదీ, నిరంతరం అనుభవైక యోగ్యమైనదీను! ఈ గర్భమూ, బిడ్డలూ వగైరా, పురుషుని సౌఖ్యానికీ, ఆనందానికీ అంతరాయాలు! అందుకే నాకు గర్భిణీస్త్రీలంటే పరమ అసహ్యం; పొట్ట లావుగా, వికృతంగా వుంటారు!

అందుకే మళ్ళీ నా మామూలు దారిలో పడ్డాను. నిత్యనూతనయౌవనులూ, నవ్య శృంగార కళావిలాసినులూ, ముఖ్యంగా గర్భం వగైరా అవరోధాలు లేనివారూ నా కిష్టులు!



స్కూలుకు వెళ్ళటం, ఆ ముక్కున పెట్టుకున్న నాలుగు ముక్కలూ విద్యార్థుల ముఖాన వెయ్యటం, ఆ తర్వాత నేరుగా ఏ 'శృంగారలహరి' ఇంటికో దారి తియ్యటం! ఇదే నా దినచర్య.

*　　*　　*　　*

లోకంలో కొందరు మనుష్యులు ఒకరకమైన స్వభావానికి చెందినవా ళ్ళుంటారు. ఆ స్వభావానికి స్త్రీ పురుష బేధం లేదు: ఎవరింట్లో ఏం వండుకున్నారో, ఏం తిన్నారో, భోగట్టా వీరి క్కావాలి! అస లదేపనిమీద వుంటారు కాబోలు! లేకుంటే నా ప్రవర్తనతో, వీళ్ళ కేంపనో? ఎవరో నాన్నగారితో నా'మితిమీరుతున్న' ప్రవర్తనను గురించి చెబుతున్నారుట అదే పనిగా!

నాన్నగారు, పొద్దుపోయి రాత్రి ఇంటికి వచ్చిన నన్ను భస్మం అయ్యేలా చూచారు!

"అప్పుడే కొంప జేరావేం? ఆ సాని ముండల చావిట్లో పడివుండక పోయావ్?" అంటూ హుంకరించారు ...

నేను మౌనంగా లోపలి కెళ్ళాను ...

"అసలే చలికాలం ... ఇంతరాత్రిపరకూ ఎక్కడెక్కడో తిరిగితే జబ్బు చెయ్యదూ?" శారద అంది లోపలి కెళ్ళగానే!

అసలే నాన్నగారో అగ్ని అయితే, ఈమె వాయువు! ఒళ్ళుతెలియని కోపం వచ్చింది.

"కట్టుకున్నదానివి! నీ కింత చనువేమిటి? చచ్చినట్లు పడివుండక!" అరిచాను.

"అసలు ఆడది మగాణ్ణి ఎక్కడి కెళ్ళావ్? ఏం చేసావ్? అంటూ అడగట మేమిటి?" అమ్మ కోడల్ని హుంకరించింది! నాకు వెయ్యి ఏనుగులబలం వచ్చింది!

"కోడలుపిల్లముండు, వాణ్ణిలా కేకలేస్తే, రేపొద్దుట అదీ నేర్చుకోదూ?" అంటూ నాన్నగారిని గొంతు నొక్కేసింది మా మంచిఅమ్మ!

* * * *

శారదకు ఏడవనెల వచ్చింది. అప్పుడప్పుడూ నన్ను మార్చాలని ప్రయత్నించి, దెబ్బలుకూడా తింటోంది. లేకుంటే తాళికట్టించుకున్న భార్యకంత అధికార మేమిటి? మామగారొచ్చి, శారదను పుట్టింటికి పిల్చుకెళ్ళాడు. వురిటికి. ఓపెద్ద బెడద తీరినట్లు: అప్పుడప్పుడు సంజాయిషీ చెప్పుకోవాల్సి వుండేది; ఇప్పుడా బాధకూడాలేదు! నే వింట్లో వున్నా, లేకున్నా పట్టించుకునేవాళ్ళు లేరు.

* * * *

నా స్నేహితుడు మూర్తి ప్రేమ భగ్నమయ్యింది. అస్తమానూ విరహగీతాలు పాడుతూ, భగ్నప్రేమ తాలూకు భావకవిత్వం రాస్తూ, పిచ్చివా డయిపోతున్నాడు రోజురోజుకూ! నేనూ, నాతోబాటు మాస్కూల్లోనే సైన్సు మాస్టరుగా పని చేస్తున్న నాగభూషణం, మూర్తిని మామూలు మనిషిని చేయ్యాలని కంకణం కట్టుకున్నాం!

పిక్చర్లకు లాక్కెళ్ళాం ... లాభం లేకపోయింది.

ఆడపిల్లల్ని పరిచయం చేశాము. అట్టే ప్రయోజనం కన్పించలేదు.

"ఇక వుండేది ఒకేమార్గం ... త్రాగటం!" అన్నాడు నాగభూషణం.

"ఎలాసాధ్యం? అసలే పెల్లెటూరికావడంతో అటూఇటూగా వున్న మనుషు లెక్కువ! అదీగాక మధ్యనిషేధంకూడా ఎక్కువగా వున్నదాయె!" అన్నాను కింకర్తవ్యతామూఢుడనై. ప్రాణమిత్ర దుఃఖనివారణాక్రియాశూన్యుడినై!

"ఫర్వాలేదు నే నప్పుడప్పుడూ ఓ 'దోస్' వేసుకుంటున్నాను ... ఆ మార్గం నాకు తెలుసు ..." అన్నాడు నాగభూషణం.

"ఎలా?" అన్నాను నమ్మలేక.

"ఆల్కహాల్ (స్పిరిట్) కు కొంత చక్కెర చేర్చి, మరికొన్ని రసాయనిక

ద్రవ్యాలు చేర్చి, కొంత పరిమిత ఉష్ణోగ్రతలో మరిగిస్తే .... నీ కెందు కా వివారా లన్నీ ? చక్కటి మధువు తయారవుతుంది... మదవతు లున్నపుడు మదిర లేక పోవటం, స్వీట్ లో తీపి లేనట్లే ...!"

నాగభూషణం అఖండ తెలివితేటలమీ దింకా నమ్మకం కలుగలేదు!

"నే స్వయంగా కనిపెట్టా నిది... రుచి చూస్తున్నానుకూడా ... నమ్మలేకుంటే, రేపు ఆదివారం సాయంత్రం ఐదుగంటలకు రాండి, నువ్వూ మూర్తి; చేసి చూపించి, త్రాగిస్తాను ... సరా ?'' ఛాలెంజి చేస్తూ వెళ్ళిపోయాడు నాగభూషణం. ఆదివారం, ప్రైవేటుక్లాసు సాకుతో, హెడ్మాస్టరు కోదండపాణిగారి నడిగి స్కూలు లేబొరేటరీ తాళాలు తీసుకున్నాడు నాగభూషణం.

అసలు ప్రతిసారీ ఇంతేనట!

నిర్ణీత సమయానికి, మూర్తిని కూడా వెట్టుకువచ్చాను ...

నిముషాలమీద తయారు చేశాడు నాగభూషణం!

మూర్తి చేత త్రాగించాడు. తనూ త్రాగాడు. నాకూ ఇచ్చాడు త్రాగమంటూ.

"వద్దురా!" అన్నాను కొత్త వ్యసనాన్ని చూచి కొద్దిగా జంకుతూ!

"ఛ, పిరికిపందా! అలా బెదురుతావేంటిరా ? ఒక్కసారి చూడు త్రాగి ... ఆ తర్వాత అక్కర్లేకుంటే మానేద్దూగానీ ...'' గ్లాస్ నోటి కందించాడు. అంతగా ప్రాధేయపడ్తుంటే, మరీ వద్దనడం సబబుకాదు, సభ్యతాకాదు. మరీ బెట్టుచెయ్యక త్రాగాను ... ముందు కాస్త కష్టమనిపించింది ... కానీ క్షణాలు గడుస్తున్నకొద్దీ, నాగభూషణం మాటల్లోని నిజం, రూపు ధరించింది! స్వర్గం అంటే ఎక్కడోలేదు, ఈ మధువులోనే ... నాలోనే, మా చేతుల్లోనే వుందనిపించింది!

నాగభూషణం ప్రజ్ఞా విశేషాలను మనసారా అభినందించాను. నా స్నేహితులు అందరూ దాదాపు నాగభూషణం లాటివారే! చదువుకునేరోజుల్లో, పేకాటలో గురు స్థానాన్ని అధిగమించేలా చేశాడు గోపాలం! అందమైన ఆడపిల్లల్నీ, సొసైటీ గరల్స్‌నీ మచ్చిక చేసుకోడ మెలాగో క్షుణ్ణంగా నేర్పాడు నారాయణ. ప్రస్తుతం నాగభూషణం ఈ స్వర్గద్వారాలకు, మార్గదర్శకు డయ్యాడు! ఓహ్, ఇంకేం, జీవితం ఎప్పుడూ నవవసంత ఋతువులోనే సాగుతూంటుంది!

నెలరోజుల్లోనే, మూర్తి బాగుపడ్డాడు ... నేనూ బాగుపడ్డాను ఇంకా; లేబరేట రీలో అవసరమయినంత స్పిరిట్, మిగతా పరికరాలూ యధేచ్ఛగా వాడుకుం టున్నాం ... వెంటనే వూరిమీదికి పోవడం; మా కార్యక్రమం నిరాటంకంగా సాగుతున్నంతలో మరోబెడద వచ్చిపడింది. స్కూల్లో స్పిరిట్ అంతా అయిపో

యింది. విద్యార్థులనుంచీ, ఊళ్ళోవాళ్ళదగ్గర్నుంచీ, అన్ని వివరాలూ హెడ్మాస్టరు గారి చెవివరకే గాక నాన్నగారికూడా తెలిసిపోయాయి! మేమంటే ఇష్టంలేని, మేం బాగుపడడం చూడలేని అసూయపరు లెవరో ఈపని చేసివుంటారు! ఘాటుగా చీవాట్లు పెట్టి ఇకముం దిలా స్కూల్లో జరిగితే, పోలీస్ రిపోర్టు ఇస్తానన్నాడు కోదండపాణిగారు ... మూర్తి, నాగభూషణములను పంపించి, మళ్ళీ నన్ను తన గదిలోకి పిలిపించారు కోదండపాణి.

"చూడు రావ్! మీ నాన్నగారూ, నేనూ బాల్యమిత్రులం ... ఆయనమీద నాకున్న గౌరవంకొద్దీ నీకు మెల్లిగా చెబుతున్నాను ... నిన్నుగురించి చాలా కథలు విన్నాను ... వయసులో వున్నపుడు మనిషి ప్రవర్తనే అతని మనుగడకు పట్టుకొమ్మవంటిది. చిన్నవాడివి ... అభివృద్ధిలోకి రావలసినవాడివి ... ఇలాటి వెధవపనులతో మీ నాన్నగారి పేరుకూడా చెడగొడ్తున్నావ్!"

లోలోపల విసుక్కున్నాను ...'ఉడుం కెందుకో వూళ్ళోవార్త!' అనుకుంటూ...

"మరొక్కమాట ... మీ ఆవిడ..." కాస్సేపు తటపటాయంచా డాయన.

"చెప్పండి" అన్నాను ... ఈ మొక్కుబడి అయిపోతే, ఆవల ఏంగేజిమెంటు వుంది ... కాత్యాయిని సినిమాహాలుదగ్గర నాకోసం కాచుకుని వుంటుంది.

"శారద కదూ?"

"అవును."

"ఫిఫ్తుఫారమ్‌వరకూ నా శిష్యురాలే! రూపం ఎలాటిదో, గుణమూ అంత స్వచ్ఛమైనది ... ఆ అమ్మాయిని నీ ప్రవర్తనతో హింసించడం మంచిదికాదు..."

మౌనం వహించాను...

"ఇకమీద టిలా ప్రవర్తించవని ఆశిస్తున్నాను ... వెళ్ళిరా!"

విసురుగా బయటికి వచ్చేశాను ...'నే నేం తనదగ్గర చదువుకునే ఒకటో క్లాసు పిల్లా ణ్ణనుకున్నాడుకాబోలు .. పిట్టకధలూ, నీతులూ చెప్పి, నచ్చచెప్పటానికి! మహా అయితే, ఉద్యోగం తీసేస్తాడు ... అంతేనా? కన్నవారూ, కట్టుకున్నదీ వూరుకోగా, మధ్యన ఈ కత్తిపీట కెందుకో?'

"ఏమిటోయ్ రావ్? సుభాషితా లేవో నూరిపోస్తున్నాడే మనబాస్!" మూర్తి అడిగాడు నవ్వుతూ! మూర్తిలో ఎంతో మార్పు వచ్చింది! ఎంత చలాకీగా వుంటున్నాడూ!

"వాడి మొహం'' ముసలి పీనుగ ...ఏదో వాగాడు ... ఈ చెవిలో విని, ఆ చెవితో వదిలేసొచ్చాను...'' హుషారుగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాం.

మూర్తి బ్రహ్మచారి ... బంగారుపిచ్చుక. కాలక్షేపంకోసం ఉద్యోగం చేస్తున్న పురుషుడు ... లక్ష్మీకటాక్షవీక్షణాలు ప్రసరించి కాబోలు, ఏకైకపుత్రు డయినా, సరస్వతి బి. ఇడీ. వరకూ అతనివెంట అష్టకష్టాలుపడి, వచ్చి, ఇక పడలేక జారుకుంది. ఇక స్కూలు లేబొరేటరీలో మా ఆట కట్టయింది.

మూర్తి ప్రత్యేకంగా చిన్న ఇల్లొకటి తీసుకునివున్నాడు. క్షణాలమీద తోక కూజాలూ, స్పిరిట్‌లాంప్‌లూ, పరీక్షనాళికలూ, స్పిరిట్‌సీసాలూవగైరా సామాగ్రి అంతా తెప్పించేశాడు. నిరాటంకంగా మా కార్యక్రమాలు సాగుతున్నాయి!

ఈమధ్య అమ్మ చాలా మారిపోయింది. ఇంతకుముందులా అడిగినంతా డబ్బు ఇవ్వటంలేదు సరికదా ... నా జీతం డబ్బులే తనూ తీసికొంటోంది! అదేమంటే 'ఇంటిఖర్చుల క్కావాలి...' అంటూ దబాయిస్తుంది. ఎలా అయినా, అమ్మ చల్లనిచూపు నామీ దుంటేనే నా కార్యక్రమాలు అకుంఠితంగా సాగిపోతాయి ... లేకుంటే కాస్తబెడదే! నోరు నొక్కుకున్నాను ...

మూర్తి ఇంట్లో పోగయిన నాకూ నాగభూషణానికీ, మూర్తి మాటలతో విందు చేస్తున్నాడు ...

హఠాత్తుగా మూర్తి అన్నాడు. "గిట్టనివా శ్ళెవరో, మా నాన్న కీ భోగట్టా చేరేశార్రా! ఆయన డబ్బు పంపడంలేదు సరికదా, "నీ జీతంతో నువొక్కడివే ఇమడలేకపోతే, రాబోయేభార్యా నెలా పోషిస్తావ్?" అంటూ ఉత్తరాలు వ్రాస్తున్నాడు. ఈ ముసలివాళ్ళ కిం కేం పనీపాటల్లేవు.. వీళ్ళ కేం తెలుసు జీవితా న్ననుభవించడ మంటే ఏమిటో..."

"ఏమోబాబూ! నాకూ అదే సమస్యయిపోయింది ... ఎంత మిత్రుడి వయినా, స్పిరిట్ అయినా, ఉడతా సాయంగా సమకూర్చాలిగదా నేను..." అన్నాను నిస్పృహగా!

నాగభూషణం పెద్దగా నవ్వాడు. "పెళ్ళిచేసుకోరా మూర్తీ!" అన్నాడు పెద్ద తాత్వికునిలా పోజుపెట్టి.

"ఏడ్చినట్లుంది నీ దోడిసలహా! పెళ్ళి చేసుకుంటే ఖర్చుపెరుగుతుంది గానీ..." మూర్తి అన్నాడో లేదో నాగభూషణం అందుకున్నాడు.

అక్కడే వుంది కిటుకు ... భార్యంటే ఏమిటోయ్? భరించేది భార్య! అవునా? నేను చూడు తాళికట్టాను ... ఆరునెలలవరకూ అత్తారింటిగడప తొక్కలేదు 'అలక' సాకుతో. మామగారు గిరగిరతిరుగుతూ, ఉత్తరాలవర్షం కురిపించాడు ... అప్పట్లో వున్నాననీ, వెయ్యిరూపాయలు సర్దుబాటు చెయ్యగలితే అమ్మో

యిని పిల్చుకెళ్తాననీ వ్రాశాను ... రామబాణంలా పనిచేసింది - వెయ్యి రూపాయలూ, భార్యా తిరుగుటపాలో వచ్చేశారు! మరోసారి, మళ్ళీ ఆవిణ్ణి పుట్టింటికి పంపించేశాను ... మళ్ళీ ఐదువందలు ... కాలక్రమేణా, ఆవిడ ఇక్కడున్నా, డబ్బువస్తుంది ... 'ముదితల్ నేర్వగరాని విద్య గలదే?' అన్నా డెవరో కవి... ముద్దార నేర్పించకపోయినా సామ దాన భేద దండోపాయాలలో చివరిదానికయినా లొంగుతారు భార్యలు ... ఇప్పుడు మనకు డబ్బెప్పు డవసర మయితే అప్పుడు, అదే వ్రాసి తెప్పిస్తుంటుంది. అందుకే ... కన్నతండ్రులూ! తెలివితేట లుండాలోయ్!"

నాగభూషణం తన గంభీరోపన్యాసం ముగించాడు నిజంగా జీవితాన్ని, అందులోనూ జల్సా జీవితాన్ని కాచి, వడపోసి, సిద్ధాంతీకరించి అనుభవిస్తున్నవాడు నాగభూషణం! మధ్గురుతుల్యుడు కూడా!

"గురూ! ఆత్మజ్ఞానం ప్రసాదించావు... మనోనేత్రాల కడ్డుపడిన తెర తొలగించావు... ఇక చూడు... నెలరోజుల్లో బుద్ధిమంతుడిగా మారి, "భార్య"ను..కాదు కాదు, డబ్బును తెచ్చుకుంటాను!" మూర్తి అన్నాడు.

ఆ మాటలే కాదుగానీ, కాస్త భేదంగా, అవేమాటలు నేనూ అనుకున్నాను లోలోపల? సాయంత్రమే శారదకు ఉత్తరం వ్రాశాను... చతుర్విధోపాయాల్లో ముందస్తుగా, మొదటిదే అవలంబించి చూద్దాం... విషమిస్తే చివరి దెటూ వుండనే వుందె!

"డియర్ దేవీ!,

ఏం, దీనుణ్ణి మర్చిపోయినట్లున్నావ్ కదూ? తమరు ప్రసవించే దెప్పుడో, బుల్లి పాపాయిని ఎత్తుకుని, నా కన్నులవిందు చేసే దెప్పుడో! విరహవేదనతో తపించిపోతున్నానంటే నమ్మ. నువ్వున్నపుడు తెలియలేదుగానీ, ఇప్పుడుమాత్రం, ఇంట్లో ఎక్కడచూచినా, ప్రతి వస్తువులో, నువ్వే ప్రతిబింబిస్తున్నావ్ సుమా!

నీ ఉత్తరాలకు జవా బివ్వలేదని కోపమా? ఏంచెయ్యను? ఒకవ్యవహారంలో తల దూర్చి, రోకటిపోట్లతో, అహోరాత్రాలూ ఆవేదన పడ్తున్నాను ... ప్రాణస్నేహితుడి చెల్లెలిపెళ్ళికి వెళ్ళాను ... పీటలమీది పెళ్ళి ఆగిపోయింది ... డబ్బు పేచీలతో! నా స్నేహితుడి చెల్లాయి ఘోష ఏం చెప్పను? వా డొచ్చి నా కాళ్ళకు చుట్టుకున్నాడు... 'శీనూ! ఈ ఆప దెలాగో గట్టెక్కించు. చచ్చి నీ కడుపున పుడతా!' అంటూ ఏడవటం మొదలెట్టాడు. వెయ్యి రూపాయల కొకచోట నోటు వ్రాసిచ్చి, నెల రోజుల్లో తీర్చేశేలా, రహస్యంగా, వప్పుదల చేసుకుని డబ్బు సర్దుబాటు

చేశేశాను... పెళ్ళి సుఖాంతం అయ్యింది... అదే నాకూ ప్రాణాంతకమయ్యిందిప్పుడు... అప్పు ఇచ్చిన పెద్దమనిషి వత్తిడి చేస్తున్నాడు నన్ను. నాన్నగారికి తెలియజేస్తానంటూ బెదిరిస్తున్నాడు. చాటుగా అమ్మ నడిగితే 'నాదగ్గరలేదు... ఎవర్నడిగి చేశావ్? నువ్వే తీర్చుకో.' అంది మండిపడ్తూ. నా స్నేహితుడు వెధవేమో, అక్కర గడుపుకుని కంటి క్కనిపించటం లేదు...

దేవీ! ఈ లోకంలో మంచితనమంత చెడ్డది మరొకటి లే దీనాడు! పరోపకారమంతటి పాపమూ మరోటి లేదు. పాపభీతికి పోయి అప్పు తేవట మేమిటి, ఇచ్చిన వాడూ, పుచ్చుకున్నవాడూ బాగుండగా, మధ్య నా పీకెలమీదికి రావట మేమిటి? ఖర్మపరిపాకంగాక మరేమిటి? నిజంగా మతి పోతోందంటే నమ్ము.

నీకు వ్రాస్తే, (మీ నాన్నగారూ ఏమంత వెనుకాదేవారు కాదనీ నాకు తెలుసు) డబ్బు పంపిస్తావ్...కానీ ఏమని వ్రాయను...ఎంతచెడ్డా...ఆడదాని సొమ్ముమీద ఆధారపడటం ... ఏమిటోలే ... నా బాధతో నిన్ను వేధించుట మెందుకు ?

నీ ఆరోగ్యం జాగ్రత్త సుమా! త్వరగా రావాలి...

నీ

శీను"

ఉత్తరం మరోమారు చదువుకుని నవ్వుకున్నాను ... అంత చక్కగా వ్రాయ గలిగినందుకు నన్ను నేనే అభినందించుకున్నాను. పోస్టు చేశాను.

నాలుగు రోజుల్లో వూహించిన విధంగానే, చెక్కు వచ్చింది శారద వుత్తరంతో బాటు. ఉప్పొంగిపోయా తనకూ త్వరలోనే రావాలనుందనీ, చలిగాలిలో తిరగొద్దనీ, ఆరోగ్యం పాడుచేసుకోవద్దనీ, ఏమేమో వ్రాసింది. 'త్వరగా రావాలి' అంటే తన ననుకుంది కాబోలు, వెర్రిమాలోకం! డబ్బు...డబ్బు త్వరగా రావాలి! నవ్వు కుంటూ బ్యాంకికేసి నడిచాను...

శారద ప్రసవించింది ... బాలసారెకు సకుటుంబంగా వెళ్ళాము ... శారదతో చెప్పాను ... నా ఒంట్లో బావుంటం లేదనీ, దగ్గు తరచూ వస్తోందనీ, అది డాక్టర్లు "క్షయ" సంబంధమైం దంటున్నారనీను...

శారద కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"అంతేకాదు శారదా! అసలు బాధేమిటో తెలుసా ? మనిద్దరం కొన్ని నెలలు, దూరంగా వుండాలని డాక్టర్లు సలహా ఇచ్చారు...అమ్మా, నాన్నా నాసంగతి పట్టించుకోటంలే దెందుకో ... సరైన వైద్యం లేదు ... పోనీ నిన్నయినా పిల్చికెదాళ మంటే, ఇదో బెడద!" అన్నాను, ఆ లేని బాధకు అభినయం పట్టి.

శారద మరింత వాపోయింది. "పోనీండి ... మీ ఆరోగ్యంకంటేనా ? నే నిక్కడే వుంటాలెండి పాపకు ఏడోనెల వచ్చేవరకూ ... డబ్బుకు వెనుదీయవద్దు... ఎంత కావాలన్నా పంపిస్తాను ... మంచిమందులు తీసుకుంటారుకదూ ?" అంది దుఃఖా న్నాపుకోటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ।

"డబ్బంటే మందు పుచ్చుకోకుండా వుంటానా ?'' సముదాయించి. వచ్చేశాను... అమ్మ నాన్నలకిదేం తెలియదు.

నాలుగు నెలలు సరదాగా గడిచిపోయాయి. శారద అప్పుడప్పుడూ పంపిస్తున్న డబ్బుతో !

హఠాత్తుగా శారద పాపతో ఊడిపడింది: శారదకు ఎవరో భోగట్టా చేర వేశారుట.

''మీ రెలా అయినా తిరగండి ... నే నభ్యంతరం చెప్పను ... కొండల మీది నుంచి శరవేగంతో ప్రవహిస్తున్న జలపాతాన్ని చేతులతో అడ్డుపెట్టాలనుకొనేం తటి మూర్ఖురాలని కాదు ... కానీ నా దో చిన్నకోరిక ... త్రాగుడు మాత్రం వద్దు ... అది ఎంత ఆనందాన్నిస్తుందని మీరు భ్రమిస్తున్నారో, అంతటి అనా రోగ్యాన్ని ప్రసాదిస్తుంది..."

''చాల్లే, నీతులు చెప్పొచ్చావ్ ." నోరు మూయించేశాను. పాప హైమ బాగా నవ్వుతూ, బంతిలా వుంది అందంగా !

నాన్నగారూ చీవాట్లు వేశా రొకసారి.

"భ్రష్టుడా ! చెబితే మీ అమ్మ విన్నదికాదు ... బంగారం వంటి, పిల్ల శారద గొంతుకూడా కోశాం ! పెళ్ళయితే గుణం కుదురుతుం దనుకున్నాం ... త్రాగుడు కూడా పట్టుబడిందా ?"

త్రాగిన మైకంలో తూలుతూ, శాస్త్రిగారి వాకిట్లో పడిపోయానుట ...

మరోసారి స్కూల్లో విద్యార్థి నొకణ్ణి ఆ మత్తులోనే చితక్కొట్టాను ... తత్ఫలి తంగా చిన్న పోలీస్‌కేసూ, పాతిక రూపాయల జరిమానా మేజిస్ట్రేటు కోర్టులో చెల్లించాల్సివచ్చింది

నాన్నగారు నే కంటికి కనిపించినప్పుడల్లా తిడుతున్నారు. విని విని అమ్మ తారా జువ్వలా లేచింది.

"వా ణ్ణెందు కలా అస్తమానూ తిడతారు ? మీరు తిడతారనే వాడు భోజనాని క్కూడా సరిగా రావటంలేదు ..."

నాన్నగారు కేకలేస్తున్నారు ... ''నీ తల్లిప్రేమ తగలడా ! నీ కొడుకు



చేస్తున్న ఘనకార్యాలను అదుపులో పెట్టాలనే జ్ఞానమయినా నీకు లేదుటే? పైగా వాణ్ణి వెనకేసుకొస్తున్నావా? ఆ పిల్లను చూడు: ఒక్కసారి కోడలు కళ్ళల్లో ఆ నీళ్ళుచూడు ... దానిలాటి ఆడపిల్లలు మనకూ వున్నారు ... నీ ఆడపిల్ల ఇలా ఏడుస్తుంటే చూస్తావా? చూస్తూ భరిస్తావా?" నాన్నగారు ఆవేశపడిపోతున్నారు... అమ్మ కోపం కౌశలిమీదికి మళ్ళింది.

"అదే చెబుతూంట! ఆడదానిలో లోపం లేకుంటే, మగా డెందుకు తిరుగుబోతవుతాడూ? ఇదే బహుశా వాణ్ణి, ఏదో విధంగా బాధపెడ్తోందేమో!"

"ఛీ ... రాక్షసీ ... ఆ కొడుక్కు తగిన తల్లివి ..." నాన్నగారు ఛీత్కారం చేస్తూ వెళ్ళిపోయారు ... బహుశా కళ్ళుమూసుకు భగవన్నామం చేస్తున్నారేమో! అన్ని జటిలసమస్యలకూ పరిష్కారమార్గం భగవన్నామోచ్చారణ ఒక్కటే నంటూ ఆయన తన మిత్రబృందంతో చెబుతుంటా రెప్పుడూ!

శారదతో, డబ్బు కావాలని, వాళ్ళ నాన్నగారికి వ్రాయమని ఎన్నిసార్లు తిన్నగా చెప్పినా, ఈ మధ్య వినిపించుకోవటంలేదు.

"ప్రతిసారీ ఏమవసరమని వ్రాయను? ఎంత ఇచ్చేవాళ్ళయితేనుటుకు, ఈ అవసరాలకు అంతులేదా?" అంది తల బిరుసుతనంతో!

నాలో పౌరుషం పెల్లుబికింది! భార్య, అందులోనూ తాళికట్టిన భార్య, చెప్పిన ట్లుండవలసిన భార్య. భర్త కెదురు చెప్పటమే?

దండోపాయం తప్పదు ... నా శక్తికొద్దీ కొట్టాను. శారద గట్టిగా అరవలేదు. ఏడ్చి గోల చెయ్యలేదు ... కానీ దెబ్బల చప్పుడుకు నాన్నగారు, అమ్మ, చెల్లా పరుగెత్తుకు వచ్చారు. నాన్న కళ్ళు అగ్నిని కురిపిస్తున్నాయి ... విసురుగా బయటికి వెళ్ళిపోయాను ... "అపరంజిని తెచ్చి, బొగ్గుపక్కన పెట్టామే!" నాన్నగారు అస్పష్టంగా గొణగటం మాత్రం వినిపించింది.

చెల్లాయిఇందిరకు సంబంధం కుదిరింది. వరుడు ఆనంద్ - అందంగా, మా ఇందిరకు తగినట్లే వున్నాడు ... గుంటూరు జిల్లాలో, ఒక చిన్న తాలూకాలో, హెల్త్ ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్నాడు ... వివాహమయిన నెలరోజుల్లోనే, ఇందిరా ఆనంద్‌లు వెళ్ళిపోయారు.

ఈ ఇందిర దో బెడదగా వుండేది ... అప్పుడప్పుడూ, నాన్నగారికి తోడుగా ఇదికూడా "అన్నయ్యా! వదిన్నలా వేధిస్తావెందు కన్నయ్యా? నీకు సాయం అమ్మ కూడా కలిసింది ... ఒకటిమాత్రం నిజమన్నయ్యా! వెయ్యి జన్మ లెత్తినా, నీలాటి వాడికి శారదవదినలాటి మంచి ఆడది భార్యగారాదు! అది నీకు తెలుస్తుంటేకదూ," అనేది ...

"ఇందిరా! నోర్ముయ్! చిన్నదానివి... నీ కీ పెద్దమాట లేమిటి?" నా గర్జనలతో ఇందిర నోరు నొక్కేవాణ్ణి! ఇందిర కాపురాని కెళ్ళిపోయింది ... పోనీ పీడ వదిలిపోయింది.

స్త్రీల స్వభావం అతి విచిత్రమైనది. ఒక్కోసారి మంచిగానే, ఎంత కష్టతరమైన పనులయినా చేస్తారు ... కానీ మొండికెత్తితే, చంపినా, ఏ పనీ చెయ్యరు. శార దలాగే తయారయిం దిప్పుడు చావుదుబ్బలు తింటోందేగానీ, డబ్బు రావటం లేదు ... వ్రాయటంలేదు! ఆలోచించగా, ఆలోచించగా, మెరుపులాటి ఆలోచనొకటి కలిగింది! ఆడదానికి అవమానమంటే ఎక్కువ భయమంటారు ... దగ్గరగా పిల్చాను ... వచ్చి నిల్చుంది బెదరుతూ.

"డబ్బు కావాలి శారదా!' అన్నాను ...

"నే వ్రాయను ..." ఖండితంగా చెప్పేసింది శారద ...

"వ్రాయవూ?" చటుక్కున శారద నిడుపాటి జడ కత్తెరతో కత్తిరించేశాను...

బేజారెత్తిపోయింది శారద ...

"...ఇలాగే ముఖమంతా వికృతం చేసేస్తాను ... ఇప్పుడు చెప్పు ... ఉత్తరం వ్రాస్తావా? వ్రాయవా?" నవ్వుతూ అడిగాను ...

"ఎంత కావాలి?" తల ఒంచుకుని అడిగింది శారద ... నేలమీద టప టప కన్నీటిబొట్లు రాలుతున్నాయి.

పెద్దగా నవ్వాను ... "డియర్ దేవీ! అలా అన్నావ్ బాగుంది! నా మాట ముందే వినుంటే? ఈ జడ చక్కగా నీకే వుండేది కాదూ? 'రేడియో కావాలని మీ అల్లుడుగారు పట్టుబట్టారు ... ఐదువందలు కావాలి ... లేకుంటే నన్ను శాశ్వతంగా అక్కడికి పంపించేస్తారట ...' ఇదీ భాష ... ఇక వ్రాయి..."

నాముందే తు. చ. తప్పకుండా వ్రాసింది శారద.

వారంరోజుల తర్వాత, డబ్బుకు బదులు, మామగారు దిగారు, రేడియో చంకన బెట్టుకుని! ఒళ్ళు మండిపోయింది ... పైగా మరో బెడద శారద జడ! చూడగానే ఆయ నేం గొడవ చేస్తాడో ... వెధవపీడ ...

నిన్న సాయంత్రం పెరట్లో అమ్మా, పక్కింటావిడా సంభాషణ విన్నాను...

"మీ కోడలు శారదకంత పొడుగాటి జడ వుండేది ... హఠాత్తుగా మెడల పరకూ జుట్టు వుందేమిటి సుభద్రమ్మా?" అంటోం దావిడ...

"ఏమిటోనమ్మా ఈ కాలపు కుర్రాళ్ళ అభిరుచులు! బర్రెతోకలా అంత పెద్ద జడేం బావుందీ? చక్కగా నాజూగ్గా చిన్న జడే బావుంటుందని మా శీను కత్తిరించేశాడట!" అమ్మ నవ్వులో జీవితం లేదు. అమ్మ బుర్ర ఇన్సూర్ చెయ్యొచ్చు.

"ఎంత నాజూకయితే మాత్రం వున్న జడలు కత్తిరించుకుంటారుటమ్మా? నీది మరీ విడ్డూరంగానీ! కాకున్నా సుభద్రమ్మా! అంతలా బరితెగించిన కుర్రాణ్ణి నువ్వు వెనకేసుకురావటమూ, ఆ అమాయకరాలి నలా చిత్రహింస పెట్టించడమూ నీకు భావ్యం కాదమ్మా!"

"మా ఇంటి వూసు మీ కెందుకు?" అమ్మ చిరచిర లాడుతూ లోపలికొచ్చింది. ఆ వేడిలోనే నేనూ కవ్వించటంతో మరింత రెచ్చిపోయిం దమ్మ.

"నువ్వు చేసినపనికి నలుగురూ నన్ను దుమ్మెత్తిపోస్తున్నారు ... భార్యను దండించుకోవచ్చు ... కానీ ఇలా అందరికీ తెలిసేలానా? కొత్త చాటూ మాటూ, తెలివీ తేటా అక్కర్లా?" విన్పించుకోకుండా వెళ్ళిపోయాను.

ఎలాగో శారద, మామగారున్న మూడురోజులూ జ్వరమనే సాకుతో మంచం మీదినుంచి లేవలేదు! ఈ వుపాయం నా కెంతో నచ్చింది ...

"శారదా! నువ్వెంత మంచిదానివి?" అన్నాను మామగారు వెళ్ళిపోగానే ... శారద క్షణకాలం నా వేపు నిశితంగా చూచి, కళ్లు వాల్చుకుంది ...

'హుఁ, త్రాగుబోతు మాటలు!' అనే భావం తొంగిచూస్తోం దా కళ్ళలో.

మూర్తి వివాహం చేసుకున్నాడు నాగభూషణం సలహామేరకు! కానీ వాళ్ళ మామగారు మూర్తికంటే మరో నాలుగు బళ్ళు ఎక్కువ చదివాడు! అల్లుడుచేత ఉద్యోగం మాన్పించి, తగిన కట్టుదిట్టాల్లో తన దగ్గరే పెట్టుకున్నాడు. 'పిచ్చి వేషాలేస్తే నా పిల్లమొగుడు చచ్చాడనుకుని, జైల్లో పెట్టిస్తాను!' అన్నాడుట ఆ ఆడపిల్ల తండ్రి. నాగభూషణమూ ట్రాన్స్ఫర్ అయిపోయాడు ... ఇక మిగిలిన నాకు, 'పానీయం' తయారు చేసుకోవటానికి ప్రదేశమూ, పరికరాలూ కూడా కరువయ్యాయి. కనీసం పరికరాలయినా కొందామంటే డబ్బులేదు ...

పాపకు మూడో సంవత్సరం దాటుతోంది ... మళ్ళీ శారదకు గర్భం మా కొందరు కొత్త ఆడపిల్లలతో పరిచయమయ్యింది ... మేరీ, నీరజ! పురిటికి వెళ్తుం దనగా, ముందుగా శారదను మళ్ళీ డబ్బుకోసం వ్రాయమని చెప్పాను ... మొరాయించింది ... అక్కడక్కడా శరీరమంతా సిగరెట్టుతో కాల్చాను...లాభం లేకపోయింది ... నిద్రపోతూండంగా, తలంతా వికృతంగా కత్తిరించాను .. హడలిపోతూ లేచి కూర్చుంద ...

"ఒకమారు ఫలితం చూచీ ఎందుకిలా మొరాయిస్తావు?" అన్నాను ...

* * * *

సరిగ్గా మనియార్డరు మీద సంతకం చేసి తిరిగేసరికి అమ్మ నిల్చునివుండ గతుక్కుమన్నాను! పోయినసారీ ఇల్లాగే అమ్మ తీసుకుం దా డబ్బు!

"శీనూ! ఇలా ఇవ్వు ... కళ్యాణికి నెక్లెస్ చేయించాలి ..." అంట ఇవ్వక తప్పలేదు. అమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

శారద ఏదో పనిమీద అటుగా వచ్చింది ... తలమీద పైటచెరుగు ముసుగులా వేసుకునివుంది ...

ఎంతో జాలివేసింది. ఎవరితోనో, సమాధానంగా చెబుతోంది శారద విన్నా: "తిరుపతి వెంకటేశ్వరుడికి తలనీలాల మొక్కుబడి వుందండీ! ఈ లోపల తలంతా గడ్డల్లేచాయి. అందువల్ల ఇలా కత్తిరించుకున్నాను ... ఆ జుట్టు అక్కడ పెట్టి, ఒక్కమారే, స్వామికి మొక్కు చెల్లించుకుంటాను!" అంటూ!

సమయస్ఫూర్తికి జాలికూడా కలిగింది

పాపం! శారదను ఎంతగానో హింసించి తెప్పించిన డబ్బు. దేగలా అమ్మ తన్నుకుపోతోంది! ఇక అమ్మ ఓసారి చూచింతర్వాత ఇక నాకు దక్కడం దుర్లభమే! ఏదిదారి? ఆలోచించి ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చాను. వేరు

వారిని మంచిమార్గాన నడిపించటానికి ప్రయత్నించాలి... ఏదీ తెలియక గోతిలో పడిన పాటి ఆడపిల్లను... మరోతల్లి నవమాసాలూ మోసి, కని, పెంచిన పిల్లని, మనము హింసించటమూ, హింసిస్తుంటే చూస్తూ హర్షించటమూ, న్యాయము అంటావా?" మామగారు అమ్మకు పరోక్షంగా హితబోధ చేశారు.

అమ్మ ఆటంబాంబులా పేలిపోయింది.

"ఇంతకూ తప్పు నాదంటారు? బావుంది. ఏదో సామెత చెప్పినట్లు అల్లుడు మంచివాడు, కూతురు మంచిది, మధ్య నేను రాక్షసిని! ఎందుకుబాబూ నాకీ నిందలు? నాయనా శీనూ! ఇక ఒక్కక్షణంకూడా మీరు నా దగ్గ రుండటానికి వీల్లేదు... కడుపు చించుకుంటే కాళ్ళమీద పడ్తుందని నోరు నొక్కుకున్నా, నలుగురి నోట్లో నేను పడాల్సివచ్చింది...!" అమ్మ వాక్ప్రవాహానికి అంతమే లేకపోయింది.

సాయంత్రమే నేను, శారద, పాప, బాబు. మామగారిని వెంటబెట్టుకుని కొత్త ఇంట్లో ప్రవేశించాము.

మామగారు రెండురోజు లుండి, ప్రయాణ మయ్యారు. వెళ్ళేముందు నన్ను విశితంగా చూస్తూ అన్నారు.

"నాయనా! ఏ మనుకోకుండావుంటే ఒక్కటి చెబుతాను వింటావా?"

"చెప్పండి... ఉపోద్ఘాత మెందుకూ?" చిరాకుపడ్డాను; ఈ ముసలివాళ్ళందరూ ఇంతేనేమో!

"ఆడపిల్లను, దాని అత్తమామలు, ఇతర బంధువులూ బాధిస్తుంటే, వారినుంచి వేరు చెయ్యటంలో తప్పు లేదు. ఆపిల్ల తల్లిదండ్రులూ, భర్తా... కానీ కంచే చేను మేస్తే..." ఆయన కంఠస్వరం రుద్ధ మయింది.

"సంస్కృతం వదిలి తెలుగులో చెప్పండి చెప్పదల్చుకున్న దేదో..." అరిచాను కోపం పట్టలేక.

"ఏముంది నాయనా! భరించి, రక్షించవలసిన భర్తవు నువ్వు... నా తల్లి నేం చేస్తావో? ఎలా చూచుకుంటావో... నీ నుంచి వేరుచెయ్యలేముగదా..." శారద తల నిమురుతున్న ఆయన కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి.

"అంటే మీ రొక్కరే ఆడపిల్లలను కని పెంచారన్నమాట! నా దగ్గిరా వుంచటము ఇష్టంలేకుంటే, పిల్చికెళ్ళండి...'' అన్నాను రెచ్చిపోతూ!

"నాన్నా! ఏమిటిది? ఇలాఅయినా నన్ను బ్రతకనివ్వరా? మా సంసారాన్ని మే మెలాగో దిద్దుకుంటాం... మీరు వెళ్ళిరండి..." శారద చివరిమాట లంటూ దుఃఖం ఆపుకోలేక లోపలికి పరుగెత్తింది.

మామగారు దిగ్భ్రాంతి చెందారు క్షణకాలం... వెళ్ళొస్తా నాయనా! శారదా!

వెళ్ళొస్తా తల్లీ! జాగ్రత్త!" అంటూ వెళ్ళిపోయా రాయన, మెడలవరకూ అప్పు డప్పుడే దిగివస్తున్న శారద జుట్టును విశితంగా చూస్తూ.

శారద మా బాగా చెప్పింది... సంతోషంతో శారద దగ్గరకు వెళ్ళాను...

"మా బాగా చెప్పావ్ మీ నాన్నకు... ఇక హాయిగా వుందాం... ఏడవకు!"

కానీ శారద దుఃఖ మెందుకో ఆగలేదు... పొగిలి పొగిలి ఏడుస్తోంది.

* * * *

బాబుకు రెండో సంవత్సరం నిండిందో లేదో, మళ్ళీ శారద కడుపుతో వుంది. బాబోయ్! ఈ భార్య లింతే! తాకితే కడుపు! అందుకే స్పృశించటానికూడా అన ర్హులు వీళ్ళు!

ఎన్నోమార్లు శారద డబ్బు తెప్పించటానికి మొండికెత్తి దెబ్బలు తిన్నది... మెల్లిగా వంటిమీది నగలన్నీ, ఒక్కొక్కటిగా ఇస్తోంది... అదీ కొంతమేలే! శారద మామిడిపిందెల నెక్లెప్ కాత్యాయని మెడ నలంకరించింది; రాళ్ళగాజులు మేరీ ముచ్చటపడింది; 'భారత్ చైన్' నీరజ 'నాజూగ్గా వుంది సెలెక్షన్' అంది మురిసిపోతూ; ఒకపేట గొలుసు స్పిరిట్ బాటిల్స్కై ఖర్చయిపోయింది...

ఇందిర, తన కొడుకు (నా మేనల్లుడు) రెండేళ్ళవాణ్ణి ఎత్తుకుని వచ్చింది పండుగకు. ఆనంద్ రాలేదు... సాయంత్రం మా ఇంటికి వచ్చింది పిల్లాణ్ణెత్తుకుని. గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. తెల్లగా, బొద్దుగా, పొట్టిగా అందగా వుండే ఇందిర— నల్లగా, పీడగా, జీవకళ లేనట్లుగా మారిపోయింది.

"ఏమిటి ఇందిరా! ఇంత తగ్గిపోయా వేమిటే?" అన్నాను వాత్సల్యంగా! నవ్వి వూరుకుంది... ఆ నవ్వులో ఏదో వెలితి వుంది.

"మా ఆనంద్ అన్నయ్య కొరుక్కుతింటున్నాడేమో!'' అంది శారద నవ్వుతూ!

మళ్ళీ నవ్వే సమాధానంగా వచ్చింది.

"మాటలు మాన్పించి నవ్వటం మాత్రం నేర్పా రేమిటే మీఆయన?" అన్నాను మళ్ళీ.

"పో, అనయ్యా! నీ దో గోల. అన్నయ్యా! కోపం రాకుండావుంటే నీకొక్క మాట చెప్పనా?" అంది.

ఇంతసేపటికి నోరు విప్పింది. "ఊఁ! ఒకటేమిటి? నూరు చెప్పు," అన్నాను.

"అన్నయ్యా! నీ జీవితంలో నువ్వు చేసిన మంచిపని ఏదేనా వుందీ అంటే ఇదొక్కటే ..."

అర్థంగానట్లు చూశాను.

"అమ్మ నిరంకుశత్వాన్నుంచి వదిన్ని మెల్లిగా తప్పించావ్ ... కానీ నీప్రవర్తనలో ఇంకా మార్పు రాలేదని ..."

అసరికే నాలో సహనం నశించింది.

"...వూళ్ళో వెధవ అంటున్నారు ... అవునా? లోకులు పలుగాకులు అన్నారు పెద్దలు..."

పాప, బాబు పరుగెత్తుకువచ్చారు ... తన కొడుకును శారదచేతి కిచ్చి, ఇద్దర్నీ వగ్గర కూర్చోబెట్టుకుంది ఇందిర ... బాబు కిప్పుడిప్పుడే మాటల తిరుగుడు వస్తోంది. పాప బాగా మాట్లాడ్తోంది ...

"అమ్మ నెప్పుడు కొడుతుంటా రత్తయ్యా నాన్న...మానాన్న మంచివారేకాదు."

పాప, నే లేననుకుంది కాబోలు చెబుతోంది ...

"అవునత్తయ్యా!" బాబు తల ఊగిస్తున్నాడు.

"ఏయ్ పాపా! ఒరేయ్ బాబూ! ఏమి టా మాటలు?" నా గొంతు గర్జన విని పిల్లలిద్దరూ హడలిపోయారు ... లోపలికి పరుగెత్తారు.

ఇందిర నావేపు తీక్షణంగా చూస్తోంది ... "పిల్లపకులు ... పెద్దమాటలు!" విసుక్కుంటూ నవ్వటానికి ప్రయత్నించాను...

"కాదన్నయ్యా! పెద్దలకు లేని జ్ఞానాన్ని ప్రసాదించే, దేవుళ్ళు పసిపాపలు!"

''మీరు మాట్లాడ్తుండండి ... అలా వెళ్ళొస్తాను'' లేచి బయటికి వచ్చేశాను.

ఎనిమిదోరోజులైంది ఇందిర వచ్చి ... అమ్మ దాన్ని లేడీడాక్టరుచేత పరీక్ష చేయించిందట. క్షయ వచ్చే సూచనలు కన్పిస్తున్నాయనీ, మంచి మందులు వాడాలనీ చెప్పిందట!

"ఒదినా! నీ ఉసురు తిన్నగా పోతుందంటావా? నే నేమైపోయినా ఫర్వాలేదు... బహుశా నా మృత్యువుతోనైనా, మా అమ్మ, అన్నయ్యల కళ్ళు మైకం వదులుతుందేమో!"

నే నింట్లో అడుగెట్టేసరికి ఇందిర వంటింట్లో కూర్చుని అంటోంది శారదతో.

"ఛ, అవేం మాటలమ్మా!" శారద మందలిస్తోంది.

''నీకు తెలీ దొదినా! క్షయ రాబోతోందంటే, అమ్మావా ళ్ళెంత బాధపడ్తున్నారో. నాకంత సంతోషంగావుంది ... సంతోషం కరువైనబ్రతుకంటే, చావే మంచిది... ఇందిర కంఠం దుఃఖంతో కాబోలు ఆర్ద్రమయింది ... ఇందిరను చూచిన మరు క్షణమే గ్రహించాను... అదేదో మానసిక క్షోభకు గురిఅయ్యిందని. కానీ ఇందిర చాలా లోతుమనిషి. తన బాధ ఎవరికీ తెలియనివ్వదు; చెప్పుకోదు అడిగినా! చివ

రకు అమ్మతోకూడా చెప్పదు ... చనువుగా శారదతో చెబుతోందంటే, శారదమీద ప్రత్యేకమైన అభిమానం దానికి మొదట్నుంచీ ! కుతూహలంగా వింటున్నాను. దాని బాధేమిటో తెలుసుకోవాలని మనసు తహతహ లాడుతోంది.

"ఏమి టా మాటలు ఇందూ ? నాకు తెలీ కడుగుతానూ ? అనందుకూడా మీ అన్నయ్యగారిలా దుర్వ్యసనా లేవైనా...?'' శారద అడుగుతోంది లాలనగా, సన్నగా దుఃఖిస్తున్న సవ్వడి అయ్యింది.

"లే దొదినా ! అలాటి వ్యసనా లేమీ లేవు ... కానీ ... " ఎందుకో తొంగి చూచిన ఇందిర నన్ను చూచి కలవరపడి చెప్పదల్చుకున్నది చెప్పకుండా ఆపేసింది. ఆ తర్వాత అది వున్న నెలరోజుల్లోనూ, దాని అంతఃకరణక్షోభ క్కారణ మేమిటో ఎంత ప్రయత్నించినా తెలియలేదు. ఆనంద్ వచ్చి, ఇందిరనూ, పిల్లవాణ్ణీ పిల్చి కెళ్ళిపోయాడు ...

* * *

నా ఇంట్లోనే పానీయానికి తగిన సామగ్రి ఏర్పరచుకోవా లనుకున్నాను ... పరి కరాలు కొనటానికి డబ్బు కావాలి. కొత్త సంసారం కావటంవల్ల, వచ్చిన జీతం ఇంటి సామాన్లకే సరిపోతూంది... పైన మిగిలిం దేదేనా వుంటే సినిమాలు మింగే స్తున్నాయి ... ఇక అలవాటయిన త్రాగుడు అరికట్టే దెలా ? ఆ పరికరా లన్నిటికీ దాదాపు మూడువందల రూపాయిలేనా కావాలి ... నన్ను తెలిసినంతవరకూ, ఒక పరగణావరకూ, అప్పు లెవ్వరూ ఇవ్వరు ... శారద నగలు చెల్లిపోయాయి.

శారద నడిగాను.

తారాజువ్వలా లేచింది ...

"ఎన్నా ళ్ళీ బాధ? ఎన్నిమార్లు నాన్నకూ, అమ్మకూ వ్రాసి డబ్బు తెప్పించను? నా పెళ్ళయి ఇన్నేళ్ళయింది, నా కోసం, నా సుఖం కోసం దాదాపు పది వేల రూపాయల వరకూ వెచ్చించారు, పంపమన్నపుడల్లా ! వాళ్ళకూ నే నొక్క త్తెనే కాదు ... చెల్లాయుంది. దానికీ పెళ్ళీ పేరంటమూ అక్కర్లా ? నా కాపురాని కెంతని ధారపోస్తారు ... మీరు చంపినాసరే ... ఇక దమ్మిడీకూడా పంపమని వ్రాయను.'' ఖండితంగా చెప్పేసింది.

చేతులు నొప్పెట్టేలా కొట్టాను; సిగరెట్లతో బొబ్బలు పొక్కేలా శరీరమంతా కాల్చాను. నానా చిత్రహింస పెట్టాను. శారద లొంగిరాలేదు ... కనీసం సంతకం కూడా చెయ్యటాని కంగీకరించలేదు.

ఆఖరుసారిగా 'చంపేస్తాను!' అన్నాను పళ్ళు కోసుకునే కత్తి చూపి బెదిరిస్తూ.



"ఊఁ కానీండి!" అంది నవ్వుతూ.

విసిగిపోయాను ... ఏమిటో ఈ మూర్ఖత్వం ? చావంటేకూడా భయం లేనట్లు నటిస్తోంది ... రుచి చూపిస్తాను ...! అదేమిటో! ఆడదాని కింత అహంకార మేమిటో ?

ఉదయాన్నే కాఫీ తయారు చెయ్యటానికిగ్గాబోలు, కుంపటి ముందు కూర్చుంది శారడ. పిల్లలిద్దరూ చెరో వేపు కూర్చుని వున్నారు ... "పాల మనిషి రానీండి బాబూ! పాలు పోసిస్తాను," అంటోంది శారద. పనిమనిషి పెరట్లో కసవు వూడుస్తోంది. షుమారు ఆరురోజులైంది త్రాగి! ఎదురుగా కవ్విస్తున్న స్పిరిట్ బాటిల్ వూరిస్తోంది. ఆపళంగా త్రాగితే చచ్చిపోతాను. మద్యం తయారు చేసుకోటానికి పరికరా లేవీ? ఇన్నాళ్ళూ ఆ మూర్తిగాడి సామా నుపయోగించుకున్నాను ... మొన్న నెవరో దొంగలు అవి ఎత్తుకుపోయారు!

ఆ బాటిల్ చేత్తో పట్టుకుని, వంటింటి గడపమీద కూర్చున్నాను.

"శారదా!'' పిలిచాను,

కుంపటి విసురుతూ, తిరిగి చూచింది శారద 'ఏం?' అన్నట్లు.

ముఖమంతా కాల్చిన బొబ్బలతో, ఒళ్ళంతా నలిగి, అందంగా వుండే శారద,

అనాకారుల్లో అగ్రగణ్యురాలిగా వుంది. దానికితోడు హెచ్చుతగ్గులుగా వున్న ఆ జుట్టు!

"నే చెప్పినట్లు చేస్తే ఈబాధా, దెబ్బలూ వుండవు కదూ?" మృదువుగా అడిగాను ... పాలమనిషి పాలు తెచ్చింది. పాలు గిన్నెలో పోయించుకుని వస్తూ, "హుం, ఎన్నాళ్ళు? మూడురోజులు! ఆ తర్వాత మళ్ళీ మొదలు!'' ఆ మాటల్లో నిస్పృహే ధ్వనించింది కరకుదనంకంటే!

''లేదు! లేదు ... మళ్ళీ డబ్బుకోసం ఉత్తరం వ్రాయమంటే ఒట్టే!" అన్నాను దృఢంగా.

శారద నవ్వింది. ''మీ మాటల్లో ఎంత నిజం వుండేదీ నాకు తెలుసు... అనవసరంగా నన్ను విసిగించకండి ... కాఫీ తయారుచేసి పట్టుకొస్తాను...పళ్ళు తోముకు రండి!'' అంది తన పనిలో నిమగ్నమౌతూ!

పాలమనిషి పెరట్లో, పనిమనిషితో ఏదో కబుర్లాడుతోంది.

కోపంతో అవమానంతో దహించుకుపోయాను. బాహ్యస్మృతిని దాదాపు కోల్పోయాను. గబుక్కున చేతిలోవున్న స్పిరిట్ బాటిల్ మూత తీసి, శారదమీద గుమ్మరించాను. అగ్గిపుల్ల గీచి అంటించాను! భగ్గుమని ఒక్కసారిగా నిలువెత్తున మంట లేచింది అటుతిరిగివున్న శారద భయవిహ్వలయై ''అమ్మో!" అంటూ కేక వేసి నిల్చుంది! జరిగిందేమిటో తెల్సుకునేసరికి, పాలమ్మి, పనిమనిషీ నన్ను తిడ్తున్నారు.

"ఓరి ముదనష్టపోడా, చూస్తుండగానే ఎంత పని చేశావురా!'' అంటూ! ఏం వెయ్యాలో తోచలేదు ... వీధికేసి పరుగెత్తాను ... అనుకోని ఈ పరిణామాన్ని నేనూ వూహించలేదు!

ఏడుస్తూ పిల్లలు శారద దగ్గరికి వస్తున్నారు.

"పాపా ... నన్ను ముట్టుకోవద్దు, కాలిపోతారు...బాబూ దూరంగావుండు..." పిల్లల్నుంచి తప్పించుకుంటూ శారదకూడా నా వెనకాలే పరుగెత్తింది. కానీ అప్పటికే భయంతో, బాధతో క్రింద బోర్లాపడిపోయింది వీధిలో ... తిరిగి చూచానే గానీ, ఆగలేదు... వెనకనుంచి పిల్లలఏడుపూ, పనిమనిషి, పాలమ్మి కేకలూ, తిట్లూ, పోగవుతున్న జనం పలురకాల ప్రశ్నలతో గగ్గోలు... స్పష్టంగా వినిపిస్తోంది. తిరిగిచూడకుండా పరుగెత్తి అమ్మదగ్గిర నిల్చాను. ఇంతదాకా లేనిదడ అప్పుడు కలుగుతోంది.

సశేషం)

# పురుషార్థం

## అవసరాల రామకృష్ణారావు

గుణకీర్తి అయిన గురుమూర్తి ఆ మాట అనిపించుకోడానికి ఎంతటి త్యాగం చెయ్యవలసి వచ్చిందో ఎవరైనా ఎరుగుదురా అని!

* * *

భవాని రెండు కాగితాలు పట్టుకుని భర్తదగ్గర కొచ్చింది.

మొదటిది ఇలా చదివింది:

చిరంజీవి గురుమూర్తికి–

నీకూ, నీ భార్యకూ మా మనః పూర్వక ఆశీర్వచనములు. మీ రక్కడ క్షేమంగా ఉన్నారని తలుస్తాను. మేమంతా యిక్కడ క్షేమం.

అయిదు వందల గవర్నమెంటు ఉద్యోగం వదలేసి, ఒక్కసారిగా వెయ్యి రూపాయిల ప్రైవేటు కంపెనీలో చేరావంటే – నా కష్టాలు సగానికి సగం తీరిపోయాయనుకున్నాను. రెట్టింపు ఔతావని కలలో అనుకోలేదు బాబూ! నాకు తగిన ధైర్యం చెప్పే నీ జవాబు కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్నాను.

అయిదో తారీఖున నీకు జీతాలు యిచ్చేస్తారని వెనక రాశావు. అక్కడి నుంచి ఈ ఊరు మనియార్డరు రావడానికి ఎంతయినా వారంరోజులు మించదు. ఇవాళ ఇరవైరెండు. ఇప్పటికి నీ నుంచి సొమ్ముగాని ఎటువంటి కబురుగాని లేదు.

నిన్ను నమ్ముకుని నీ పెద్ద తమ్ముణ్ణి డాక్టరు చదువులో ప్రవేశపెట్టేను. మీ చెల్లెలికి అప్పు చేసి, పెద్ద సంబంధం తెచ్చాను. ఇంకా చదువుకుంటున్న తమ్ముళ్ళూ, ఎదిగి కూచున్న చెల్లెళ్ళూ నీకు ఉండనే ఉన్నారు.

మీ అమ్మ సంగతి నీకు చెప్పనక్కర్లేదు. ఎప్పట్లా మంచంమీదే ఉంది. ఆ రకం కేన్సరుకి మందన్నది లేదుట. ఎక్కడో దూరంగా ఉన్నావన్నమాటే గాని నా ఆలోచనా, ఆశా ఎప్పుడూ నీ మీదే ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే నూటయాభై పెన్షనుతో, యిన్ని బాధ్యత

లతో నేను బతుకుతున్నానంటే అది నిన్ను చూసుకునే.

ఈ ఉత్తరంలో యీ ఆఖరి పేరా రాయకూడదని నేను ఎంత అనుకున్నా-నా రక్తం పంచుకు పుట్టిన పెద్దకొడుకుతో నా మనసులో ఉన్నది చెప్పుకుంటే తప్పేమిటి - అనిపించి నీ కిది రాస్తున్నాను. అదిగాక ఆర్థికంగా అట్టడుగుకు దిగిపోతున్న కుటుంబపు పరిస్థితు నాలో సున్నితమైన దేదీ మిగలకుండా చేస్తున్నాయి. నీ భార్య మా కేమైనా పంపకుండా అడ్డు పడుతున్నదా అని. ఈ విషయంలో నా సందేహం మాత్రమే రాస్తున్నాను. జవాబు కోరి కాదు. అన్నీ నువ్వే ఆలోచించు. ఏదైనా



మొదట్లోనే కట్టుదిట్టం చేసుకోడం మంచిది. నీ భార్య చూడకూడదని యీ ఉత్తరం నీ ఆఫీసుకు పంపుతున్నాను. వెంటనే ఎక్స్ ప్రెస్ డెలివరీలో ఉత్తరం, పెళ్ళిగ్రాములో సొమ్మూ పంపు.

నీ తండ్రి,

వెంగళేశ్వర శాస్త్రి.

'మీరు క్యాంపుకు వెళ్ళేటప్పుడు, నాన్నగారి ఉత్తరం మీ కోటు జేబులో పెట్టుకొని వెళ్ళేరు. అలా యివ్వకపోయినా నేను ఉత్తరం చదవే ఉండను అందుకనే మగ వాళ్ళ కోటుజేబులు తడమడం ఆడవాళ్ళకు అలవాటు. అది కేవలం చిల్లరడబ్బులు కోసమే అనుకోడం మొగవాళ్ళపొరపాటు' అంది భవాని.

'అందుకనే చాలా మంది మొగాళ్ళు కోట్లు కుట్టించుకోరు. కుట్టించుకున్నా జేబులు పెట్టించు కోరు' అనేవాడు మరో పరిస్థితుల్లో అయితే గురుమూర్తి. 'కేవలం జేబులేనా ? హృదయాలను తడమగల చాకచక్యం మాకు వెన్నతో పెట్టిన విద్య' అని భవాని జవాబు చెప్పి ఉండేది కూడా. కాని ఈ పరిస్థితులు వేరు.

'మళ్ళీ మీకు శ్రమెందుకని నేనే మీ నాన్నగారికి జవాబు వ్రాసిపడేశాను లెండి' అంది భవాని 'ఏమని? అన్నట్టు కళ్ళు ఎగరేశాడు గురుమూర్తి.

'ఏముందీ, సూక్ష్మంలో మోక్షం చూపించేశాను '

భవాని ఉత్తరం యిలా చదివింది

మహారాజశ్రీ మామగారికి—

మీ కోడలు భవానీశంకరి అనేకము లైన నమస్కారములు. మాఅమ్మా మా అత్తగారి శరీరస్థితి ఎట్లున్నది వ్రాయ గోరెదను.

'నీ భార్య చూడకూడదని ఈ ఉత్తరము మీ ఆఫీసుకు పంపుతున్నాను' అని మీరు వారిపేర వ్రాసిన ఉత్తరమునకు జవాబు పనిలో యుండుటచే వారే నన్ను మీకు వ్రాయమనిరి. మీ ఆదేశము ప్రకారము వారు నాకు మీ ఉత్తరమును చూపించలేదు. ప్రతి అక్షరముచు చదివి వినిపించిరి; అంతియే

ఇక రెండవ విషయము. 'ఏదైనా మొదట్లోనే కట్టుదిట్టం చేసుకోడం మంచిది' అని వ్రాసిరి. మీ అమూల్య మైన సలహా ఎంతయు శిరోధార్యము. ఆ విషయము వెంటనే ఆచరణలో పెట్టించెదను మీరు ఏంతమాత్రము నిరుత్సాహపడవలదు క్రమముగా మీకె తెలియును.

తప్పు లున్న క్షమించవలయును.

కృతజ్ఞతలతో—భవాని.

'ఈ ఉత్తరం యిలా యిచ్చేయ్. యింకా నయం పోస్టు చేశావు కాదు, కొంప ఉంటుకపోను' అన్నాడు గురుమూర్తి

'అయితే వెంటనే ఫైర్ స్టేషనుకు ఫోన్ చెయ్యండి అంది భవానీ నవ్వుతూ.

'ఇది కాపీ మాత్రమే మీకు విని పించాలని యిదిమాత్రమైనా ఉంచాను. దీని అసలు ఈ పాటికి మెయిల్లో. ఆర్. ఎం. ఎస్. పెట్టెలో, ఇన్లెండు కవర్లో— ప్రయాణం చేస్తూ ఉంటుంది '

గురుమూర్తి జవాబు చెప్పేలోగా భవానీ దగ్గిరగా వచ్చి అతని గెడ్డం పట్టుకుని కళ్ళలోకి చూసింది. గెడ్డంమీద వెంట్రుకల్ని అరచేత్తో రాసింది అంతే.

అతని కా క్షణంలో యింకేం జ్ఞాపకం లేవు.

కావాలని ఆమె పైట జారిపోయింది.

ఇంకేం కావాలని అతని గుండె జారి పోయింది.

అతను ఆమె రెండు భుజాలూ గట్టిగా పట్టుకున్నాడు,పిచ్చిగా ఆమెలోకి చూస్తూ.

'ఉండండి '

'ఏం?'

'ఈ చీర విప్పి, మరొకటి కట్టుకు వస్తాను.'

'నువ్వు చెప్పిన వాక్యంలో మొదటి సగమూ చేస్తేచాలు!'

ఇద్దరూ నవ్వుకున్నారు.

మరుక్షణం వాళ్ళిద్దరూ 'మరు'క్షణం అనుభవిస్తున్నారు.

కైకేయి దశరథుణ్ణి ఏ పరిస్థితుల్లో వరాలు అడిగిఉంటుందో, బహుశా ఆ పరిస్థితుల్లో ఉండిఉంటారు. ఒక్కటే తేడా: ఆనాడు కైకక్క అడిగిన వరాలు రెండు మాత్రమే!

* * *

ఆలోచనల్ని మించిన నల్లులూ, చికాకుల్ని పెంచిన దోమలూ లేవను కుంటే గురుమూర్తికి ఒంటిగంటా అయే సరికల్లా తెలివి వచ్చేసింది. అతనిలో మానవుడు లేచి కూచున్నాడు. దీపం వెలిగించుకున్నాడు.

'ఈ నెల జీతంలో మిగిలింది ఎక్కడ పెట్టేవ్?'

ఏమాత్రం విసుగు కనపర్చకుండా భవాని లేచింది. తలగడా గలీబులో దాచిన తాళాలగుత్తి పైకి తీసింది. బీరువా తలుపులు తెరిచింది.

ఉన్న విషయాలు ఉన్నట్టు చెప్పు కుంటే ఎంత చిత్రంగా ఉంటాయి. ఈ మధ్య వారపత్రికలో 'విప్పలాంటికథ' అనే మంచి కథానిక పడింది. మీరు చదువుతారని కట్ చేసి దాచిఉంచాను. ముందిది చదవండి.'

చీర మడతల కింద దాచిన అచ్చు కాగితాలు భవాని పదిలంగా భర్తచేతి కిచ్చింది. డబ్బు పంపించమని పదే పదే కొడుకుని వేధించిన ఒక తండ్రి కథ




అది. ఆ కథకు చిన్న ముందుమాట రాస్తూ రచయిత యిలా రాశాడు. 'పితృ దేవోభవ అని ప్రబోధించే భారతదేశం మనది. పున్నామ నరకంనుంచి తప్పించ డానికి పుట్టినవాళ్ళు పుత్రులు అని నమ్మిన వాళ్ళం మనం. ఆదేశాలకీ, ఆచరణలకీ అదెంత దూరమో చెప్పడమే నా ఉద్దేశం. సత్యాన్ని చాటినప్పుడు వినడం మీ కిష్టం లేకపోతే నన్ను శపించండి. క్షమించండి, అని మిమ్మల్ని అడగవలసిన అవసరం మాత్రం నాకు లేదని నిష్కర్షగా చెబుతున్నాను.

కథ చాలా చిన్నది. అది కొడుకు తండ్రికి రాసిన ఉత్తరం మాత్రమే. అవైనా పది పాయింట్లు. సచ్చిదానందం సర్వాబద్ధం గారి పెద్దభార్య కొడుకు. తను కాపురం పెట్టేకకూడా పదేళ్ళపాటు అతను తండ్రికి నెలకి ఏభై రూపాయిల చొప్పున ఒక నెలా తప్పకుండా పంపించాడు. కూతురి పెళ్ళి చెయ్యడంవల్ల ఓసారి రెణ్ణెల్లపాటు సచ్చిదానందం సొమ్ము పంపించలేకపోయాడు. తండ్రి చాలా ఘాటుగా కొడుక్కి ఉత్తరం రాశాడు. ఆ క్షణంనుంచీ సచ్చిదానందం సొమ్ము పంపించడం మానేశాడు. తండ్రి ప్రతి మాటకీ తగిన సమాధానం చెబుతూ సచ్చిదానందం రాసిన ఉత్తరం 'ఇంట్లో పెద్ద కొడుకుగా పుట్టడం కంటె అడవిలో పెద్దపులి నోట్లో పడడం మంచిది' అనుకునే వారంతా ఎగి రెగిరి

గంతులేస్తూ చనవవలసినది. ఆ పది విషయాలూ - టెన్ కమాండ్ మెంట్సు - యివీ:

1. నిన్ను నవమాసములు మోసి,

...మీరు మొయ్యలేదనుకుంటాను ' ప్రపంచంలోని అన్ని జడజీవరాశులకీ గర్భ ధారణ యింతకాల మని ప్రకృతి నిర్ణయించింది. ఆ ప్రకారమే, అందర్లాగే, అందరితో పాటే అమ్మ నన్ను మోసింది గాని నా కోసం కనీసం ఒక్క నెలయినా ఎక్కువ మోసిం దనుకోను. ప్రత్యేకించి చెప్పడం దేనికీ ?

2. కని,

...కనక, మరోమార్గం లేదుకనక అలా జరిగి ఉంటుంది. అయినా ఆ మరోమార్గం ద్వారా నన్ను మరో ప్రపంచానికి పంపించే ప్రయత్నం జరిగినా జరిగిఉంటుంది. ఆ రోజుల్లో అమ్మచేత మీరు లోపాయికారిగా ఎన్నిమందులు మింగించారో ఎవరి కెరుక ?

3. పెంచి,

...ఎవరి పిల్లల్ని వారు పెంచుకోవడం ఊరికి ఉపకారమా · ఇంకా ఏ దిక్కుమాలినవాడో, ఏ పైకులంకుర్రాడో అలాంటివాణ్ణి తెచ్చి పెంచుకున్నామంటే నలుగురికీ చెప్పినా చెప్పకున్నా అందమూ చందమున్నూ. అయినా ఎప్పటికప్పుడు పిల్లలు తల్లిదండ్రులకు ఏమీ యివ్వడం లేదా? బుల్లిబుల్లి పిల్లలు ఊరంతా ఏకమైనట్టు నవ్వుతూంటే, భూమంతా దద్దరిల్లేట్టు అడుగులేస్తూంటే, ప్రపంచమంతా మారుమోగేటట్టు అరుస్తూంటే మురిసిపోని తల్లితండ్రు లున్నారా ?

4. విద్యాబుద్ధులు చెప్పించి,

...చెప్పించకపోతే తలో చిప్పా చేత్రా యిచ్చి నడివీథిలోకి నెట్టక పోయారా ? అలా చేస్తే నీ మొహాన్ని నలుగురూ ఉమ్మేసీళ్ళు జల్లుతారని భయమా ? ఇంతకీ ఇదంతా మీ ప్రయోజకత్వమేనని స్వతహా పిల్లలు పుట్టుకతో తెచ్చుకున్న జ్ఞానమంటూ లేదా యేం ! బొత్తిగా ఖుంత అయిన గుంటడ్ని తండ్రి ఏం చెయ్యలేడు, వాడి రాత ఏం చెయ్యలేదు. అనేకమంది అనాథలు స్వశక్తిచేత పైకి రావడమూ మనం ఎరుగుదుం. దీని కేం జవాబు చెబుతారు ?

5. మేము తినినా మానినా పిల్లలకి పెట్టి,

...ఇలాంటివాళ్ళు నూటికి ఏ పది పదిహేనుమందో ఉంటారు. అలాంటి స్వల్పమైన సంఖ్యలో అందర్నీ చేర్చడం అన్యాయం. ఒకవేళ అలా పెట్టినా 'వీడు పెద్దయి రేపొద్దున్న మన్ని ఒక కంటితో చూడకపోతాడా' అనే స్వార్థంతోనేగా !

6 ఉద్యోగం యిప్పించి,

...క్వాలిఫికేషనూ, అదృష్టమూ వుంటే ఒకళ్ళు యిప్పించేదేమిటి ?

7. కట్నం పుచ్చుకుని,




...'వీడి చదువుకోసం ఇంత ఖర్చు పెట్టాం; అది ఎవరో ఊరివాళ్ళ మీద పడి లాగుదాం' అన్న సిగ్గుమాలిన పని పైకి చెప్పుకోడం కూడానా? 'నా బాబు దగ్గిర వీళ్ళ బాబు యింత సొమ్ము గుంజేడు. అంతకు అంతా కక్కించని నా జన్మేలః' అని తొయ్యాలి తొలినాడే తెయ్ తెయ్యి మని ఆడిందంటే ఆ నేరం ఎవరిది:

8. యథావిధిగా పెళ్ళి చేసి.

...మర్యాదలు సరిగ్గా జరగలేదనో, ముచ్చట్లు బాగా తీరలేదనో – తప్పులు పట్టుకోడానికి అన్ని అవకాశాలూ గల, రక్త మాంసాలు వదులుకుని శల్యాలు పట్టుకు ఏడ్చే, నేటి వివాహాల పద్ధతేగా యథావిధి? బతికున్నన్నాళ్ళూ కలసి జీవించవలసిన వధూవరులకు పెళ్ళినాడే ఒకరి కుటుంబంమీద మరొకరి కుటుంబానికి చిన్నచూపు ఏర్పడి విద్వేషాలకు బీజం ఏర్పడేది అప్పుడేగా!

9. నువ్వూ నీ పెళ్ళామూ చిలకా గోరింకల్లా కాపురం చేస్తూంటే ఎంతో ఆనందించి,

... కేవలం నోటి మాట. 'వాళ్ళ మటుకు వాళ్ళని ఏడవనీ' అని ఏ తల్లి తండ్రులూ పిల్లల్ని సుఖంగా బతకనివ్వరు. పిలవని పేరంటంగా వారి సంసారాల్లో ప్రవేశించి, ఆమోదయోగ్యంగాని సలహాలు ఇచ్చి, అనవసరమైన ఆరాలు తీసి–ముచ్చటైన కాపురాల్లో చిచ్చు రేపేది ముఖ్యంగా పెద్దవాళ్ళే.

ఏ యువకుడి హృదయంలో అయినా దూరి అడిగి చూడండి, తెలుస్తుంది.

10. ఎన్నో విధాల త్యాగం చెయ్యడం ఇందుకేనా ?

...ఇందులో ఏపీ త్యాగమనే పదానికి పరిధాపుల్లో లేదని ఈ ప్రశ్నే రుజువు చేస్తోంది. ప్రయోజనం ప్రతిగా కోరింది త్యాగ మనిపించుకోదు.

నాన్నా, ఇలాంటి ఉత్తరం రాసి నందుకు నాకు సిగ్గుగా ఉంది. తప్ప నందుకు విచారంగానూ వుంది. ఇన్నాళ్లూ మీకు డబ్బు పంపించానంటే అమ్మమీద అంతో యింతో అభిమానం—అభిమానం మాత్రమే, గౌరవం కాదు!—నాకు మిగిలి ఉండడమే కారణం. పిల్లల్ని పెంచి పెద్దవాళ్ళను చెయ్యడం పెద్దవాళ్ళ డ్యూటీ అనుకున్న తల్లిదండ్రుల్ని మాత్రమే ప్రాజ్ఞులయిన పిల్లలు ప్రేమించి, సేవించ గలరు. — సచ్చిదానందం.

'ఈ కథమీద తమరి అభిప్రాయం?' అంది భవానీ. గురుమూర్తి జవాబు చెప్పలేక పోయాడు. మరొక గ్లాసు మంచినీళ్ళు తాగి—

'ఇప్పటికే ఆలశ్యమైపోయింది. వాళ్ళు నానా ఇబ్బందులూ పడుతుంటారు. పొద్దుటే టీ. ఎం. వో. పంపేస్తాను; సొమ్మెక్కడుంది?' అన్నాడు హీన స్వరంతో. ఆ స్వరంలో మార్పు చూసి భవానీకి ముచ్చట వేసింది. తన ఆధిక్య తను గుర్తించడంవల్ల ఆమె కన్నులు మెరిశాయి. నాలుగు పచ్చనోట్లు తెచ్చి అతనికిచ్చింది. 'ఇంటద్దే, పాలూ, పని పనిపీ పోగా మిగిలినది వందరూపా లాయి సగం నాడు—సేను మిహోఫ్ఫానుగిస మిగిలింది మీ యిష్టం' అంది. అక్క డికీ ఊరుకోలేదు.

'మీ వాళ్ళు నాకు పైవాళ్ళ అవు తారా? ఎటొచ్చీ వాళ్ళు నన్ను ఎన్నాళ్ళకి పైదానిగా గుర్తించడం నా దురదృష్టం.' అంది గద్గద కంఠంతో. గురుమూర్తి భార్యవైపు చూశాడు. ఆ మొహంలో విజాయితీ, ఆ స్వరంలో మానవతా కని పించి అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. 'ఎది రయినా నన్ను అర్థం చేసుకున్నారు అంతే చాలు' అనే భావం అతన్ని ఆమెకు మరింత దగ్గిర చేసింది.

* * *

క్రమంగా అర్థాంగి త్రీ పోర్త్రాంగి అయిపోతూంది.

ఆనెల ఇంటికి రెండొందలు మాత్రమే పంపగలిగాడు గురుమూర్తి. "మీ తమ్ముళ్ల బాధ్యత మీ దెందుకయిందీ అది మీ నాన్నగారిది. రేపొద్దున మనకి పిల్లలు పుడితే ఆ బాధ్యత మాత్రమే మనది.' అని భవానీ గురుమూర్తి కెప్పుడూ నూరిపొయ్య లేదు. పైగా 'ఎంత మిగుల్చుదామన్నా ఈ కాని పట్నంలో ఖర్చులకాలంలో, మిగల్చలేకుండా ఉన్నాము. పాపం, అక్కడ ఆ మన

లాళ్ళు ఎంత బాధ పడుతున్నారో..." అనేది.

సరిగ్గా యిటువంటి సమయంలోనే ఇంటినుంచి ఉత్తరాలు వచ్చేవి. అలాం టప్పుడు అందులో ఏముంటుందో భవానీ ఊహించలేనిదేంకాదు. చింపకుండానే అందులో ఏముందో ఆమె చదవగలిగేది. పగలల్లా ఆఫీసులో పనిచేసి సాయంకాలా నికి భార్యతో వేసుకునే ప్రోగ్రాం గురించి కలలుగంటూ గురుమూర్తి ఇంటికి వచ్చేసరికి — నీ భార్య మంచిదికాదు. మనం తెలియక గోతిలో పడ్డాం — వాళ్ళు వాళ్ళు బొత్తిగా లేనివాళ్ళు. మరీ నీచపు మనుషులు. అందుకే నిన్ను వాజమ్మను చేసి ఆడిస్తోంది. ఇంతకీ ఆమెను అను కోవటం దేనికి? నువ్వింత నిర్వీర్యు డవైపోడం మా దురదృష్టం — అంటూ ఉత్తరాలు వచ్చేసరికి అతనికి లోక మంతా చీకటైపోయినట్టు అనిపించేది. ఆ కవరు చింపబడకుండా ఉండడం అత నికి ఆశ్చర్యం కలిగించేది. తడిగుడ్డతో గొంతుకే కొయ్యనక్కర్లేదు. కవరు నెమ్మదిగా విప్పి మళ్ళీ అంటించవచ్చు అని అతనికి తెలీదు.

'ఇంటినుంచేనా ఉత్తరం' అను కున్నాన్లెండి. అందరూ కులాసాయేనా? ఈనెల మరచిపోకుండా మరో రెండొం దలు పంపండి. ఎంత యిబ్బంది పడు తున్నారో ఏమిటో — నా కిప్పుడు మాట ఏభై పెట్టి రిష్టువాచీ కొనకపోతే కాల చక్రం ఆగిపోదు.' అంది భవానీ. ఏమి ఊహించి ఆమె అలా అందో అలాగే జరిగింది.

ఆమెచేతికి అరగంట దాటకుండా వాచీ వచ్చింది.

'డబ్బు పంపేది నేను, అందుకునేది మీరు. మధ్య నాభర్త ప్రసక్తి ఎందుకు? నెలకి ఎంత పంపుతే మీకు తనివి తీరు తుంది? స్పష్టంగా రాయరాదూ?' అని రెండుముక్కలు రాసి గురుమూర్తి పోస్టుచేశాడు. వెంటనే జవాబు వచ్చింది. ఎంతపట్నమయినా ఇద్దరు మనుషులకి రెండొందలు ఏభైకంటె ఎక్కువ అవ సరంట. కావలిస్తే భవానీ,పాపం, చిన్న పిల్లా, సరదా లుంటాయిగనక, ఓ ఏభై ఉంచుకోవచ్చుట. ఏమాత్రం తల్లిదండ్రు లంటే భక్తీ గౌరవమూ ఉన్నా నెలకి ఏడొందలూ పంపితీరాలిట — అంతకు తక్కువ పంపితే తిప్పికొట్టేస్తారట. అంతగా గురుమూర్తికి ఏమైనా అవసరా లుంటే తండ్రికి రాసి తెప్పించుకోవచ్చు నట

గురుమూర్తి ఆ ఉత్తరం భార్యకి చదివి వినిపించాడు. అందులో అతన్ని మనస్సా నొప్పించిన విషయాలు యివి.

తను సంపాదించిన సొమ్ము ఖర్చు పెట్టుకునే స్వాతంత్రం తనకి లేదా? తన జీతంలో పాకెట్ మనీకి నెలకి పదిరూ పాయిలయినా తనకి అవకాశం లేదా?

అంతగా అవసరమైతే తనే రాసి తెప్పించుకోవాలా?

'పోనీ కొన్నాళ్ళపాటు నేను అక్కడికి వెళ్ళిపోతాను. మీరు ఏ హోటల్లోనో తింటూ నెలకి తొమ్మిదివందల దాకా పంపొచ్చు' అంది భవానీ. గురుమూర్తి జవాబు చెప్పలేదు. వెంటనే కలం కాగితం తీశాడు. 'నిప్పులాంటి కథ' లో సచ్చిదానందం పంపేశాడు. భవాని ఆ కథ తీసి చాటుగా ముద్దెట్టుకుంది. చీరల మధ్యనుంచి తీసి, జాకెట్ల మధ్య గంధపుబొట్టాలమధ్య ఆ కాగితాలు అతిపదిలంగా దాచుకుంది.

* * *

'రెండు వందలుంటే యిద్దూ,' అన్నాడు గురుమూర్తి ఆరునెలల తరువాత ఓ సాయంకాలం ఇంటికొస్తూ. 'దేనికి?' అంది భవానీ కనుబొమ్మలు కొద్దిగా చిట్లిస్తూ. అలా ఎప్పుడూ ఆమె అడగనూలేదూ, అలా చూడనూలేదు. అనుకోకుండా అతనూ తిరుగుప్రశ్న వేశాడు.

'నీతో చెప్పాలా?'

ఆ లోపం వాళ్ళిద్దర్లోను లేదనుకుంటే ఆ క్షణం ఆ దుర్ముహూర్తాన్ది మాత్రమే. ఆమె విసురుగా యున్ని నోట్లకట్టలు తెచ్చి అతనిముందు పడేసింది.

'అవసరంలేదు. మీరు సంపాదించిన సొమ్ము జాగ్రత్తగా కూడబెట్టవలసిన అవసరం నాకూలేదు!' అనేసి ఇంతమొహం చేసుకు లోపలికి వెళ్ళిపోయింది — ఛళ్ళని తలుపు వేసేసింది.

గురుమూర్తి లోపలికి వెళ్ళలేదు. ఆశ్చర్యంగా అటే చూస్తూ అక్కడే ఉండిపోయాడు చాలా సేపు. ఆవాళ అతను రెండువందలడిగింది, నిజానికి ఆమెకి కొత్తరకం పట్టుచీర కొందామని! కాని జరిగింది వేరు. ఆనాళ్ళనుంచో అనుకుంటున్న టెన్నిస్‌బాటు కొనుక్కున్నాడు. మిగిలిన డబ్బు బీరువాలో ఉంచేశాడు.

అతన్నలా వెళ్ళనిచ్చి భవానీ అక్కడే కూచుని ఆలోచించింది.

'నాన్నా! యీ డబ్బు నీ దగ్గిరుంచు. ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మడం మంచిది కాదు' అని తండ్రిపేర అయిదువందలు మనీయార్డరు చేసింది. మనిషిరక్తం రుచిమరిగిన పులిలాగ—భవానీతండ్రి ఆ సొమ్ము అందుకుని తక్కిన ప్రపంచాన్నే మరచిపోయాడు. ఉన్న పొలం కాస్తా అమ్మేసి ఒక్క కూతురు కదా అని తలకు మించిన సంబంధం చేశాడు. కూతురు ఒక్కర్తే. కొడుకులు ఆరుగురు. ఒక్కరికీ డిగ్రీ అయినాలేదు. వాళ్ళ దర్నీ పైకి తీసుకురావడం ఎలాగ? ఇన్నాళ్ళకు బంగారుగుడ్లు పెట్టే కోడి దొరికింది! తనేం తాగుబోతు కాదు; తప్పుడుదార్లు తొక్కినవాడు కాదు—తను తింటున్నది కూడా పైవాళ్ళ సొమ్మేంకాదు. ఏం తప్పా? అనుకున్నాడు భవానీ తండ్రి

పరమేశ్వరంగారు ప్రతీనెలా పసియార్డు అందుకుంటూ.

*    *    *

'మీ నాన్నగారి పేర నువ్వు పంపు తున్న డబ్బంతా కూడబెట్టి మీ నాన్న నీ పేర ఏ భూమయినా కొని నీ కేదో విరాళం చేస్తా డనుకుంటున్నావేమో! పొరపాటు. నీ పేర బ్యాంక్ ఎకౌంట్‌లో ఏమీలేదు. కావలిస్తే వెళ్ళి చూసుకో' అని ఆ ఊర్నుంచి వచ్చినవా రొకరు భవానితో చెప్పగా, ఆదేదో తండ్రిని గట్టిగా అడిగేద్దామని—తల్లికి జబ్బుగా ఉందని మొగుడితో బొంకి—ఆమె ఆ ఊరు వెళ్ళింది; ఆ యింట్లో అడుగు పెట్టింది.

అది పుట్టిల్లు.

తనని నవమాసములు మోసి, కని పెంచిన తల్లి ఉన్న యిల్లు.

తనకి మంచి సంబంధం చేపడం కోసం తన అన్నదమ్ముల చదువును కూడా లెక్కచెయ్యని తండ్రి...ఉన్న యిల్లు.

తనవల్ల నిర్భాగ్యులైన అన్నదమ్ము లున్న యిల్లు.

భవానీ తండ్రిని ఏమీ అడగలేక పోయింది.

ఇంటికి వచ్చిన మరునటి నెలనుంచీ మరొక ఏభై బట్వాడా ఎక్కువ చేసింది!

*    *    *

'అలివంకవారు నీకు ఆత్మబంధువు లైనారు. కని పెంచినవారు చచ్చారో బతికారో కూడా లక్క్లేని అధమస్థితిలో ఉన్నావు. కానియ్యి రేపొద్దున నీ పిల్లలు పుట్టి నీకు కళ్ళు తెరిపించే రోజు రాకపోదు,' అని సంగమేశ్వరశాస్త్రిలు కొడుక్కి ఉత్తరాలు రాయడం మానలేదు; కాని ఆ రోజూ రాలేదు; గురుమూర్తికి పిల్లలూ పుట్టలేదు.

ఒకనాడు తండ్రిదగ్గిర్నుంచి వచ్చిన ఉత్తరం చూసి మనసంతా పాడైపోయి గురుమూర్తి అదోలా ఉండగా పక్కింటి ప్రసాదు వచ్చి పలకరించాడు. ఇన్నాళ్లూ రెండోకంటివాడితో చెప్పకుండా కడుపులో పెట్టుకున్న కష్టమంతా స్నేహితుడి ముందు వెళ్ళగక్కేశాడు గురుమూర్తి.

'వేలకువేలు ఆర్జిస్తున్నా రనీ, లిమిటెడ్ ఫామిలీ అనీ, ఎటువంటి చికాకులూ లేని అదృష్టవంతు లనీ—మిమ్మల్ని చూసి మేమంతా అసూయపడుతూ ఉంటాం. మీకు ఇన్ని గొడవ లున్నాయా గురుమూర్తిగారూ! ఎంత చిత్రం! అయితే మీరు ఒకవైపే నమ్ముకున్నారు. ఆ లెక్కకి అదృష్టవంతులే...నాలా రెంటికీ చెడ్డ రేవడి కాలేదుగా?'

'అదేమిటి?' అన్నాడు గురుమూర్తి.

'ఇంట సంసారంలో నలుగురుపిల్లలతో మూడొందల ఉద్యోగంతో యీ కరువు కాలంలో ఎలా ఈడ్చు కొస్తున్నానో నాకే తెలుసు. మా అత్తగారూవాళ్ళూ

పైవాళ్లు గనక నన్నర్థం చేసుకోలేదంటే బోధపరుచుకోవచ్చు. మా నాన్నావాళ్లూ నన్నాడిపోసుకుంటే ఎలా అర్థం చేసుకోను? మా బావమరిది ఫీజు కట్టలేక పరీక్ష మానేసినా, మా మావగారి మందుల షాపు దివాళా తీసినా నేను కాణీ ఖర్చు లేదు. కాని మా ఆవిడ గీచిన గీటు దాటనని నాకు మా యింట్లో పేరు. ఎలా చెపను? అందుకే అంటాను. మీకు ఓ వైపేనా మంచిపేరున్నది సంతోషమది. అదైనా నిలబెట్టుకోండి, నాకు పరమ సంతోషం.'

'మళ్ళీ అలా అంటారేమిటి?

'ఈ లోకంమీదా, ఈ విమర్శలమీదా నాకు నమ్మకం చాలక.'

'అంతేనా, లేక నా మీదకూడా నమ్మకం.. '

'మన మంచి మనం చూసుకోదలిస్తే ఎవ రెలా అనుకున్నా మనకి బాధ ఉండదు. అది చేతగాకే ఇంత బాధ.'

ప్రసాదు అన్నవాంట్లో అంతర్యమేమిటో గురుమూర్తికి అర్థంకాలేదు.

'ఇదివరకు మిమ్మల్ని మీ నాన్నగారు పాలించేవారు. ఇప్పుడు మీ మామగారు మిమ్మల్ని ఏలుతున్నారు. మనం మట్టిబొమ్మలమైతే ముడడం సుఖవే, కాని ఏలాంటివాళ్ళనీ 'నాకు సుగిలిందంటూ ఏం లేదా' అనే ప్రశ్న సాధించక మానదు.'

'నన్నిప్పుడు నడిపిస్తున్నది నా భార్యంటే ఒప్పుకుంటాను; కాని అది అంత అన్ రీజనబుల్‌గా ఉంటుందంటే...'

'ఎందుకో చెప్పకుండా ఒక అయిదు వందలు మీకు కావాలని పుచ్చుకోండి చూద్దాం అయితే,' అని సవాలు చేశాడు ప్రసాదు.

ఆ రాత్రి ఎంత అల్లరి జరుగాలో అంతా జరిగింది.

ఓ వాసీ, గురుమూర్తి కనీసం ఏళ్ళైనా ఒకరికొకరు విడాకులు యిచ్చుకుని వుంటారు, ఆ పదిగంటల్లోనూ. కాని తెల్లవారేసరికల్లా ఒక మంచంమీంచి లేవడమే మహాచిత్రం దేని దారి దానిదే.

* * *

గురుమూర్తికి ప్రమోషను వచ్చింది ఇప్పు డతని జీతం పన్నెండొందల యాభై.

మొదటి నెల జీతం అందగానే ఫ్రెండ్సందరికీ అతను డిన్నర్ ఇచ్చాడు హోటల్ ప్యారడైజ్‌లో. ఆ రాత్రి అందరూ యింటికి తిరిగివెళ్ళే ప్రయత్నంలో, స్టెనో చంచలని అతను కారు మీద స్వయంగా దిగబెట్టవలసివచ్చింది.

'మీ జీవితంలో యిది మరచిపోలేని రోజు. కాని, దానికి తగ్గట్టుమాత్రం లేదు మీ పోజు,' అంది చంచల అతని పక్కకి జరుగుతూ.

'ఏం చెప్పను మిస్ చంచలా,



ఎంత జీతం అయితే నేం, సుఖమన్నది లేకపోయాక! ఇంతకంటె నా జీతం ఏ నూటఏభైయ్యో అయితే మావాళ్ళంతా నన్ను మరింత సానుభూతితో చూద్దురేమో.'

'నోనో, యు ఆర్ స్టిల్ ఇన్ ది డార్క్‌నెస్. మీ జీతం నూటఏభై అయితే, మీవాళ్ళందరూ — మీ ఆవిడతో సహా — మీ మొహాన్న ఉమ్మేద్దురు. లేనితనం అదేం మగతనం! ఛ ఛ!'

'ఇంత వుండి నేను అనుభవిస్తున్నదేమిటి చెప్పండి? నన్ను కట్టుకున్నదయినా సన్నర్థం చేసుకోకపోతే యింకెందుకు?'

'అసలు మిమ్మల్ని మీరు అర్థం చేసుకున్నారా అని.'

గురుమూర్తి తెల్లబోతూ ఆమెవైపు చూశాడు.

'చల్లగా ఉంది; నిర్మానుష్యంగా ఉంది; కారు ఓసారి ఆపండి. లెటజ్ ఎంజాయ్ ఎండ్ గో.'

ఆమె తన కాలితో అతనికి బ్రేకు వేసింది. అతని కాలు అప్రయత్నంగా కారుకి బ్రేకు వేసింది.

'అనుభవించడం చేతగాక ఒకరి మీద అలుగుతారు దేనికి? వయసయితే వచ్చింది ఏం లాభం. వట్టి పాపాయి,' అంది చంచల నవ్వుతూ.

నిజంగానే అతను ఆమె ఒళ్ళో పాపాయి అయిపోయాడు.

'ఎంత పొరపాటు జరిగింది!' అని అతను అనుకోకుండానే!

'మీ మటుకు మీరు కొంత హ్యాపీనెస్ బిల్డప్ చేసుకోండి. తప్పేంలేదు. ఎవరి దృష్టిలో — పరిస్థితిలో. వాళ్ళలా చేస్తూనే ఉంటారు.'

'ఇలా జరిగిందని ఎప్పుడైనా తెలిస్తే?'

'మిమ్మల్ని సానుభూతితో అర్థం

చేసుకునేవా ళ్ళెవరైనా ఉంటే ధైర్యంగా చెప్పండి. అలా కానివాళ్ళతో ఎలా మెలగాలో యీపాటికి మీకు తెలిసే వుండాలి.'

'ఎలాగ ?

'ఓయి పిచ్చినాయనా, ఇంత వెర్రి వాడివి అంత పెద్ద ఉద్యోగం ఎలా వెలగబెడుతున్నావయ్యా ? ఆమాత్రము అప్పటి కేదో చెప్పెయ్యలేవా ? భలే వాడివే అయితే మచ్చుకి మొదటిపాఠం చెబుతాను, నోట్ చేసుకో. తిన్నగా బజారుకి వెళ్ళి సిల్కుచీర ఏభై రూపాయలది ఒకటి కొను. కృష్ణచంద్ ఇల్లు సిల్కుపేలస్ పక్కనే. లేస చీర తీయించు. నీకయితే యిస్తాడు. ఇంటికి తీసికెళ్ళి రెట్టింపు ఖరీదు చెప్పి, మీ ఆవిడకి ప్రెజంటు చెయ్యి. ఇవాళ నీకు జీత మొచ్చిందిగా, ఎక్కువగా...'

'ఇంత ఆలశ్య మెందుకయిందని అది అడిగితే ?'

'మీరు మాసిన సంబరంలో యింక అడగడానికి తీరికఎక్కడ య్యా? అందుకే మగాళ్ళు 'వీపీ టు పి పవరాఫ్ ఎన్' అన్నారు. అలా చూస్తావేం, బయల్దేరు.'

'సరే ఐతే, మీ సలహాకి కృతజ్ఞుణ్ణి'

'ఉత్తుత్తి మాటలేనా ? భలే వాడివయ్యో! ఫీజు పుచ్చుకోందే కేసులు పట్టడం నాకు అలవాటు లేదే!'

చంచల అతనివైపు నవ్వుతూ చూసింది.

'ఎంత ?'

చంచల రెండు చేతులూ ఎడంగా చాపి 'ఇంత' అంది. గురుమూర్తి తెల్లబోతూంటే.

'ప్రస్తుతానికి ఓ నూట ఏభై యిమ్మా-చాలు' అంది అంటూ, 'నువ్వు యివ్వడం ఎందుకూ, మీ వాళ్ళచేత నేనే తెప్పిస్తాను. చూడు ఇవ్వడమేగాని పుచ్చుకోడం నీకు అలవాటులేదు కాబోలు కర్మ - సరే మా నాన్న దయాసాగరం ఎడ్రసు ఇద్దువు గాన్లే...అలా తెల్లబోతావేం ? నే చెబుతాను రెండుత్తరాలు రాయి.' గురుమూర్తి ఆమె చెప్పినట్టు రెండుత్తరాలూ రాశాడు. అందులో ఒకటి అతని తండ్రి సంగమేశ్వరశాస్త్రులుకి.

'ఇన్నాళ్ళూ తల్లిదండ్రుల్ని దూరం చేసుకుని, భార్య చేతిలో కీలుబొమ్మ నైనందుకు సిగ్గుపడుతున్నాను. మా మావగారు నన్ను పూర్తిగా బికారిని చేసేదాకా నాకు జ్ఞానోదయ మవలేదు. మాకు జీతాలుకూడా సరిగ్గా అందక, దాన్ని కొన్నాళ్ళపాటు పుట్టింటికి పంపేద్దామా అని చూస్తున్నాను. ఏ మాత్రం వీలయినా ఓ ఏభై రూపాయలు, నాకు అన్ని విధాలా కావలసినవారైన పెద్దలు, పూజ్యులు శ్రీ దయాసాగరంగారి పేర పంపవలెను. (ఎందుచేతంటే నా పేర డబ్బువస్తే బ్రహ్మరాక్షసి అయిన నా భార్య అది నాకు దక్కనివ్వదు.)

రెండో ఉత్తరం పరమేశ్వరంగారికి.

'గతనెల భవానీ పంపిన సొమ్ము








అందికరని తలుస్తాను ఎప్పుడు సొమ్ము పంపినా ఎంతో యిదిగా తెలియబడుస్తారు. మీలాంటి అల్ప సంతోషులకు ఏం పంపినా సార్థకం ఉంటుంది. అనకూడదు గాని మా నాన్నలాంటి దురాశాపరులకు ఎంత పంపినా ఒకటే. ఈ మధ్య నా జీతం ఎక్కువైంది. కంపెనీలో ఫండ్సు లేనందువల్ల ఆ పైనెలలోగాని జీతాలు యివ్వరు. వెంటనే ఓ వంద యీ క్రింది ఎడ్రసుకి పంపగోరెదను.'

పదిహేను రోజులు దాటకుండా చంచల ఫీజు అందుకుంది! ఆ తరవాత పాపం ఆమె చాలా చాలా సలహాలు అతని కిచ్చి ఎడిపోతున్న ఒక యిల్లు నిలబెట్టింది.

గురుమూర్తి ఆ పైనెలనుంచి భార్య చేతిలో జీతం పెట్టడం మానేశాడు.

'రెండు లక్షలకి యిన్సూరు చేశాను. నీ పేర వస్తుంది. అందుకని దానికి సగం జీతం పోతోంది.' అని అతను భవానీతో అంటున్నప్పుడు ఆమె అణుమాత్రమయినా ఆశ్చర్యపోక పోవడం అతనికి ఎంతో వింతనిపించింది 'నీకు నెక్లెసు కొందామని అయిదువందలు కోటుజేబులో పెట్టుకుని సరిగ్గా డల్హౌసీ స్క్వేరు దగ్గిర చూసుకుంటే పర్సు లేదు!' అన్నా, ఆమె ఎంత మాత్రం సంశయించలేదు. మరో సారి. పైగా అతని కిప్పుడు అన్ని వైపులనుంచీ రావలసినంత సానుభూతీ, కోరినంత సుఖం, కొనుక్కోగలిగినంత ఆనందం!

* * *

గురుమూర్తి ఎంత కష్టపడి అందరి చేతా "ఔరా!" అనిపించుకుంటున్నాడో చెప్పినా ఎవరూ నమ్మరు గద!

# చుట్టపుచూపు

"ఏం కాలం వచ్చి పడిందమ్మా, నరసమ్మా ! ఒక అతిథిసత్కారం కాదు బంధుమర్యాదగాని ఏమీ లేదు," అన్నాడు ఏభైఅయిదేళ్ళ శఠగోపం అప్పుడే భోజనం చేసివచ్చి వాలుకుర్చీలో పడుకుంటూ.

ఆకులూ, వక్కలూ, సున్నమూ తెచ్చి వాలుకుర్చీ ప్రక్క ఒక చిన్న బల్లమీద పెట్టింది నరసమ్మ.

"అందులోనూ మీ ఆడబడుచు శాంతమ్మకి అసలు బంధుసరళి బొత్తిగా తెలీదు." అన్నాడు శఠగోపం మళ్ళీ ఉపోద్ఘాతంగా.

సాధారణంగా ఆడబడుచుమీద విమర్శ వస్తే, చాలమంది ఆసక్తితో వింటారు. నరసమ్మకూడా ఉత్సాహంతో క్రింద చాపమీద చతికిలబడింది వినటానికి.

శఠగోపం ఒక కమీషను ఏజెంటు. హైదరాబాదుకి ఏదో పనిమీద వచ్చి గత వారంరోజులనుంచీ మాధవరావు ఇంట్లో తిష్టవేశాడు. ఆయన మాధవరావు భార్య నరసమ్మతాలూకు అమ్మమ్మగారి తోడికోడలి కొడుకు ! 'అలివంక చుట్టం ఆత్మబంధువు' అన్నారు. అందుచేత ఇంకా ఏమీ అనలేకపోయాడు. అయినా ఎందుకేనా మంచిదని మొదటినుంచీ కలివిడిగా మాట్లాడడం మానేశాడు.

మాధవరావు హైదరాబాదులో చీఫ్ ఇంజనీరు ఇరిగేషను ఆఫీసులో అప్పర్ డివిజన్ గుమాస్తాగా ఉంటున్నాడు. మాధవరావు చెల్లెలు శాంతమ్మ విశాఖపట్నంలో కాపురం చేస్తోంది. శాంతమ్మ వయస్సు ముప్పది సంవత్సరాలు; ఆమె భర్త గోవిందరావు విశాఖపట్నం కలెక్టరాఫీసులో గుమాస్తాగా పని చేస్తున్నాడు అతని వయస్సు ముప్పయ్యైదు సంవత్సరాలు.

"అయితే మీ ఆడబడుచు మొగుడు, గోవిందరావు చాలా కలుపుగోరు మనిషి. స్నేహితులన్నా చుట్టాలన్నా చాలా అభిమానం చూపిస్తాడు ఇంతకూ ఆయన మన కేమీ దూరపుచుట్టం కాదులే. ఇప్పుడు నువ్వు మా అమ్మ తోటికోడలి మనుమరాలివి కదా. ఆయన మా అమ్మ పిన్నత్తగారికి స్వయానా వేలువిడిచిన మేనమామ మనుమడు !"

నరసమ్మకి అర్థం కాలేదు. అర్థం కాలేదంటే 'ఇప్పటివాళ్ళ కేమీ అర్థం కావమ్మా. చెప్పినా అర్థం కాదు.' అనేస్తాడని భయపడి అడగలేదు.

"ఇంతకూ చెప్పొచ్చే దేమంటే, మీ

---

వి. వి. ఎస్. రామదాసు




ఆడబడుచు శాంతమ్మ వాళ్ళ ఆయన తరపు చుట్టా లని అయినా మనుమల్ని తగినంత మర్యాద చేయడం లేదు,'' అన్నాడు శతగోపం.

''ఆవిడ గుణమే అంత'' అంది శరనమ్మ.

''బాగా చెప్పావమ్మా. ఇంతకూ విజయనగరం డివిజన్ ఆఫీసునుండి మా అబ్బాయి వెంకట్రావుకి విశాఖపట్నం బదిలీ అవడంవల్ల ఆవిడకి అలుసై పోయింది. ఏదో మనవా దొకడు విశాఖ పట్నంలో ఉన్నాడు కదా అని వాళ్ళ యింటికి వెళ్లాము. మా కోడలు సుంద రమ్మ మా అబ్బాయిని విడిచి ఒక క్షణం

అయినా ఉండలేదు. అందుచేత ఆవిడ బయలుదేరింది. కొడుకునీ కోడల్నీ చూడకుండా మీ పిన్నత్త సాంబారమ్మ ఉండలేదు కదా! అందుకని ఆవిడా బయలుదేరింది. ఇక వాళ్ళు ముగ్గురూ లేనిదే నేనొక్కడ్నీ విజయనగరంలో ఉండలేక నేనూ బయలుదేరాను."

"మంచి పని చేశావు మామయ్యా." అన్నది నరసమ్మ తన ఆడబడుచుకు వచ్చిన ఇబ్బందికి లోలోన సంతోషిస్తూ.

"మనుష్యు లంచరం వచ్చేసిన తరువాత సామాను వదిలేయడమెందుకు. అద్దె ఉండదుగ కని సామానుకూడా మన వాళ్ళింటికి తరలించాము."

"చాలా మంచిపని చేశావులే మామయ్యా!'' అన్నది నరసమ్మ మరింత సంతోషిస్తూ.

"సరేగాని నరసమ్మా! కాఫీ పెట్టు. ఆ చేత్తోటే కాస్త నెయ్యి వేసి రెండంటే రెండు పెసరట్లు వెయ్యి,'' అని పురమాయించాడు శఠగోపం.

కాఫీ నీళ్ళు పెట్టడానికి లేచింది నరసమ్మ.

* * *

శఠగోపాన్ని వదిలించుకోవడం ఎట్లాగాఅని మాధవరావుకి అర్థం కాని సమస్య అయింది.

చుట్టాలను మర్యాద చేయడం మాధవరావుకి తెలియక కాదు. చుట్టాల యింట్లో ఏ విధంగా మసలుకోవాలో కూడా మాధవరావుకి తెలుసు.

ఒకసారి మాధవరావు తిరుపతి మొక్కుబడి తీర్చుకోడానికి వెళ్ళితే, తన బావగారి అన్నగారు తిరుపతిరావు గారు అక్కడ ఉన్నారని తెలిసికూడా, ఆయన ఇంటి చిరునామా తెలిసినప్పటికీ యాత్రికుడుగా వెళ్ళాడు కాబట్టి దేవస్థాన సత్రంలోనే బసకోసం ప్రయత్నించాడు. ఆయన సామాన్లు దగ్గర నరసమ్మ నుంచి, ఎంక్వయిరీ ఆఫీసు దగ్గరకు వెళుతూఉండగా, దేవస్థానం ట్రాన్స్‌పోర్టులలో పనిచేస్తున్న తిరుపతి రావు ఆయన్ను చూసి, పలకరించి తన యింటికి రానందుకు ఎంతో నొచ్చుకున్నాడు.

తిరుపతిరావు వెంటనే వాళ్ళ సామాన్లను తన ఇంటికి మరలించాడు. వాళ్ళను ఎంతో ఆదరణతో ఇంటికి తీసుకొని వెళ్ళాడు. తిరుపతిరావు శెలవుపెట్టి, వాళ్ళ దగ్గర ఉండి, తిరుమలలో సౌకర్యంగా స్వామివారి దర్శనం అయేటట్లు చూడడమే కాకుండా, తిరుపతిలోని దేవాలయాలనూ, అలమేలు మంగాపురమూ, శ్రీ కాళహస్తీ, తిరుత్తినికూడా చూపించి తీసుకువచ్చాడు.

ఆయన కంటబడ్డ ఏ దగ్గర బంధువునైనా ఆయన ఆ విధముగా ఆదరిస్తాడు. అందుకనే ఆయనను బంధువులంతా 'చుట్టాల సురభి' అంటారు. అనగా




చుట్టాలకు కామధేనువువంటివా డనన్న మాట.

అయితే మాధవరావు చాలా మర్యాద తెలిసినవాడు. తిరుపతిరావుకి తనవల్ల భారం కాకుండా, కూరలు తెచ్చి పడేసేవాడు. ప్రయాణం ఖర్చులు, జట్కా, బస్సు వగైరా ఖర్చులు అందరికీ తానే పెట్టేవాడు. తిరుపతినుండి బయలుదేరి పోయేటప్పుడు తిరుపతికి పంచలచాపూ, ఆయన భార్యకి మంచి చీరా, పిల్లల చేతిలో పదిరూపాయలూ పెట్టి మరీ వచ్చాడు.

బంధుత్వం అనేది ఒక మృదువైన సంబంధం. ఆ మృదుత్వం నిలబెట్టుకోవాలి. లేకపోతే రసాభాసం అవుతుంది. అయితే మాధవరావుకిమల్లే, తిరుపతిరావుకిమల్లే, బంధువు లంతా ఉంటే అంతకంటే వేరే ఏం కావాలి? శఠగోపం వేరే తెగకు చెందినవాడు. ఆయన ప్రవర్తన ఎప్పుడూ వన్ వే ట్రాఫిక్కుని గుర్తుకు తెస్తుంది.

అసలే అది హైదరాబాదు; అందులోనూ అది సనత్‌నగర్ 'కాలనీ'; దానిలో ఒకే గది; వంటిల్లు ఉన్న ఇంట్లో ఉంటున్నాడు మాధవరావు.

"నరసమ్మా! చలికాలం బయట పడుకోలేనమ్మా. మీ రిద్దరూ మంచం ఉన్నవాళ్ల కాబట్టి వంటింట్లో సర్దుకుందురూ. నేను గదిలో పరుపు వేసుకుని పడుకుంటా. మరేం లేదు; వంటింట్లో వెచ్చగా ఉంటుంది కదూ! దాని వల్ల

పరుపు తడిసిపోతుందని," అన్నాడు శఠగోపం వచ్చినరోజు సాయంత్రమే.

కొళాయిలో నీళ్ళు ప్రొద్దున ఒక గంటా, సాయంత్రం ఒక గంటా మాత్రమే వస్తాయి.

"చూడు నరసమ్మా. నేను అర్జంటుగా ఊళ్లోకి వెళ్ళాలి. మీ ఆయన తొమ్మిదిన్నరకి కదా వెళ్ళేది. అందుచేత వేడినీళ్ళు ముందు నాకు తోర్లించమ్మా" అని పురమాయిస్తాడు శఠగోపం.

శఠగోపాన్ని వదిలించుకోవడం ఎట్లా అనేది మాధవరావుకి సమస్య అయి కూర్చుంది. శఠగోపంయొక్క కీర్తి సౌరభం, విశాఖపట్నంనుంచి గోవిందరావు వ్రాసిన లేఖలవల్ల అతని కంటే ముందే మాధవరావు ఇంటికి వ్యాపించింది. అందుకోసమే మొదటి నుండీ కాస్త జాగ్రత్తగా ఉండాలని శఠగోపం వచ్చినరోజు మరీ పెద్ద ఆదరణ చూపలేదు మాధవరావు.

"ఆయన అదో మోస్తరు మనిషి మామయ్యా." అని నరసమ్మ సర్దబోయింది.

అయితే నరసమ్మ సహాయం అవసరం లేకుండానే సర్దుకుపోగలడు శఠగోపం.

"నాకు తెలీదుటమ్మా," అన్నాడు శఠగోపం.

నరసమ్మతో ఒకసారి నెమ్మదిగా మాధవరావు "ఇంకా ఎన్నాళ్లుంటుంది మన నెత్తిమీ దీ శఠగోపం." అన్నాడు.

"గట్టిగా అరవకండి. మామయ్య వింటే ఏమైనా అనుకుంటాడు." అన్నది నరసమ్మ ముక్కుకొనమీద వేలు వేసుకుంటూ.

"బాగానే ఉంది. మన మేమైనా ధర్మసత్రం తెరిచామా. ఏమన్నా నా? ఇక్కడ ఈయనా, అక్కడ విశాఖపట్నంలో ఈయన కుటుంబం అంతా మా బావగారి ఇంట్లో నూ తిష్టవేసి కూర్చుంటే ఎలా భరించగలమే!"

"అబ్బ, నెమ్మదిగా మాట్లాడుదురూ, మామయ్య వింటాడు."

"వింటే విననీ. వినడానికే అంటున్నాను. విశాఖపట్నంలో వీళ్ళను వదిలించుకోలేక బావగారు చాలా కష్టపడుతున్నారు. జీతం చాలక జీ. పి. ఎఫ్. అడ్వాన్సుకూడా తెప్పించుకోవలసి వచ్చింది..."

"రాకరాక వచ్చిన బంధువులను గురించి ఏమీ అనకండి!" అంది నరసమ్మ చిన్నబుచ్చుకుంటూ.

తరువాత సంభాషణ కొనసాగిస్తే రోదనాస్త్రం ప్రయోగించబడుతుం దని మాధవరావుకి తెలుసు. అందుచేత ఇక భార్యతో ఏమి అన్నా లాభం లేదనుకున్నాడు మాధవరావు.

బట్టలు వేసుకుని విసురుగా ఆఫీసుకు పోయాడు మాధవరావు.




"పాపం చాలా చిరాకుగా ఉన్నాడు అబ్బాయి," అన్నాడు సావిట్లోఉన్న శఠగోపం తాపీగా.

"మా సంభాషణ విన్నావేంటి మామయ్యా?"

"నేనలా భార్యాభర్తల సంభాషణ వినను సుమా," అన్నాడు శఠగోపం.

మరునాటినుంచీ శఠగోపం కార్యక్రమం మార్చివేశాడు. ప్రొద్దున్నే స్నానంచేసి కాఫీత్రాగి బయటికి పోతాడు. మళ్ళీ మాధవరావు ఆఫీసుకి పోయిన తరువాత, అనగా సుమారు పదకొండు గంటలకి ఇంటికి వస్తాడు.

"మీ ఆయన వచ్చేవేళకు చాలా ఆలస్యం అవుతుంది. నాకా, ఇప్పుడు సాయంత్రమే పని ఉంటుంది. అందుచేత త్వరగా వంట కానిస్తే ఆరుగంటలకే భోజనం చేసిపోతాను. నీకుకూడా పని సుళువవుతుంది," అని పురమాయించి సాయంత్రం ఆరుగంటలకు భోజనం చేసి

బయలుదేరివోయి రాత్రి పదిగంటలకు వచ్చి నెమ్మదిగా తనకు సిద్ధంచేసి ఉంచిన పరుపుమీద పడుకుంటాడు.

"మీరు మజ్జిగ వేసుకుంటే వేసుకున్నారు; నాకుమాత్రం మధ్యాహ్నం కాస్త పెరుగు ఉంచండి," అని పురమాయిస్తాడు.

"మధ్యాహ్నం కాఫీలోకి ఏదయినా టిఫి నుండాలిసుమా. అదికూడా రోజూ ఒకటే అయితే ఏం బాగుంటుందీ! మార్చి మార్చి చేస్తూ ఉండాలి;" ఇది శఠగోపంగారి మరొక పురమాయింపు.

"సరేలే మామయ్యా!"

"అన్నట్టు చెప్పడం మరిచిపోయాను, నరసమ్మా! చెడ్డఅలవాటు నాకు. రాత్రి పడుకోబోయేముందు ఒకటో రెండో మినపసున్నిఉండలో లేక చేగోడీలో, కనీసం కారప్పూసయినాసరే ఏదో ఒకటి పరుపుప్రక్క చిన్న డబ్బాలో వేసి ఉంచుదూ. చప్పుడు లేకుండా తిని పడుకుంటా,'' ఇది మరొక పురమాయింపు.

"సరేలే మామయ్యా,'' అన్నది నరసమ్మ ఒకవంక మాధవరావు ఏమంటాడో నని భయపడుతూ.

"ఆ తరువాత కాస్త ఒకపావుశేరు వేడిపాలు ఫ్లాస్కులో పోసిఉంచితే సరిపోతుంది,'' అన్నాడు శఠగోపం.

ఈ పంపిణీమీద వ్యవహారం జరగడంవల్ల నెలరోజుల్లో మాధవరావు సేవింగ్స్ సగానికిసగం తరిగిపోయింది. నిర్ణీతపథకం ప్రకారం జీవితం గడపాలనుకున్న మాధవరావు ఆదర్శం ఆదర్శంగానే మిగిలిపోయే ప్రమాదం వచ్చింది.

ఎంత పథకాలు వేసుకున్నవారికైనా అనుకోకుండా వచ్చిపడే అవాంతరాలు కొన్ని ఉంటాయి. మాధవరావు పథకానికి శఠగోపం రాహువులా దాపురించాడు.

శఠగోపం గ్రహణంనుండి బయట పడడ మెట్లా అని మాధవరావు ఆలోచిస్తున్నాడు.

మాధవరావు లేనివేళల్లో ఇంట్లో నరసమ్మతో బాతాఖానీ వేస్తాడు శఠగోపం. నరసమ్మఆడబడుచు – శాంతమ్మ మీద విమర్శ చేస్తూఉండడమే ఆయన సంభాషణల సారాంశం. శఠగోపం ఏదయినా పురమాయించేముందు ఒక్క సారి శాంతమ్మమీద ఏమయినా చెబుతాడు.

"మీ ఆడబడుచు శాంతమ్మ ఇంటికి వచ్చిన బంధువులకు పనులు చెబుతుందమ్మా. ఏం అన్యాయమో చూడు,'' అంటాడు శఠగోపం.

"అవ్వ! బంధువులకు ఎవరైనా పనులు చెబుతారా?'' అని నోరు నొక్కుకుంటుంది నరసమ్మ.

"మా కోడలు – నరసమ్మకి మూడో నెల కదా. కడుపుతో ఉన్నదానికి ఎవరైనా పనులు చెబుతారా?''

"అయితే మామయ్యా! మీ కోడలి

పుట్టిల్లు ఏ వూ రన్నావు? వాళ్ళు ఎప్పుడు తీసుకువెళతారు?''

''రెండు నెలల్లో శ్రీకాకుళం తీసుకు వెడతా రనుకో. అయినా కోడలుపిల్ల మావాడ్ని వదిలి ఉండలేదు నరసమ్మా.

''ఎలాగూ రెండు నెలలలో వెళ్ళి పోయేదానికి, చూలాలికి పనులు చెబు తారా మామయ్యా!"

''నీలాంటివా ళ్ళయితే చెప్పరు నర సమ్మా! కాని మీ ఆడబడుచుశాంతమ్మది రాతి గుండె. అంత నిర్దయురాలు కాబట్టే ఆరు సంవత్సరాల నుంచీ కాపురం చేస్తున్నా యింకా పిల్లలు కలగలేదు,'' అన్నాడు శఠగోపం.

ఆ మాటకు నరసమ్మ మనస్సుకూడా చివుక్కుమంది. నిజానికి ముప్పయి ఏళ్ళ వయస్సున్న నరసమ్మకికూడా అయిదు సంవత్సరాలనుంచీ కాపురం చేస్తు న్నప్పటికీ పిల్లలులేరు. ఒకే పరిస్థితిమీద మనకు ఇష్టం ఉన్నవాళ్ళపట్ల ఒక విధముగానూ, ఇష్టం లేనివారిపట్ల మరొక విధముగానూ వ్యాఖ్యానించడం మన బల హీనత అనుకుంటాను.

నరసమ్మ ముఖం ముడుచుకోవడాన్ని గమనించిన శఠగోపం "నీకుకూడా పిల్లలు లేరని విచారిస్తున్నావు కదూ! నేను నిన్ను ఎందుకంటానమ్మా? నీకు వయస్సు ఏమంత ఎక్కువ. ఇంకా పాతి కేళ్ళు దాటాయో లేదో?"

నరసమ్మ ముఖం విప్పారింది. వయస్సుకి సంబంధించిన అబద్ధం ఎంత తీయగా ఉంటుంది!

"అవునవును," అంది నరసమ్మ.

"అందుకని ఈ ఏడాది కాకపోతే వచ్చే ఏడాదికైనా నీకు పిల్లలు పుట్టడం ఖాయం. కాని నరసమ్మలాంటి కఠినసు రాలికి గొడ్రాలితనం తప్పదు. నా మాట నమ్ము."

"పెద్దవాడివి, నీ ఆశీర్వచనం ఫలిం చక పోతుందా," అన్నది నరసమ్మ తనకు సంబంధించినంతవరకు.

''మీ ఆడబడుచు శాంతమ్మ ఎంత కుళ్ళుబోతుదో చూడు. బంధువుల్ని తీసు కుని వెళ్ళవలసివస్తుందికదా అని గత రెండు నెలలూ సినీమాకి వెళ్ళడం మానేసింది."

''పోనీ,డబ్బులేదేమోమామయ్యా!'' అంది నరసమ్మ. ఎవరికైనా, మరీ అన్యాయంగా విమర్శిస్తే విసుగు వస్తుంది.

"అదుగో, ఆడబడుచుని వెనకేసు కొస్తున్నావు. డబ్బు లేకేం. శాంతమ్మ మొగుడు గోవిందరావు జి.పి.ఎఫ్. అడ్వాన్సు తెప్పించుకున్నాడుకదా. అది చేతిలో ఆడుతూనే ఉంది. డబ్బు లేదంటే ఎవరు వమ్ముతారు?''

"ఆవిడ అంతేలే మామయ్యా!"

"అంతేకాదు. మీ పిన్నత్త (అనగా నా భార్య) నాంచారమ్మ పెద్దది కదా! ఆవిడచేత పని చేయిస్తుంది. మీ ఆడ బడుచుశాంతమ్మ ఫైట్టే బాధ పడలేకనే

వాళ్ళ అత్తగారు తన పెద్దకొడుకైన తిరుపతిరావుదగ్గర ఉంటున్నదికదా!"

"పెద్దవాళ్ళచేత పనులు చేయించడమా. నేను కాపురానికి వచ్చిన ఏడాదిలోనే మా అత్తా మామలు పోయారుగాని. నే నెప్పుడైనా వాళ్ళచేత పనులు చేయించానా ?'

"ను వ్వెందుకు చేయిస్తావు? అయితే మా ఆవిడ చాలా మొండిఘటంలే. అలా తేలికగా పనులు చేయదు. ఆవిడ ధాటి కోర్వలేక మీ ఆడబడుచే చేసుకుంటుంది."

"ఎవరి కోసం చేసుకుంటుంది మామయ్యా! ఆ మాత్రం బంధుమర్యాద లేకపోతే ఎట్లా ?''

"వరహాల విలువచేసే మాట చెప్పావమ్మా. నీకు తప్పకుండా వచ్చే ఏడాదికి కొడుకు పుడతాడు. అది సరేగాని కాఫీలోకి కాస్త ఉల్లిపాయల ఉప్మా చేద్దూ, సరసమ్మా!'' అని పురమాయించాడు శఠగోపం.

ఈ విధముగా మరొక నెల గడిచింది. మాధవరావు సేవింగ్సు పూర్తిగా ఖర్చయిపోయాయి.

దిగులుగా మాధవరావు ఆఫీసుకి వెళ్ళివస్తూ ఉన్నాడు.

ఒకనాడు మధ్యాహ్నం కేంటీనులో కాఫీ త్రాగుతూఉండగా మాధవరావు చిన్ననాటి స్నేహితుడు ఆనందరావు. "హలో మాధవరావు! నీకోసమనే చూస్తున్నానయ్యా,'' అంటూ పలకరించాడు

"ఎప్పుడు వచ్చావు విశాఖపట్నం నుంచి ? వాల్తేరు సర్కిలు విశేషాలు ఏమిటి ?"

"ప్రొద్దున్నే వచ్చాను. మా తమ్ముడొకడు సివిల్ ఇంజనీరింగు బి. ఇ. పాసయ్యాడు. వాడి పోస్టింగు మా సర్కిలులో వేయించుకుందామని ఇక్కడికి వచ్చాను."

"అవును మరి, నువ్వు ఎస్టాబ్లిష్మెంటు సెక్షనులో ఉన్నావు కదా! అతనిని విశాఖపట్నంలోనే ఉంచుకోవచ్చు ననే కదా ?"

"అవును."

"సరేకాని, నీ పని చూసుకుని సాయంత్రం అయిదుగంటలకి కనిపించు; నీతో చెప్పుకుని ఏడ్వవలసిన సమస్యలున్నాయి.''

"సరేలేవయ్యా, అలాగే ఏడుద్దువుగాని," అన్నాడు ఆనందరావు హాస్యధోరణిలో.

ఆనాటి సాయంత్రం స్నేహితులిద్దరూ తాజమహల్ హోటల్లో కాఫీ త్రాగి హుసేన్‌సాగర్ చెరువుగట్టుమీద కూర్చున్నారు.

"నే నొక బంధుబాధితుడ్ని; వరద బాధితులు, అగ్నిబాధితులు అయితే నివారణోపాయాలు వెదుకుతారు. వారి సహాయార్థం నాటకాలు ఆడతారు. నిధులు




సేకరిస్తారు. కాని బంధుబాధితులకు కూడా ఏదయినా సాయం చేయాలి," అన్నాడు మాధవరావు ఉపోద్ఘాతంగా.

"ఇంత పిసినారితనం ఉండకూడదయ్యా. మనది అతిధిసత్కారానికి, బంధుమర్యాదలకి పేరుపొందిన భారత దేశం. మన తెలుగుకవులు నాచన సోముడూ, గౌరనా, తెనాలి రామకృష్ణుడూ బంధుమర్యాదను ఎంతో మెచ్చుకుని 'చుట్టాల సురభి' గురించి వారి గ్రంథాలలో వ్రాశారు. మరిచి పోయావా ?''

"మొత్తంమీద తెలుగు బి. ఏ. అనిపించుకున్నావులే. బంధుమర్యాద కూడదని నేను అనడంలేదు. కాని, దానికికూడా హద్దు లున్నాయి. మా ఇంటికి ఒక మహానుభావుడు వచ్చాడు. 'చుట్టమై చూడవచ్చి దయ్యమై పట్టుకున్నాడు' అన్న సామెత ఉండనే ఉంది కదా!" అని శతగోపోపాఖ్యానం వినిపించాడు మాధవరావు.

అంతా విన్న ఆనందరావు, "సారీ బ్రదర్, నిన్ను చూస్తే జాలివేస్తున్నది. అయితే నీకంటె గట్టి చిక్కులో ఉన్నాడు మీ బావ గోవిందరావుగారు. నువ్వు ఒక్క మనిషితోనే వేగలేక పోతున్నావ్. ఆయనపాలిట ముగ్గురు దాపురించారు. చెల్లాయి శాంతమ్మ ఎలా బాధపడుతున్నదో!" అన్నాడు.

"దీనికి పరిష్కారమార్గం వెదుకుదూ, నీకు పుణ్యం ఉంటుంది.''

"పుణ్యం మాట ఎలా ఉన్నా, ముందు బుర్ర పనిచేయడము లేదు," అన్నాడు ఆనందరావు.

కాస్సేపు ఇద్దరూ మౌనంగా కూర్చు న్నారు.

"ఒక పని చెయ్యకూడదూ! వెంటనే నీ భార్యను పుట్టింటికి పంపించెయ్యి." అన్నాడు ఆనందరావు.

''అవును సుమా! నాకు తట్టనేలేదు. కాని, దీనివల్ల శఠగోపాన్ని వదిలించు కోవచ్చుననుకో; కాని మా బావ గోవింద రావుగారి సమస్య ఎట్లా పరిష్కారం అవుతుంది ?"

''దాన్ని గురించికూడా ఆలోచించు దాము. అప్పుడే తొందరపడి నీ భార్యను పంపించేయకు; రెండు సమస్యలకూ కలిపి ఒకటే పరిష్కారం ఏదయినా ఉందేమో ఆలోచిద్దాం.''

"ఇక ఇంటికి పోదామా?" అంటూ మాధవరావు లేచాడు.

''నే నెందుకులే. నేను హోటలుకి పోతాను.'' అని ఆనందరావుకూడా లేచాడు.

మరునాడు సాయంత్రం ఆనందరావు విశాఖపట్నం వెళ్ళిపోయాడు.

ఒక వారం రోజులు గడిచాయి. ఆనందరావు దగ్గరనుంచి ఉత్తరం లేదు. ఆనందరావు మరిచిపోయాడేమో! 'అతనికి జ్ఞాపకం చేస్తూ ఉత్తరం వ్రాస్తేనో' అనుకున్నాడు మాధవరావు. అయినా మరొకరోజు చూద్దా మనుకుని ఆఫీసుకి వెళ్ళాడు.

పదకొండు గంటలకల్లా శఠగోపం మామూలుగా వచ్చి భోజనం చేసి వాలు కుర్చీలో కూర్చున్నాడు.

"మీ ఆడబడుచు శాంతమ్మ వీరా చరణవల్లనే ఇక్కడ ఉండిపోవలసి వచ్చిందమ్మా! ఎంత విధిలేని పరిస్థితులు వచ్చినా, మర్యాదా, ఆదరణా లేనిఇంటిలో ఎలా ఉండగలను, నరసమ్మా!'' అన్నాడు శఠగోపం.

"ఏమిటో నువ్వు అభిమానించి అలా అంటున్నావుగాని, నేను మాత్రం ఏమి చేస్తున్నాను మామయ్యా!'' అన్నది నరసమ్మ.

ఇంతలో పోస్టుమేన్ వచ్చి శఠ గోపంగారి కొకకార్డు ఇచ్చాడు. ఉత్తరం చదివిన శఠగోపం మందహాసం చేస్తూ "ఇన్నాళ్ళకు మా కష్టాలు తీరాయమ్మా!" అన్నాడు.

''ఏమిటి విశేషం, మామయ్యా!"

''మా అబ్బాయి వెంకట్రావుకి శ్రీకా కుళం బదిలీ అయిందిటమ్మా. వెంటనే రమ్మని వ్రాశాడు.''

"శ్రీకాకుళం అంటే మీకోడలు సుంద రమ్మ పుట్టింటి ఊరే కదు మామయ్యా!''

''అవును నరసమ్మా. ఏకంగా సామాను తీసుకునిపోతాము. ఈమాత్రం దానికి మీ ఆడబడుచు శాంతమ్మ మాట దక్కించుకుంది కాదు. పట్టుమని పది నెలలైనా వాళ్ళ ఇంట్లో లేము మేము."

''ఆవిడ గుణాలు ఎవరికి తెలీదు మామయ్యా!''

''అంతేలే అమ్మా! అది సరేకాని ఈరోజే సాయంకాలం ఎక్స్‌ప్రెస్సుకి వెడతాను. దార్లో తినడానికి మంచి ఉల్లిఉప్మా చేద్దూ; మళ్ళీ ఎన్నాళ్ళకి తింటానో నీ చేతిపాకం!'

"దానికేం భాగ్యం మామయ్యా! కాని ఈరోజునే వెళ్లాలా? ఆయన వచ్చాక, ఆయనతో చెప్పి పోవచ్చులే."

''అలాకాదు నరసమ్మా! నేను సాయంత్రంబండికే వెళ్ళాలి. అయినా నీతో చెబితే ఒకటీ, మాధరావుతో చెబితే ఒకటీనా?''

"సరే నీ ఇష్టం మామయ్యా!'' అని నరసమ్మ ఉప్మా తయారు చేసే ప్రయత్నంలో పడింది.

మూడుగంటలకి టిఫిను తిని రిక్షావాడిని పిలిచాడు శఠగోపం. శఠగోపం రిక్షా ఎక్కుతూ ఉండగా నరసమ్మ, "ఆయన అన్నమాటలను నువ్వేమీ మనసులో పెట్టుకోకు మామయ్యా!" అంది.

''నాకా పట్టింపు లేవీ లేవమ్మా! ఇంతకూ మాధవరావు మనసు మంచిదని నాకు తెలీదా. ఇక వెళ్ళొస్తాను, నరసమ్మా!''అన్నాడు రిక్షాలో కూర్చున్న శఠగోపం.

రిక్షా కదిలింది.

మామూలుగా ఇంటికి వచ్చిన మాధవరావుకు జరిగిన సంగతులన్నీ నరసమ్మ చెప్పి "మీతో చెప్పి వెళ్ళమన్నాను సుమండీ. అయినా విన్నాడు కాదు శఠగోపం మామయ్య," అన్నది.

"పరవాలేదులే. ఇప్పుడే వస్తాను తలుపేసుకో" అన్నాడు, మాధవరావు ఆనందోద్రేకాన్ని అణచుకుంటూ.

"అయ్యో, భోజనం చేయకుండా వెడతారేమిటండీ. ఇంకా రైలు ఉంటుందనుకుంటున్నారా?" అంది నరసమ్మ; మాధవరావు సికిందరాబాదు స్టేషనుకి వెడుతున్నాడనుకుని.

అయితే మాధవరావు రైలుస్టేషనుకి వెళ్ళలేదు. టెలిగ్రాఫ్ ఆఫీసుకి వెళ్ళి విశాఖపట్నంలో ఉన్న ఆనందరావుకి "థాంక్స్" అని ఒకే ఒకమాట టెలిగ్రాం ఇచ్చాడు.









నాకు మొదటి మనుమరాలు కలిగింది! ఆవిడను చూడటానికే దూర ప్రయాణం కట్టాను నేను.

మనుమరాలు కలిగిందన్న కబురు వినగానే నాకు ఏమేమి మనోభావాలు గలిగినాయో ఇక్కడ నేను వర్ణించను. 15 ఏళ్ళు అయినాక నా మనుమరాలు పదిహేనుఏళ్ళ దవుతుంది; ఇక పెళ్ళి...ఇలాంటి వెన్నో!

నేను రైలులో సగందూరం వచ్చేశాను. ఇంకా సగందూరం బాకీ. ఒక పెద్ద స్టేషనులో బండి ఆగింది. బహుశా నేను కొత్తగా ఈ ప్రపంచంలో దిగిన మనుమరాలు గురించి ఆలోచిస్తూ తన్మయుడనై ఉన్నాను. ఇంతలో ఎదురు ప్లాట్ ఫారం మీదికి బండివచ్చి ఆగటమూ, ఆ చప్పుడుకు నేను లేవటమూ జరిగింది.

రెండు బళ్ళకూ మధ్య గజంన్నర ఎడం వుంటుంది. నేను కిటికీలోనుంచి ముఖం బయటికి పెట్టి చూడగానే, ఎదురు బండిలో కిటికీ దగ్గర కూర్చుని ఒక స్త్రీ కనిపించింది; నలభై యేళ్ళ వయస్సు ఉంటుంది. బొద్దుగా ఉంది. కాని ముఖాన మాత్రం ఇంకా యవ్వన చిహ్నాలు కొద్దిగా కనిపిస్తూనే ఉన్నాయి. ఇంకా ఆ బండిలో నలుగురైదుగురు స్త్రీలు ఉన్నారు. కాని వారు నాకు సరిగా కనిపించటంలేదు. నేను ఆ స్త్రీవంకనే కళ్ళు బాగా విప్పుకుని చూస్తూ ఉండిపోయాను.

ఆవిడ మొదట ముఖం తిప్పుకున్నది; కాని మళ్ళీ రెట్టింపు ఉత్సాహంతో నావంక చూడ నారంభించింది. ఈ వడి ప్రాయంలో అపరిచితులైనటువంటి మేమిద్దరమూ ఒకరివంక ఒకరం చూడ నారంభించాము. కాని—మేము నిజంగా అపరిచితులమేనా? ఆవిడ పెదవులు కొంచెం తెరుచుకున్నాయి. ఆవిడ ముందు పళ్ళు రెండూ ఒక దానిమీదికి ఒకటి ఎక్కి ఉన్నాయి.

పదిహేను సంవత్సరాలనుంచి మూసుకుని ఉన్న తలుపు హఠాత్తుగా తెరుచుకుంది. ఒక్కమాటుగా ఎన్నో సంగతులు ఒకటి నొకటి తోసుకుంటూ నోటినుంచి బయటికి రాబోయినై. కాని ఒక్కటీ

బయటికి రాలేకపోయింది. అంతలో బండి ఒక్కమాటు నన్ను కుదిలించి బయలుదేరింది

ఒక్క క్షణకాలం నేనలాగే స్థాణువు లాగా వుండిపోయాను. ఆ తర్వాత కిటికీలోనించి తల బయటికి పెట్టి బిగ్గరగా 'రహస్యం' అని కేక వేశాను?

ఆవిడ అప్పటికి చాలా దూరాన పడిపోయింది; ఆవిడ పైటచెరుగు నెత్తి మీదికి లాక్కుని నవ్వింది. ఆ తర్వాత సంకేతసూచకంగా తర్జని పెదవిమీద పెట్టుకుంది. నాకు ఇరవై అయిదు సంవత్సరాల క్రిందట ఒకనాడు జరిగిన ఘటన కళ్ళముందు కట్టినట్టు అయింది. ఈ నవ్వూ, ఈ సంకేతంలోని మర్మం మా యిద్దరికీ తప్ప ఈ ప్రపంచంలో మరొకరికి తెలియదు.



రహస్యము : ఒక యువకుడూ, ఒక అపరిచిత యువతీ నిర్జనస్థలంలో ఒకరి రహస్యాలు ఒకరికి చెప్పుకున్నారు. అది అవినీతికరమైనది కాదు; తెలిస్తే పోలీసులు పట్టుకువెళ్ళేది కాదు. అయినా అది రహస్యమే! పాతిక శతాబ్దంనించి ఈ మాట హృదయంలో దాచిపెట్టాను; ఈ ఇహజీవితంలో నాకు ఎక్కువ దగ్గర సంబంధంవున్న స్త్రీతోకూడా, ఈ విషయము బయటపెట్టలేదు. పాఠకులు 'ఏమిటబ్బా అంత రహస్యము!' అని అనుకోవచ్చు. కాని నేను చెప్పను. 'ఐతే దానిలో ఫలుషా తీపి కలిసిన కౌతుకరసం ఉండివుండవచ్చును; లేదా, అందులో అర్థమే లేనటువంటి యౌవన

చాపల్యం ఉండివుండవచ్చును. అయినా నేను చెప్పలేను. ఇంకా నా నమ్మకం ఏమిటంటే...ఈ రహస్యం దాచటంలో సగం బాధ్యత ఉన్న ఆమె – తళుక్కున మెరిసి, ఇప్పుడే మాయమైపోయిన ఆమె, ఈ జన్మలో మళ్ళీ నాకు కనిపించక పోవచ్చు. ఆమె — బహుశా ఆవిడకూడా అందరిదగ్గరా ఈ రహస్యం దాచిఉంటుంది; ఈ ఇహజీవితంలో అందరికంటే ఎక్కువ దగ్గర సంబంధం ఉన్న పురుషుడికికూడా ఈ రహస్యం చెప్పిఉండదు.

ఒక్క క్షణం క్రితం ఎంతో దూరాన ఉన్న భవిష్యత్తును చూస్తూ ఉంది. ఇప్పుడో, అంతకంటేదూరాన ఎప్పుడో గతించిపోయిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉంది! ఎంత ఆశ్చర్యమయింది, ఈ మనస్సు! కేవలం గతమూ, భవిష్యత్తుతో నేనా దీని అస్తిత్వం? ఐనా వర్తమానం ఎంత? స్మృతికీ కోరికకూ మధ్యను వేగంగా పరిగెత్తుతున్నటువంటి ఒక బిందువు: దాన్ని పట్టుకుని ఆపటానికి వీలులేదు; పాదరసపు బొట్టులాగా చేతిలోనించి జారిపోతుంది! వేగంగా పరుగెత్తుతున్న రైలు కిటికీలోనించి మనకు కనపడుతున్న దృశ్యం ఎంతత్వరలో మాయమైపోతుంది? అదే వర్తమానం!

నా మనమరాలు పదిహేనేళ్ళ పిల్ల అయినాక నా అతిరహస్యం చెప్పేదా ఏమిటి?—ఊహూ, చెప్పగూడదు! అతీతంలో జరిగిన ఈ మామూలు మాట భవిష్యత్తులో వెల్లడి కానేకూడదు. అప్పుడే మా రహస్యానికి చరితార్థత ఉంది.

* * *

ఆచోటు జనసంచారానికి పదిపన్నెండు మైళ్ళ దూరాన ఉంది. అక్కడ కొండలు ఉన్నై, శిథిలాలు ఉన్నై, కలకల ధ్వనులతో ప్రవహించే సెలఏరు ఉంది— ఇంకా కునికిపాట్లు పడుతూఉన్న నిస్తబ్దత కూడా ఉంది. ఫాల్గునమాసపు ప్రారంభ దినాలలో అంత ఎండగా లేని ఒకనాటి మధ్యాహ్నాన నేను సైకిలు వేసుకుని అటు వెళ్ళాను.

ఆచోటు నాకు చాలా బాగావుంది. పని ఎక్కువగా చేసి బడలిన ముసలిది, సంసారపు పనులన్నీ కట్టిపెట్టి ఏకాంతంగా కూర్చుని కునికిపాట్లు పడుతున్నదో అన్నట్లుగా ఉంది; ఇక ఆవిడకు చేసే పనులేవీ లేవు; చేయాలనే కోరిక కూడాలేదు. ఆవిడకు స్వప్నాలలో మాత్రం పూర్వస్మృతి ఏదో ఛాయలాగా కనిపిస్తూఉండేది. అక్కడ పడి పగిలిపోయిన విగ్రహాలమీదుగా ఎరకోసం బయలుదేరిన తొండలు జర్రున పోతోఉంటే, అప్పుడప్పుడూ ముసలిది అటూఇటూ కదిలేది...

కాని ఆవాళ నాకు ఈ ఐతిహాసిక కల్పన బాగాఉండలేదు. అందులో



నా కేమీ రసం చిక్కలేదు. కారణం ఏమిటంటే రెండు కోయిలలు ఆ శిథిలాలలో రెండువైపులనించి, కనపడకుండాఉండి, తర్కయుద్ధం చేస్తున్నై. అందులో ఒకదానికంఠం కొంచెం కటువుగా ఉంది. రెండోదానిస్వరం వ్యంగ్యాత్మకంగా ఉంది. రెండోది ఎంత మృదువుగా వెక్కిరిస్తున్నదో మొదటిది అంత విజృంభించి తొందరగా జవాబిస్తున్నది. ఈ తర్కం ఎందుకు జరుగుతున్నదో నాకు అర్థంకాలేదు; కాని నాకుమాత్రం ఒకటి తోచింది; ఈ ముసలిది ప్రపంచంలో తనపని అయిపోయిందని ఎంత కునికిపాట్లు పడినప్పటికీ ఈ ప్రపంచంలోని వసంతమూ కోకిలటూ ఎక్కడికీ పోవు ; అని.

వాటితర్కం అక్కడి కక్కడికీ తీవ్రత దాలుస్తూఉంది. హఠాత్తుగా నేను ఒకమాటు పడిపోయిన గుడిప్రక్కకు వచ్చి చూశాను—వ్యంగ్యంగా అనుకరిస్తున్నది కోకిలకాదు—పిల్ల. నన్ను చూస్తేనే ఆమె 'కూ' అంటున్న దల్లా మధ్యలో ఆపింది.

ఆ పిల్ల గుడిగోడకు ఆనుకొని కాళ్లు చాపి కూర్చునిఉంది. నావంక ఒక్క క్షణం విస్తుపోయి చూచింది; ఆ తర్వాత —"ఎక్కడినించి వచ్చారు మీరూ?" అని అడిగింది.

నేనూ తక్కువ ఆశ్చర్యపడలేదు. ఆ పిల్లకు పదహారు పదిహేడు ఏళ్ళు ఉంటాయి. సన్నగా, సుకుమారంగా ఉంది—కమ్మనిగొంతు; కోకిలను అలాగే అనుకరించగలిగిన గొంతును గురించి ఎక్కువ చెప్పటం కూడా అనవసరం.

"నువ్వు కోకిల అనుకున్నాను!" అన్నాను.

ఆ పిల్ల నవ్వింది. ఆవిడ ముందు పళ్ళు రెండూ ఒకదానిమీద ఒకటి ఎక్కి ఉండటం గమనించాను.

"ఆ రెండో కోకిల మీరేకదూ!" అన్నది మృదువుగా.

అసలు నిజమైన కోకిల రెండోవైపు నించి చప్పుడు రాకపోవటంవల్ల కాసేపు ఆగింది. ఇప్పుడు రెట్టింపు ఉత్సాహంతో గెలిచాననే గర్వంతో 'కూఊ, కూఊ!' అని బాగా సాగదీసింది.

మేమిద్దరం ఒక్కమాటుగా నవ్వాము.

ఆ తర్వాత స్నేహం కావటానికి ఎక్కువసేపు పట్టలేదు. అంత త్వరలో అంత స్నేహం ఎలా కలిసిందా అని ఇప్పుడు అనుకుంటూ ఉంటాను. ఇది యూరోపు కాదు—కనీసం అప్పటికి కాలేదు. పరాయి యువతితో ఒంటరిగా మాట్లాడే అలవాటుకూడా లేదు. ఐనా నేను ఏమీ వెనుకా ముందు చూడలేదు. మామూలు బాల బాలికలు కాసేపట్లో స్నేహం కలుపుకుని ఎలా ఒకటి అయిపోతారో, అలాగే మేమూ కలిసిపోయాము. ఆ పిల్ల పేరు గంగ—పుట్టింటి పరివారంతోపాటు అక్కడికి చూడటానికి వచ్చిందట; మిగలావాళ్ళంతా రెండు మైళ్ళ దూరంలో ఉన్న శిథిలాలు చూడటానికి వెళ్ళారుట. గంగమాత్రం, కాళ్ళు నొప్పులు పుట్టేటట్టు, వృథాగా తిరిగేకంటే ఇక్కడే కూర్చుని కోయిలతో పోట్లాట పెట్టుకోవటం మంచిదనుకున్నదట — ఈ సంగతులన్నీ మాకు పరిచయం అయిన మొదట్లోనే తెలుసుకున్నాను. ఇక నా పరిచయం తెలియజేయటంలోకూడా నేనేమీ లోభించలేదు.

ఆనాడు వసంతవాయువు మా యిద్దర్నీ తన వేడికౌగిటిలో బిగించి వేసింది. కోకిల కూయనే కూసింది. అప్పుడే పుట్టిన సీతాకోకచిలుకలుకూడా కొన్ని మా చుట్టూ ఎగిరినై. ఐనా వసంతసఖుడు, మన్మథుడు, మా దగ్గరికే చేరలేదు—వసంతుడు మమ్మల్ని ఎంత జయించినప్పటికీ! ఈ సంగతి తలుచుకుంటే ఇప్పటికీ నా కెంతో ఆనందంగా ఉంటుంది. మన స్వర్గంలో 'కౌతుక' దేవత ఉన్నాడో లేడో తెలియదు. ఉంటే మాత్రం ఆనాటి మా ఈ ఉపాసనయజ్ఞానికి అతనే పౌరోహిత్యం వహించి ఉంటాడు.

ఇద్దరమూ పరుగులు తీశాము; దాగుడుమూత లాడాము; సెలయేరు

వొడ్డున ప్రక్కప్రక్కనే మోకాళ్ళమీద కూర్చుని దోసిళ్ళతో నీళ్ళు త్రాగాము. ఇంత చల్లటి రుచికరమైన నీరు నేనెప్పుడూ త్రాగలేదు. ఆ రుచి ఇంకా ఈనాటివరకూ నా నోటిలో ఉన్నట్టుగానే ఉన్నది.

క్రమంగా మేము ఒకరికొకరం సెలవు తీసుకోవలసిన సమయం కూడా వచ్చేసింది. "మీరు అప్పుడే వెళ్ళిపోతారా?" అన్నది గంగ.

"ఆం. దూరానమాటలు వినిపిస్తున్నై. వారొచ్చిపడకముందే నేను వెళ్ళిపోతాను. అలా కాకపోతే ఇలాంటి పరిశుభ్రమైన రోజుమీద మచ్చలు పడతై — సరే, వెళ్తున్నాను."

అని నిష్కపటమైన స్నేహంతో ఆ అమ్మాయివేపు చేయి చాచాను. ఆ పిల్ల నా చేతిని తన రెండు చేతులతో తీసుకుని నా ముఖంవంక చూసింది.

"ఇక మళ్ళీ ఎప్పుడూ మనం కలుసుకోమా ?"

"నమ్మకంలేదు—ఐనా అదే మంచిదేమో."

"నిజమే. కాని ఈనాటి సంగతి మాత్రం చాలా కాలంవరకు జ్ఞాపకం ఉంటుంది."

హఠాత్తుగా నా బుర్రలోకి ఒక సంగతి వచ్చింది;

"అయితే రా, ఒకపనిచేదాము. అలా అయితేఒకరినొకరం మరచిపోము. నేను నా రహస్యం ఒకటి నీకు చెప్పుతాను; నీవు నీ రహస్యం ఒకటి నాకు చెప్పు. మన ఇద్దరం ఒట్టు వేసుకుందాము. అవి మన జీవితంలో ఎవ్వరమూ ఎవ్వరికీ వెల్లడించకూడదు."

గంగ ఒక్కక్షణం ఆలోచించింది. ఆ ఆలోచనకే ఆమె కళ్ళు మెరిసినై. "సరే" అన్నది.

నేను ఆమె చెవిదగ్గర నోటిపెట్టి నా అతిరహస్యం చెప్పివేశాను — విని ఆమె చకితురాలై, కౌతుకంగా నా వంక చూసింది. ఆ తరువాత మందహాసం చేసి, సిగ్గుపడుతూ తన అతిరహస్యం నా చెవిని వేసింది.

ఆపైన నుంచునేదండి; నేను బయలుదేరి వచ్చాశాను. కొంచెందూరం వచ్చిన తర్వాత ఒక్కమాటు తిరిగిచూశాను. ఆపిల్ల చిరునవ్వు నవ్వి పెదవిమీద వేలు పెట్టుకుంది.



# స్త్రీ హృదయము

అర్ధరాత్రి :

దోమతెరలో పండుకుని శ్రీమతి సునంద మాసపత్రిక చదవటంలో నిమగ్నమైంది. ఆమె ప్రక్కనే శ్రీయుత తమాలకాంతుడు దిండు కావలించుకుని గుర్రు పెడుతున్నాడు. చెప్పటం అనవసరం, అయినా వీళ్ళు భార్యాభర్తలు. ఒక సంవత్సరం అయింది వివాహం అయి: ఇంకా సంతానం లేదు.

సునంద ప్రతిరోజూ ఇంతే—అంటే పండుకోబోయేముందు బెంగాలీ పుస్తకమో పత్రికో తీసుకుని తలదగ్గర దీపం పెట్టుకుని నిద్రమత్తుతో వున్న కళ్ళతో చదువుతూ వుంటుంది. తమాలకాంతుడు రోజూ ఇదే విధంగా, నిశ్చింతగా నిద్రపోతాడు.

మాసపత్రిక పేజీలు తిరగవేస్తూ వుండగా, 'కథ కాదు!' అనే కథ ఒకటి హఠాత్తుగా కనిపించింది. పేరు చాలా చిత్రంగా వుంది. కథకుని పేరు లేదు. సునంద చదవనారంభించింది. చదువుతూ వుండగానే సునంద మనస్సు నిర్మల అనే పిల్లకోసం వ్యాకులపడటం మొదలు పెట్టింది. విశ్వనాధుడనే కుర్రవాడిమీద సునందకు మొదట కోపం వచ్చింది. కాని అది ఎక్కువసేపు నిలవలేదు. విశ్వనాధుడు సెలవు తీసుకుంటూ నిర్మల రెండుచేతులూ పట్టుకుని భోరున ఏడ్చే వరకు సునంద కోపంకూడా నీరయింది. విశ్వనాధుడికి నిర్మల దక్కలేదు. కాదంబిని నెత్తిన పడింది.

కథ క్లుప్తంగా అది :

విశ్వనాధుడనే పేరుగల యువకుడు ఎండాకాలపు సెలవల్లో మేనమామగారింటికి వస్తాడు. అక్కడ చేసే పని ఏమీ లేకపోవటం మూలాన చెరువు వొడ్డుకు పోయి తిష్ఠవేస్తాడు. ఉద్దేశం చేపలు పట్టాలని. ఒక రోజల్లా బెండువంక చూసి చూసి కళ్ళు చీకట్లు కమ్ముతూ ఉండే స్థితిలో ఒక ఘటన జరిగింది. బెండు మునగటమూ విశ్వనాధుడు విసురుగా లాగడమూ, 'అమ్మో—బాబో!' అనే కేకా ఒక్కమాటు జరిగినై.

విశ్వనాధుడు చకితుడై వెనక్కు

వనఫూల్

చూశాడు—గాలం ఒక పిల్ల చీరెకు తగులు కుంది. ఆ పిల్లే నిర్మల అని చెప్పటం కూడా అనవసరం.

ఇదే ప్రారంభం.

ఆ తర్వాత అశ్లీలత లేకుండా ఎన్ని విధాల ప్రేమాలాపాలు జరగవచ్చో అవన్నీ జరిగినై. ఇంకా జరిగేవికూడా, విశ్వనాధుడి మేనమామ గనక రంగ స్థలం మీదికి రాకపోతే. మామగారు ఈ వాగుడు అంతా యౌవ్వన చాంచల్యమని ఒక నవ్వుతో తోసిపారవేశాడు. పైగా కాదంబినిని ఇతనిమీద ప్రయోగించాడు.

విశ్వనాధుడు మొదట చాలా ఎదురు తిరిగాడు. కాని పాపం, అతను ఒక్కడే ఏమిచేయగలడు? మహాఅయితే అతను వాళ్ళ మామను ఎదిరించగలడు? కాని సమాజాన్నంతనూ తిరస్కరించటం అత నికి సాధ్యమా? విశ్వనాధుడు బ్రాహ్మడు—నిర్మల కాయస్థ కన్య. అంచేత అతను నిర్మల రెండు చేతులూ పట్టుకుని ఏడవటం తప్ప ఇంకేమీ చేయలేకపోయాడు.

కథ ఫకడ్‌గావుంది. నిర్మలకోసం సునంద చాలా బాధపడసాగింది. దీపం ఆర్పి సునంద పడుకున్నప్పుడు నిర్మల కోసం ఆమె కంట్లో ఒక నీటిబొట్టు కన పడింది. హృదయంలేని సమాజం.

ఆ మర్నాటి సాయంత్రం తమాల కాంతుడు ఆఫీసునుంచి తిరిగి వచ్చే వరకు వ్యవహారమంతా పెడతిరిగివుంది. పాపం, అతను 'డెయిలీ పాసెంజరు;' ఉదయం లేవగానే స్నానం భోజనం చేసి 8_47 గంటల 'లోకల్'లో ఆఫీసుకు వెళ్తాడు: సాయంత్రం 7_42 'లోకల్'లో తిరిగివస్తాడు.

సునందలో ఇలాంటిమార్పు అతను ఎప్పుడూ చూడలేదు. మొహం కుంపటి లాగా పెట్టుకుని సునంద కూచునివుంది. భర్త రాగానే ఆమె లేచి నుంచుంది. మాటామంతీ లేకుండానే అంగవస్త్రమూ, రుమాలూ అందించి టీ తయారు చేయ టానికి వంటఇంట్లోకి పోయింది.

ఒక్క మాటకూడా మాట్లాడలేదు, నోటితో. బూట్లు విప్పదీస్తూ తమాల కాంతుడు 'సంగతి ఏమిటా?' అని ఆలోచనలో పడ్డాడు.

అయిదారు నిమిషాలు గడిచినాక సునంద వేడి టీ ఒక కప్పు చేత పట్టు కుని వచ్చింది—ముఖం అప్పుడుకూడా అట్లాగే వుంది.

తమాలకాంతుడు టీ ఒక్క గుటక వేసి—'ఇదిగో! నిన్న రైల్లో 'పుష్ప రసవిలాసం' అని తలనూనె ఒకడు అమ్ముతున్నాడు. వాడు రోజూ అమ్మే వాడేలే! ఒక్క సీసా నీకు తీసుకువద్దా మనుకున్నాను. వాసనకూడా బాగావుంది. మన మల్లిక్‌గారు తలకు చల్లగాకూడా వుంటుందని చెప్పారు!" అన్నాడు.

సునందమాట్లాడకండా బైటికెళ్ళింది. తమాలకాంతుడు లక్షణా లేవీ బాగా

లేదని గ్రహించాడు. హఠాత్తుగ ఏమి టీ మార్పు!

టీ పూర్తి చేసి తమాలకాంతుడు కూడా పయటికి వెళ్ళాడు_సునంద వూలుమఫ్ లర్ ముందేసుకుని కుట్టుతూ వున్నది తమాలకాంతుడు నవ్వుతూ_ "ఏమిటి, నువ్వు, ఇవ్వాళ ఇంత గంభీరంగా ఉన్నావు? ఎందుకు మొహం అలా పెట్టావు? సంగ తేమిటి?" అన్నాడు.

సునంద ఇక కంట్రోలు చేసుకోలేక పోయింది. బాంబులాగా పేలింది:_ "నా దగ్గర చాతుర్యం చూపించబోతా వెందుకూ? నిర్మల దగ్గరికే పోరాదూ? ఆ పిల్ల రెండుచేతులూ పట్టుకుని భోరున ఏడ్చి వా మనసంతా నీదే నంటివే! నీ శరీరమూ పెళ్ళిచేసుకున్నది! సమాజమనే యూపకాష్ఠానికినిన్ను బలిపెట్టుకున్నావా?''

''ఎవరు నిర్మల! నీ కేమన్నా పిచ్చి ఎక్కిందా ఏమిటి!" అన్నాడు తమాల కాంతుడు విస్తుపోయి.

సునంద మాట్లాడకండా 'గల్ప ప్రభాకర్' అనే మాసపత్రికా, దాని సంపాదకుడు రాసినజాబూ స్తబ్ధుడైవున్న తమాలకాంతుని చేతికిచ్చింది. సంపాదకు డిలా రాశాడు:_

వందనాలు,

తమ 'కథకాదు' అనే కథ మా మాస పత్రికలో ప్రచురించాము. ఆ సంచిక వేరుగా తమకు పోస్టు చేయటమైనది. కథ ప్రచురించటంలో ఆలస్యం జరిగి నందుకు తమరు వేరుగా భావించకండి. తమ కథ ఇంకొకటి కావాలి. భవదీయు,

నృసింహ ప్రసాద్ తాలూక్‌దార్.

రెండు సంవత్సరాల క్రితం తన ఈ కథ 'గల్ప ప్రభాకర్'కు పంపినట్టు అతనికి మెరుపులాగా తోచింది. ఆ తర్వాత అతను పెళ్ళి చేసుకున్నాడు; నౌకరి సంపాయించాడు. సాహిత్యసేవ కూడా చాలా కాలం కిందటే వదలి పెట్టాడు. ఈ కథ సంగతికూడా అతను ఎప్పుడో మరిచిపోయాడు. ఇవ్వాళ హఠాత్తుగా ఈ ఉపద్రవ మేమిటి! సందిగ్ధావస్థలో పడి, నచ్చుకొట్టుతూ "ఎప్పుడో ఒక కథ రాశానే అనుకో_ ఇప్పు డే మొచ్చింది దానికి?" అన్నాడు

"కథా? నువ్వే స్తివిగా 'కథ కాదు' అని!"

తమాలకాంతుడు కొంచెం నవ్వాలని ప్రయత్నిస్తూ_"అదా_అదా ఒకస్టయిల్_ తెలియలా_"

సునంద కేమీ తెలియదు_అసలు తెలుసుకో దలచుకోనూలేదు. నిర్మల అడ్రసు గనక చిక్కితే ఒక్కమాటు పోయి చూసి రావాలనుకుంది_ఏమంత చక్కనిదో ఆమె అని. భర్త రాసినంత చక్కనిదేనా అని ఆమె సందేహం!

ఈర్ష్యతో ఆమె హృదయమంతా దహించుకుపో మొదలుపెట్టింది. కాని, కొన్నిగంటలకు పూర్వం ఆమె ఈహృద యమే నిర్మలకోసం ఎంతో బాధపడింది.



# ఒంటితాడి - ఊడలమర్రి

— విజయలక్ష్మి

పదేళ్ళు కావస్తున్నది నే నీ వూరు వచ్చి. యిది నేను పుట్టి పెరిగిన వూరే అయినా, యీ మధ్య కాలంలో మా అన్నదమ్ములు ఉద్యోగరీత్యా బదిలీ లవుతుంటే, వాళ్ళ సామానుతో పాటు మా అమ్మా, నాన్నా కూడ వూరూరూ తిరగడంతో నా 'పుట్టింటి'కి ఒక వూరంటూ లేకుండా పోయింది. అదృష్ట వశాత్తూ మళ్ళీ మా తమ్ముడికి యీవూళ్ళోనే ఉద్యోగం కావడాన, మా స్వంత యింట్లో అద్దెకున్నవాళ్ళను ఖాళీ చేయించి మా అమ్మ, నాన్న, తమ్ముడు, మరదలు మళ్ళీ మా యింట్లో స్థిరపడ్డారు. నాకు పోయిన నిధి దొరికినట్లయింది. "అమ్మకు నాన్నకు నన్ను చూడాలనుందట, రమ్మని వ్రాస్తున్నారని" మా యింట్లో చెప్పి, ఓ నెల రోజులకు సరిపడు బట్టలు సర్దుకుని

మూన్నా!; క్రిందటే యీ వూరికి, మా యింటికి వచ్చాను. యీ దశాబ్దంలో ఈ వూ రెంత మారిందో నాకు తెలిసినంతగా, యిక్కడే వుండిపోయిన మీకు తెలియదు 'ఊరు బాగుపడిందని' గుర్తించేసరికి దిగులయింది. మా యింటికి అనుకునే ఆడపిల్లల స్కూలు ఉండేది. స్కూలువాళ్ళు ప్లేగ్రౌండుకు కావాలంటే మా స్థలంకూడ మంచి ధర వచ్చిందని అమ్మేశాం. ఆ స్కూల్లోనే నేను థర్డుఫారం రెండుసార్లు తప్పేసరికి మా నాన్న 'చదువు నీ ఒంటికి పడమిలే అమ్మా' అని మాన్పించి పెళ్ళి చేశారు నాకు. ఆ స్కూలు యిప్పుడు హైస్కూలు అయిందట. సాయంత్రం చల్లబడ్డాక స్కూలుకు వెళ్ళాను – నేను చదువుకున్న స్కూలు ఎట్లా వుందో, ఎంత మారిందో చూద్దామని. గేటుదగ్గిర వాచ్‌మన్ 'ఎవరది' అనడిగాడు. గొంతు గుర్తుపట్టి ఆశ్చర్యంగా "రెడ్డయ్యా నువ్వు నన్ను గుర్తుపట్టలేదా? నేను యీ ప్రక్కింటివా శ్యామ్మాయిని; ఇక్కడేగా చదివాను; యీ స్థలం మా దేగా మొదట్లో," అన్నాను. రెడ్డయ్య ఆశ్చర్యంగా "లలితమ్మగారా, తల్లీ! ఎన్నాళ్ళయిందండి మిమ్మల్ని చూసి. ముసలాణ్ణయానమ్మా, గుర్తు తగ్గింది. రండి, చూడాలనిపించి వచ్చారా," అని అడిగి నన్ను వెంటపెట్టుకుని నాలుగు ప్రక్కలా త్రిప్పాడు. మా స్థలం చూద్దామని దక్షిణపు వైపు వెళ్ళాను; ఆశ్చర్యపోయాను. దక్షిణాది దేవాలయాల్లో చూసిన వెయ్యి స్థంభాల మంటపాలను గుర్తుకుతెచ్చింది. అక్కడ పెరిగి పాదుకున్న మర్రిచెట్టు. "ఈ చెట్టు – ఈ చెట్టు – నాకు గుర్తే లేదు," అన్నాను తడబడుతూ. రెడ్డయ్య "మీ రెరిగినప్పుడు యీ చెట్టు లేదండి. ఇక్కడుండేది ఓ తాడిచెట్టు," అన్నాడు. ఔను, ఒకే ఒక తాడిచెట్టు వుండేది మా దొడ్లో. వేసవికాలం ముంజెలు తినే వాళ్ళం. ఒక రోజు మా అమ్మ పాత చీర అంచు చింపి కాళ్ళకు బందా లేసుకుని చెట్టెక్కడం నేర్చుకుంటున్నాను. మా తమ్ముడు వెనుకనుంచి "అమ్మొచ్చె." అని కేక పెట్టాడు. అమాంతం చేతులు వదిలేసి క్రింద పడ్డాను. తర్వాత వారం రోజులు పడక పెట్టాను ఆ తాడిచెట్టు కనపడకపోయేసరికి నిజంగా దిగులేసింది నాకు. 'ఆ తాడిచె ట్టేమయింది, ఈ మర్రిచెట్టును ఎవరు వేశారు?" అనడిగాను. రెడ్డయ్య: "వేసిన మొక్క యింత వృద్ధిలోకి వస్తుందామ్మా? కాకి రెట్టకు తాడిచెట్టుమీద మొలిచిందీ మర్రిచెట్టు. మొదట్లో రెండు మూడు సార్లు పీకిపారెద్దామనుకుని మళ్ళా జాప్యం చేశాను. ఈ పదేళ్ళలో యింత మాను అయింది. తాడిచెట్టు అయిపులేకుండా పోయింది. ఇదే బాగుందమ్మా! పిల్లలు దీ నీడన ఆడుకుంటున్నారు. తాడిచెట్టుకింత కళ వుంటుందాండీ?" అన్నాడు.




బంగారం దొరకటంలేదుగా !

---

మఱ్ఱిచెట్టు మండపంలాగా చల్లగా వుంది.

మర్నాడు వుదయం, మాటల్లో మా అమ్మని అడిగాను "అమ్మా రేణుక ఎట్లావుంది? ప్రాక్టీసు బాగావుందా? ఏమాత్రం సంపాదించింది? పెళ్ళి చేసుకుందా?" అని.

అమ్మ నిర్ఘాంతపోయి చెప్పింది: "నీకు తెలీనేతెలీదా? నేనెట్లా మర్చిపోయాను నీకు వ్రాయడం? రేణుక చచ్చిపోయి రెండేళ్ళవుతుంది. కేన్సర్ వచ్చి నానా అవస్థా పడిపోయింది," అన్నది.

నాకు నోటమాటరాలేదు. రేణుకా నేనూ నాలుగేళ్ళ క్లాసుమేట్సుం. ఓణీలు వేసుకునేవయసు వచ్చేటప్పటికి నాకు చదువుమీద శ్రద్ధ తగ్గడం, లేసులు అల్లడంలో ఆసక్తి పెరగడంతో వరసగా తప్పాను. చదువుమానేసిన ఏడాదిలోపలే పెళ్ళయింది నాకు. పెళ్ళయ్యాక పదేళ్ళ వరకు నాకు పొయ్యివూదుకోవడంతోనూ, పిల్లలముక్కులు తుడుచుకోవడంతోనూ, సరిపోయింది. ఆ పదేళ్ళలో రేణుక యీవూళ్ళో స్కూలూ, కాలేజీ దాటి వైజాగు కాలేజికి వెళ్ళి డాక్టరయివచ్చింది. యీవూళ్ళోనే ప్రాక్టీసు పెట్టింది. ఆర్నెల్లకోసారి నేను పుట్టింటికి వచ్చినప్పుడెల్లా రేణుకను కలుసుకునేదాన్ని. ఆయేటికాయేడు ఆమె ప్రాక్టీసు పెరుగుతూ వచ్చింది. వాళ్ళ యిల్లంతా ఖరీదైన వస్తువులు నిండుకున్నాయి. రేణుక చెల్లెళ్ళు పట్టుచీరెలు, పట్టులంగాలు కట్టుకుని కాలేజికి, స్కూలుకు కారులో

వెళ్ళడం చూచి ఆశ్చర్యపోయాను. నాకు గుర్తున్నంతవరకు రేణుక చదువుతునే రోజుల్లో గంజిపెట్టని, యిస్త్రీలేని చీరలే తప్ప, ఫెళఫెళమంటూ మడతలుతీరిన దుస్తులు ధరించనేలేదు! నేను ఆమెతో "మీ చెల్లెళ్ళనిగూడ మెడిసన్‌కు పంపుతావా?" అనడిగాను ఒకసారి.

"అదేం లేదు, నేను సంపాదించేది వాళ్లా? మంచి అబ్బాయిల్ని వెదికి వాళ్ళకు పెళ్ళిళ్ళు చేస్తాము" అంది రేణుక.

నాకు ఒళ్ళు మండింది

"నాపసాని కబుర్లు చెప్పకు! నువ్వు చేసుకోకుండా, వాళ్ళకు నువ్వు చేసేదేమిటి?" అన్నాను.

రేణుక నవ్వింది. అది నవ్వుకాదు, ఏమిటో చెప్పడం నాకు చేతకాదు. మరుక్షణమే ఆమెకళ్ళు నీళ్ళతో నిండాయి. నాచెయ్యి తన చేతిలోకి తీసుకుని నొక్కుతూ "లలితా! నీకు తెలీదు నా బ్రతుకు! సంపాదన లేని అన్నయ్యలు భార్యా పిల్లలతో యీ యింట్లోనే వుంటున్నారు. అమ్మకు చెల్లెళ్ళగురించి బెంగ. డబ్బుతో పొందగల సుఖాలకు ఎవరికీ లోటు లేకపోయినా, నేను ఎక్కడ పెళ్ళి చేసుకుంటానోఅనేభయం మాయింట్లోవాళ్ళందరినీ రాత్రింబవళ్ళు పీడిస్తున్నది. వాళ్ళకు మనశ్శాంతి లేకుండావుంది. నిరుడు పేపరులో ప్రకటించాము; జవాబులు వచ్చేసరికి యింట్లో అందరికీ తెలిసిపోయింది. పెద్ద రాద్ధాంతమైంది. అమ్మ ఏడుస్తూ 'యీపేపరుపెళ్ళిళ్ళకు సిద్ధపడేవాళ్ళంతా కులం లేనివాళ్ళు, గోత్రం లేనివాళ్లు, గొంతుకోసేవాళ్లు' అంది, అన్నయ్యలు: 'ఎవరిని నమ్మడానికీ వీలులేదు; సంపాదన చూసి ముందుకు వస్తారు, మోసపోకు' అన్నారు. ఆరాత్రి అంతా కూడబలుక్కుని మర్నాడు అమ్మ అన్నయ్యలుకూడ 'నువ్వీవిధంగా ఎవణ్ణోఒకణ్ణి పెళ్లాడితే, నీకు నష్టం లేకపోవచ్చుగాని రేపు తక్కిన యిద్దరు ఆడపిల్లలకు ఎట్లా పెళ్ళిచేస్తాం? నీకు చదువుంది, ప్రాక్టీసుంది. పెళ్ళి కాకపోయినా ఫరవాలేదు. వాళ్ళు నీలాగా డాక్టర్లవుతారా? పెళ్ళికూడా కాకపోతే ఏమయిపోతారు," అన్నారు.

"లలితా! నే నేమీ జవాబు చెప్పలేదు. లోపలకు వెళ్ళి చింపినకవర్లు, చింపని కవర్లు కూడతెచ్చి వాళ్ళఎదుటే తగలపెట్టాను. ఆరాత్రి వాళ్ళంతా సుఖంగా నిద్రపోయారు," అంది.

రేణుక త్యాగనిరతికి సంతోషించినా, అయినవాళ్ళ స్వార్థానికి తలఒగ్గిన బలహీనతకు నాకు జుగుప్స కలిగింది,

"నిన్ను వారు ఇలా అవమానిస్తూంటే, నిన్నిట్లా 'ఎక్స్‌ప్లాయిట్' చేస్తూంటే వాళ్ళమీద ప్రేమ ఎట్లా చావలేదు నీకు," అన్నాను.

రేణుక నవ్వి "ప్రేమ చావలేదు



కాని తగ్గింది. దాన్ని భర్తీచేయడానికి జాలి పెరిగింది, వాళ్ళ పిరికితనాన్ని చూచి," అన్నది. ఆ ఫిలాసఫీ నాకర్థం కాలేదు. ఆ తర్వాత కూడా రెండు, మూడుసార్లు కలుసుకున్నాను రేణుకను.

నేవెళ్ళినప్పుడల్లా నాప్రమేయం లేకుండానే నన్ను, నాపిల్లలను పరీక్ష చేసి "వీళ్ళకు యీ కాల్సియం మాత్రలు

యిస్తూండు. నువ్వీ టానిక్ పుచ్చుకో." అంటూ శాంపిల్ మందుసీసాలు యిస్తుండేది నాకు. ఒకరోజు "నేను వచ్చినప్పుడల్లా నువ్విట్లా యిస్తే, నేను 'ఫ్రీచెకప్' కోసమే నిన్ను చూడ్డానికి వస్తున్నాననుకుంటారు అందరూ." అన్నాను, నిజమైన భయంతో.

అందుకు రేణుక చాలా గాయపడింది. విట్లూర్చి "ఇంకెప్పుడూ నిన్ను పేషంట్‌గా చూడను. తెలీకుండా చాల నొప్పించాను నిన్ను." అంది.

రేణుక సలాగా నొప్పించినందుకు నిజంగా పశ్చాత్తాపం కలిగింది నాకు. అంతే, ఆ తర్వాత మా వాళ్ళు మా వూరు విడిచిపెట్టడంతో యీ పదేళ్ళూ నే నిటు రానేలేదు. రేణుకకూ నాకూ ఉత్తరాలు వ్రాసుకునే అలవాటు లేదు, రేణుక పోయిన రెండేళ్ళకు గాని ఆ కబురు నాకు తెలియలేదు.

మర్నాడు సాయంత్రం నాగేశ్వర స్వామి గుళ్ళో చిన్మయానందస్వామి గీతా ప్రసంగాలు జరుగుతున్నాయని విని, [illegible] బయలుదేరాము మా అమ్మా, నేనూ. దారిలో రేణుకావాళ్ళవీధి రాగానే 'అదే రేణుకావాళ్ళ యిల్లు' అంది మా అమ్మ. ఆశ్చర్యంగా చూశాను నేను. అది యిల్లుకాదు, పెద్ద మేడ. "రేణుక పోగానే యిన్నూరెన్ను డబ్బు లక్ష రూపాయలు వచ్చిందట. అది పోయాకనే యీ మేడ కట్టుకున్నారు అందరి పెళ్ళిళ్ళయ్యాయి; అందరూ పిల్లపాపల్తో ఆ మేడలోనే వుంటున్నారు: బావలు, మరుదులు కలిసి ఏదో బిజినెస్ చేస్తున్నారట." అంది అమ్మ. ఏనుగు చచ్చినా బ్రతికినా వెయ్యి వరహాలట; బ్రతికినన్నాళ్ళు సంపాయించింది కాకుండా చచ్చిపోయి కూడ నట్టింట డబ్బు కురిపించిందన్నమాట ! ఆ మేడ అందంలో, మేడలో వినబడే నవ్వుల్లో, ఆ తోటలో పూసే పువ్వుల్లో వెదికినా కనిపించదు రేణుక.

రేణుకకు పెళ్ళి పెటాకులూ లేవు. పిల్లాజెల్లాలేరు. ఆమెకు ఆత్మసౌందర్యం ఎంతైనా వుండుకాక ! ఒంటరిగా అంత పెద్ద మేడలో రేణుక నిలబడితే ఏమైనా అందంగా వుండేదా ? రేణుక చచ్చిపోయిందన్న బాధ అనవసరం. ఆ యిల్లు లక్షణంగా పదిమంది పిల్లాపాపల్తో కళకళలాడుతూ వుంది. ఒంటి తాడిచెట్టుకన్నా, ఊడలు దిగిన మర్రిచెట్టు నిజంగా అందమైనది.





ప్రచండ మార్తాండ తాపం మహా భయంకరంగా వున్నది. రోహిణికార్తె ప్రవేశం రోళ్ళు బ్రద్దలు కొడ్తూన్నది. జనం ఇళ్ళు వదలి బయటకు రావటంలేదు. పక్షులు సహితం ప్రాణభీతితో చెట్లపై ఆకుల చాటుమాటున అణగివున్నాయి. భీకర నిశ్శబ్దం ఆవరించిన ఆ పట్టణ మార్గాన ఒంటరిగా నడుస్తున్నాడు కిరణ్‌కుమార్, ఒక చేతితో సూట్‌కేస్ మోస్తూ; ఇక ఆ ఎండలో నడవడం దుర్భర మనిపించు చున్నట్టూ, బాగా అలసిపోయినట్టూ అతడి ముఖకవళికలు స్పష్టీకరిస్తున్నాయి. ఊరి పొలిమేరలు సమీపించిన అతడు బాటప్రక్క నున్న ఒక వృక్షం నీడను చెమట ఒత్తుకుంటూ నిల్చున్నాడు. అలసటకు తోడు విపరీతమైన దాహం బాధిస్తూన్నది.

పొలాలలో ఎక్కడైనా బావు లుంటాయనే ఆశతో ప్రక్కగా కొద్ది దూరం చేలో నడిచాడు. కనుచూపుమేరలో పొలాల మధ్యగా రాయుడుగారి మేడ కన్పిస్తూన్నది. ఆ మేడను చూడగానే ఒక్కసారి బాల్యపురోజులు జ్ఞప్తికి వచ్చి అప్రయత్నంగా పెదవులపై చిరుదరహాసం తొణికిసలాడింది. రాయుడుగారి మేడ అనుకోవడమే కాని అందులో ఎవరూ నివసించేవారు కాదు. పాడుపడిపోయినట్లుండేది. అందులో దయ్యాలూ, భూతాలూ వుంటాయని అందరూ చిత్రంగా చెప్పుకొనేవారు. ఒకనాడు తరగతి పిల్లలతో కలిసి పెద్దవాళ్ళకు తెలియకుండా

డయ్యాల్ని చూద్దామని అక్కడకు వెళ్ళి దడుసుకు జ్వరం తెచ్చుకున్న సంగతి తలపుకు వచ్చి, చిన్ననాటి అమాయకతకు చిన్నగా నవ్వుకున్నాడు.

ఆలోచనలతో లీనమైపోయి నడుస్తూన్న కిరణ్ హఠాత్తుగా స్తంభించిపోయి నిల్చున్నాడు. ఎక్కడినుండో వీణానాదంతో మేళవించిన మృదుమధురగానాలాపం విన్పిస్తోంది! కిరణ్ ఆశ్చర్యం అవధుల నధిగమించింది. ఆ నిర్జనప్రదేశంలో ఆ పాడుబడ్డ భవంతిలో ఆ మృదులగానం విన్పించేవా రెవరు? ఎండలో ఆకలి దప్పికలతో అలసిపోయివచ్చిన ప్రాణికి మనోల్లాసం కల్గించే ఆ శ్రావ్య సంగీతం ఎవరిది.

ఆశ్చర్యకుతూహలాలతో వడివడిగా ఆ మేడ దగ్గరకు జేరుకున్నాడు కిరణ్. భవంతి అంతా పునర్జన్మ నెత్తినట్టు స్పష్టంగా కన్పిస్తూన్నది. పూర్వం దారి లేకుండా గజిబిజిగా అల్లుకుపోయిన తీగలు, డొంకలు స్థానే అందమైన క్రోటన్ మొక్కలు, పూలమొక్కలు వున్నాయి. విరిగిపోయిన గేటు, కిటికీ తలుపులు వగైరాలు నేడు లేవు. పూర్వం మాదిరిగా అసహ్యంగా దుమ్ము కొట్టుకుపోయి, పాకుడు కట్టిన గోడలు కాను; ఇప్పుడు అంతా శుభ్రంగా వెల్ల వేసివుంది. అంతా మానవ నివాస యోగ్యంగానే కన్పిస్తున్నది.

'ఇంటిలో ప్రస్తుతం ఎవ రుంటున్నారో! లోపలికి వెళ్ళనా, వద్దా?' అని ఆలోచిస్తూనే సమీపించి గేటుపై చేయి వేశాడు. వెంటనే ఆ సందేహం స్థానే ఆశ్చర్యం, ఆ వెనువెంటనే ఏదో అనిర్వచనీయానందం, ఉల్లాసం ముప్పిరిగొని అతడిని స్థాణువును చేసివేశాయి. చలనరహితుడై, కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డాడు.

ఆ నేత్రాల నలా రెప్పవేయకుండా నిలబెట్టినది—లోని వరండాలో వీణాపాణియైన ఒక అతిలోక దివ్య సౌందర్యప్రతిమ! సన్నని ఆకర్షణీయమైన మృదులాంగుళులు త్వరితగమనంతో వీణాతంత్రులపై అటునిటు పరుగులిడుతున్నాయి. గండు మీనులను బోలిన దీర్ఘనేత్రాలు అర్ధనిమీలితమై పరధ్యానతను సూచిస్తున్నాయి. నొక్కులు తిరిగిన నల్లని ముంగురులు చెక్కిళ్ళపై వత్తుగా పడ్తున్నాయి. కొద్ది అరుణిమ మిళితమైన పసిమి శరీరఛాయ. కథలలో-కావ్యాలలో చదవడమే కాని పాలకడలిలోని లక్ష్మీదేవివలె, ఆపదసరస్వతివలె ఒప్పారే ఇంతటి అపురూప దివ్యమంగళ విగ్రహాన్ని, అచ్చరకన్నెలను బోలిన సౌందర్యరాశిని ఇంతవరకూ తా నెక్కడా చూచి వుండలేదు!



పాట ముగియగానే ముఖా న్నావరించిన చిరుచెమటలు వొత్తుకుంటూ అప్రయత్నంగా గేటువైపు చూచిం దా యువతి.

"ఎవరు వారు?" అంటూ ఒడిలోని వీణను ప్రక్కకు పెట్టి, త్వరత్వరగా లేచి

మెట్లు దిగి, కాంపౌండు దాటి, గేటు దగ్గరకు వచ్చింది. గేటుగడియ తీస్తూ ప్రశ్నార్థకంగా చూచింది అతడివైపు.

ఆచూపులకూ ఆ సౌందర్యానికీ ముగ్ధుడైపోయిన కిరణ్, మెల్లగా అన్నాడు: "చాలా దాహంగా వుంది. మంచినీరు అడుగుదామని వచ్చి, మీ పాటసుధ్యలో అంతరాయం కల్గించలేక...అంతకంటే పాట వింటూ, అసలు దప్పికసంగతి మరిచిపోయానంటే నిజం చెప్పిన ట్లుంటుందేమో!'' అన్నాడు చనువుగా నవ్వుతూ.

ఆ యువతి పెదవులపై కనిపించీ కనిపించని చిరుహాసం క్షణకాలం మెరిసి మాయమైంది. ''చాలా అలసిపోతున్నారు, పాపం, రండి లోపలకు;'' సాదరంగా ఆహ్వానించింది లోపలికి నడుస్తూ. సంస్కారయుతమైన ఆ ప్రవర్తనను ఆనందిస్తూ ఆమెను అనుసరించాడు కిరణ్.

లోనుండి నీటికూజా, గ్లాసూ తెచ్చి కిరణ్‌కు అందించిందా యువతి.

మూడుగ్రుక్కల్లో మూడుగ్లాసులనీళ్ళు త్రాగి, తృప్తిగా ముఖం, చేతులు, కాళ్ళు ఆ చల్లనినీటితో కడుక్కున్నాడు.

''మెనీ మెనీ థాంక్స్, మీ శ్రావ్యగానంతోనూ, మీ రిచ్చిన చల్లనినీటితోనూ పోయినప్రాణాలు లేచివచ్చాయి. వస్తాను, సెలవు;'' ముఖం వత్తుకుంటూ మెట్లు దిగాడు కిరణ్.

''చూడండీ!''

ఆ కిన్నెరకంఠం పిలుపు విని నడక ఆపి వెనక్కు తిరిగాడు

''ఇంత మండుటెండలో వెళ్ళడం శ్రేయస్కరంకాదు. కొద్దిసేపు తాళివెళ్ళుదురు గాని. మేడమీదకు రండి.''

ఆదరంగా, చనువుగా మాట్లాడుతూన్న ఆమెధోరణీ, క్షీరసాగర మథనవేళ కెరటం లేస్తూన్న ఆ అద్వితీయ సౌందర్యం, అంతకుముందే రుచిచూచిన ఆమె గానామృతం అతడిని బంధించివేయగా, మంత్రముగ్ధుడిలాగే ఆమె ననుసరించాడు.

''ఈ ఇంట్లో... ఇదివర కెవరూ ఉండేవారు కాదేమో?'' అన్నాడు మేడ మెట్లెక్కుతూ ఆమెతో సందిగ్ధంగా.

చిరునవ్వుతో సమాధాన మిచ్చింది ఆమె: "మా తాతగా రుండేవారట. నాన్నగారు ఉద్యోగం చేసినంతకాలం ఇటుప్రక్కల కెప్పుడూ రాలేదు. అలా పాడైపోయింది. ఇప్పుడు ఆరేడునెలలనుంచీ ఉంటున్నాం మేము, అంతా బాగుచేయించి.''

"ఓ! అయితే మీరు రాయుడుగారి మనుమరా లన్నమాట!" ఆశ్చర్యం ప్రకటించాడు కిరణ్. "పేరు తెల్సుకోవచ్చా?" నవ్వుతూ అడిగాడు.

ఆమెనుండి ఒక్క చిరుహాసమే జవాబైంది కాని ప్రశ్నకు సమాధానం చెప్పలేదు.

'అవునులే. తన పేరు తానే చెప్తుందా మరి? అందులోనూ రాయుడుగారి మనుమరాలాయె!' తనలో తాను నవ్వుకున్నాడు.

మేడమీద హాలులో వాలుకుర్చీలో పడుకుని దినపత్రిక తిరగేస్తున్న వృద్ధుడు, ఆగంతకుని చూచి లేచి సరిగా కూర్చున్నాడు. ఎండు దర్పం, ఠీవీ గలిగి ఎవరికైనా చూడగానే గౌరవభావం కల్గించే విగ్రహం అతడిది.

"ఎవరో వచ్చారు నాన్నా! తెలిసినవారే అనుకుంటాను," అన్నది ఆ అమ్మాయి.

నమస్కారం చెప్తూ లోనికి ప్రవేశించాడు కిరణ్‌కుమార్. ప్రతినమస్కారం చేస్తూ కుర్చీ చూపాడతడు.

''నేను జగపతిగారి అబ్బాయినండి, నా పేరు కిరణ్‌కుమార్; ఇంజనీరును. సెలవులు కలసివచ్చి హఠాత్తుగా బయలుదేరాను. ఇంటికి తెలియపరచినట్లైతే బస్సుస్టాప్‌దగ్గఱకు కారు పంపించివుండేవారు. మీ కీ శ్రమ తప్పేది." నవ్వుతూ నవ్వుతూనే తన రాక సందర్భంతో పాటు, తనను కూడ పరిచయం చేసుకున్నాడు.

''శ్రమేముంది కాని, అయితే నువ్వు జగపతి కొడుకువా?" పరమానందపడిపోయాడతడు. "నేను ధర్మారాయుడిని, బహుశః నీకు తెలిసి వుండదు..."

"విన్నానండి, చూడలేదు కాని.''

"ఆఁ, నేనూ జగపతీ ఎంతటి మిత్రులమో నీకు తెలియదు. అయితే జగపతి పూదోకొడుకు వన్నమాట నువ్వు!''

"అవునండి, ఇక్కడ మీరేగనుక లేకుంటే ఈ ఎండకూ, దాహానికీ ఏమైపోయేవాడనో!"

తేలికగా నవ్వేశాడు రాయుడు. ఏమిటయ్యా మరీ అంత ఇదైపోతున్నావ్? అతిధిమర్యాదలు మన కేమైనా క్రొత్తా, అంతగా అనుకోవటానికి? నేనూ జగపతీ బాల్యమిత్రులం; తర్వాత దూరమైపోయాం కానీ...వారం రోజుల క్రిందటే కల్సుకొన్నాం ఇద్దరమూ – చెప్పాడు నీ సంగతి. మీ కుటుంబంలో ఇంత చదువులు చదివినవారూ, ఉద్యోగం చేసినవారూ ఇదివరలో లేరు. ఇప్పుడు మీ అన్నదమ్ములే చదివారు, ఉద్యోగం చేయడంలో నీవే ప్రధముడివి. జగపతి ఎంత అదృష్టవంతుడు!"

''ఏదో మీ దయ," నమ్రతతో అన్నాడు కిరణ్.

అంతలో రాయుడికుమార్తె షర్బత్‌గ్లాసులతో ప్రవేశించడంతో సంభాషణ తాత్కాలికంగా ఆగింది. గ్లాసులు ఇచ్చేసి వెళ్ళిపోతూన్న కుమార్తెతో అన్నాడు రాయుడు: "చూడు రాణీ! మన జగపతిగారి అబ్బాయి వచ్చాడు. ఇలా రమ్మన్నానని మీ అమ్మతో చెప్పు"

తల ఊపి వెళ్ళిపోయింది రాణి.

ధర్మారాయునితో అన్నాడు కిరణ్: "అయితే మీ రిక్కడ 'సెటిల్' అయిపోయా రనుకుంటాను. మీ సంగతులు అప్పుడప్పుడు వినడమేకాని మిమ్మల్నెప్పుడూ చూడలేదండి."

"అవునోయ్, రిటైరైపోయాను; మరి ఉద్యోగం చేసే ఓపిక లేదు. ఏవేవో నూలుమిల్లులు-వాటిలో పెద్ద షేర్లే వున్నాయి నాకు. నే నెక్కడున్నా వచ్చి ఆ డబ్బు పాదాలదగ్గర వాల్తుంది......అదీగాక రాణితల్లి ఆరోగ్యం కొంత బాగుండలేదు. పల్లెపట్టున నిర్మలవాతావరణంలో చక్కబడగలదని డాక్టర్ల సలహా. రాణికి కూడా ఈ వాతావరణం బాగా నచ్చింది. అయినా ఆ పిల్ల కెక్కడున్నా ఒకటే. ఓ వీణ చేతి కిచ్చామా-ఇహ ఈ ప్రపంచం మరచిపోతుంది. నిద్రాహారాల తోనే నిమిత్తముండదు."

"నాన్న మాటలు నమ్మకండి. ప్రతీదీ విపరీతం చేసి చెప్తారు;" చురుగ్గా చూస్తూ ప్రవేశించింది రాణి, తల్లితో కలసి.

నవ్వేశాడు కిరణ్, "నేనే ప్రత్యక్షంగా చూచి విన్నమీదట నమ్మకపోవడ మెలాగ? నిజంగా చెప్తున్నాను వినండి. దాహంతో వచ్చినవాడిని పాట వింటూ మైమరచిపోయి నిల్చున్నాను!"

"చూడు యశోదా!" రాయుడు భార్య నుద్దేశించి అన్నాడు: "ఇతడు జగపతిగారి మూడవఅబ్బాయి కిరణ్ అట!"

కిరణ్ నమస్కరిస్తూ, మర్యాదగా లేచి నిల్చున్నాడు.

యశోదా, రాణీ తల్లీకుమార్తెలనేకంటె అక్కాచెల్లెళ్ళంటే సరిపోయేట్లున్నారు చూపులకు. అనారోగ్యంవల్లనేమో, చాలా బలహీనంగా ఉన్నది యశోదాదేవి.

ఆమె ఆప్యాయంగా పలుకరించింది కిరణ్‌ను. చాలా సంతోషంగా వుంది బాబూ నిన్నిలా చూడగలగడం. మనం పరాయివాళ్ళంకాదు. ఎప్పుడో నాలుగేళ్ళ పిల్లవాడిగా వున్నప్పుడు చూచాను నిన్ను; మళ్ళీ యిప్పుడు చూస్తున్నాను."

నవ్వి ఊరుకున్నాడు కిరణ్.

"భోజనానికి లే బాబూ. ఎప్పుడైై వేళావో!"

చకితుడై చూచాడు కిరణ్. ఆ అతిఆదరణకు విస్మయం చెందా డతడు.

నవ్వుతూ అన్నాడు రాయుడు; "కాసిని మంచినీళ్ళిచ్చి ఊరుకోవడమే కాని ఆ ఆలోచనే రాలేదు మాకు. లే బాబూ, భోజనం చేద్దువుగాని!"

"వద్దండీ. ఎందుకు? ఇంటికి వెళ్ళిపోతాను. మొహమాటంగా అన్నాడు కిరణ్.

"అలాకాదు, చేయాల్సిందే. మేమూ పరాయివాళ్ళంకాదు," అంటూ యశోద "వెళ్ళి వడ్డించురాణీ," అని కూతురికి ఆజ్ఞ జారీచేసింది.

రాణి వెంటనే వెళ్ళిపోయింది, ఆ ఆజ్ఞను అమలులో పెట్టడానికి.

ఇక కిరణ్‌కు తప్పలేదు. అయిష్టంగానే లేచాడు భోజనానికి.

రాణి వడ్డిస్తూండగా, రాయుడుదంపతులు దగ్గరనే కూర్చుని కబుర్లు చెప్తూంటే కిరణ్‌కు తా నా గృహానికి అతినూతనవ్యక్తి ననే సంగతే విస్మరింప కలిగింది. ఏమాత్రం క్రొత్తా, అతిశయమూలేని ఆ దంపతుల ఆదరపూర్వక సంభాషణలో అలసటనూ, కాలగమనాన్నే విస్మరించాడు కిరణ్. మాట్లాడుకుంటూండగానే ప్రొద్దు ఏటవాలింది.

''ఎండ తీవ్రత తగ్గింది. ఇహ వెళ్తానండి; సెలవు," అంటూ బయలు దేరాడు కిరణ్.

''అప్పుడప్పుడు వస్తూండు నాయనా. మనం పరాయివాళ్ళం కాదు," అంటూ సాగనంపారు.

'సౌందర్యవంతుడు – సహృదయుడు; చూడగానే సదభిప్రాయం కలుగుతుంది;' రాయుడు భార్యతో అంటూన్న మాటలు వెళ్ళిపోతూన్న కిరణ్‌కు విన్పించక పోలేదు. వెనుకాడే పాదాలతో, చిగురించే కోర్కెలతో, పరుగులిడుతూన్న మన స్సుతో సాగిపోయాడు.

## 2

''ఎలా వచ్చావ్ నాయనా, మంచి ఎండాకాలం? ఉత్తరం వ్రాస్తే కారు పంపే వాళ్ళమే!'' ఏ దెనిమిది నెలల అనంతరం ఇంటికి వచ్చిన చిన్న కుమారుని సంతో షంగా, ఆదరంగా, ఆప్యాయంగా పలుకరించారు, తల్లి కమలా, తండ్రి జగపతీ.

''హఠాత్తుగా బయలుదేరాను. అయినా నే నేమీ కష్టపడలేదులెండి. ఎండ తగ్గే వరకూ ధర్మారాయుడిగా రింట్లో ఆగాను,'' అంటూ జరిగిన సంగతంతా చెప్పాడు కిరణ్.

"మంచివాడు ధర్మారాయుడు. నువ్వెరగవ్; ఈ ఊరివాడేలే. అయితే ఎన్నా ళ్ళున్నాయి సెలవులు? సెలవుల్లోకూడా జీతం వస్తుందా?'' జగపతి ప్రశ్న.

"చాల్లెండి. మరీ డబ్బుమనుషులైపోయారు;" విసుక్కుంది కమల భర్తను. "ఇంకా బిడ్డ గుమ్మంలో అడుగు పెట్టాడో లేదో—'ఎప్పుడు వెళ్తావు? ఎంత డబ్బు ఆదా చేశావు?' అన్న ప్రశ్నలే. రా నాయనా లోపలికి. భోజనానికి లే."

తలిదండ్రుల విభిన్న మనస్తత్వాలకు నవ్వుకుంటూ సమాధానం చెప్పాడు కిరణ్: "భోజనం అయ్యిందమ్మా, రాయుడుగారింట్లో. చేసేవరకూ వదిలి పెట్టారు కాదు."

జగపతి తృప్తిగా నవ్వాడు. "ధర్మారాయుడింటికి వెళ్ళిన మనిషి మర్యాదలను తప్పించుకుని బయటపడగలడా?"

"నిజమే నాన్నా! చాలా మర్యాదస్తులు;" కిరణ్ సమర్థించాడు.

కిరణ్ వచ్చాడని కుటుంబమందరూ సంతోషించి, పండగ చేశారు. అన్నలిద్దరూ కమలాకరం, శ్రీరాం ప్రేమగా పలుకరించారు. వదినలు వనజా, జానకీ ఆప్యాయంగా మాట్లాడారు. 'చిన్నాన్నగారు వచ్చా'రని పిల్లలు గంతులేశారు. 'చినబాబు వచ్చా'డంటూ నౌఖర్లంతా ఆనందపడ్డారు.

అంతటి ఆనంద వాతావరణంలోనూకూడ కిరణ్ రాణిని మరువలేకపోయాడు. పుష్ప సుకుమారలావణ్యం, జ్యోతిర్మయ నేత్రాలు, ఉజ్వల ముఖకాంతి, సౌమ్య సరళసంభాషణ — అన్నిటికీ మించిన ఆ గానమాధురి తలచుకొన్నకొద్దీ అతడికేదో అనిర్వచనీయానందానుభూతిని కలుగజేస్తున్నాయి. శిశు పశు పక్ష్యాదులను సహితం రంజింపజేయగల ఆమెయొక్క అపూర్వగానం ఇంకా అతడి చెవులలో విన్పిస్తూనేవున్నది.

## 3

మధ్యాహ్నవేళ మేడ పైగదిలో కూర్చున్నాడు కిరణ్, కంటికింపుగా కన్పిస్తూన్న పచ్చని చేలను చూస్తూ.

"చిన్నాన్నా!

ఆలోచనలో నున్న కిరణ్ తెప్పరిల్లిచూచాడు. పెద్దన్న కమలాకరంకూతురు లక్ష్మి, చెంతనే నిల్చుని పిలుస్తున్నది. "చిన్నాన్నా! ఇప్పటికి మూడుసార్లు పిలిచాను, పలుకవేం?" అతి ఆశ్చర్యంగా అడిగింది.

నవ్వుతూ దగ్గిరకు తీసుకున్నాడు కిరణ్, "ఏం కావాలమ్మా?"

ఒకచీటీ చేతులో వుంచింది లక్ష్మి. "రాయుడుగారి నౌఖరు తెచ్చా" డంటూ.

నవ్వుకుంటూ, ఆనందంతో తన సమ్మతిని వ్రాసియిచ్చి నౌఖరును పంపేశాడు కిరణ్. ఆ సాయంత్రం టీ కి రమ్మని రాయుడునుండి ఆహ్వానం అది!

"మరి...పట్నంలో — మీరు ఉద్యోగం చేసే ఊళ్ళో అన్నీ దొరుకుతాయా చిన్నాన్నా?" తిరిగి వచ్చి, లక్ష్మి మాటలు ప్రారంభించింది.

"ఆహా! అ...న్నీ దొరుకుతాయి. ఏం కావాలి? బొమ్మలవీ తెచ్చానుగా?" అన్నాడు నవ్వుతూ, 'అన్నీ' అనే పదాన్ని ఒత్తి పలుకుతూ.

"ఊఁహు, బొమ్మలు కాదు. మంచి దొకటుంది చెప్తాను. తప్పకుండా తేవాలి." అంటూ ఒళ్ళో కెక్కి కూర్చుని గారాలుపోతూ.

"తప్పకుండా తెస్తాను చెప్పు."

"మరి...వాళ్ళ దేవరాణి పాడుతూ వాయిస్తుందే. అటువంటి తీగలు కావాలి చిన్నాన్నా."

"దేవరాణి ఎవరూ?"

"వాళ్ళే, క్రొత్తగా ఆ మధ్య వచ్చారూ పట్నాలనుండి? ఆ నాయుడుగారమ్మాయి!"

"ఓహో!" ఆశ్చర్య సంతోషాలతో అన్నాడు కిరణ్. "అయితే ఆ అమ్మాయి పూర్తి పేరు దేవరాణియా? తీగలు కాదు, వీణ అంటారు దాన్ని."

"అవును చిన్నాన్నా;" తన మాటలు శ్రద్ధగా వినేవాళ్ళు దొరికారన్న సంతోషంతో 'కీ' ఇచ్చినట్లు ఎడతెగకుండా మాట్లాడసాగింది లక్ష్మి. "ఆ అమ్మాయి బాగా చదువుకుండట. ఎమ్మే పాసైందట. చక్కగా పాడ్తుంది; మరేమో — చాలా మంచిది."

"అబ్బో! నీ కెలా తెల్సు?"

"అబ్బ, తెలుసులెండి; వాళ్ళు ఇక్కడి కొస్తారు; మనం అక్కడికి వెళ్తాం. ఆ అమ్మాయి ఎంత మంచి దనుకున్నారు చిన్నాన్నా? నాకు సంగీతం నేర్పుతానంది; తన వీణ రెండు మూడు సార్లు నన్ను వాయించనిచ్చింది. ఆవిడ దగ్గర నేర్చుకొంటాను. నాకు ఒక వీణ కొని తెచ్చిపెట్టరూ చిన్నాన్నా?"

"తెస్తానమ్మా, తప్పకుండా తెస్తాను;" ఆమె అమాయకతకూ, ముద్దులొలికే మాటలకూ ముగ్ధుడైపోతూ సమాధానాలు చేస్తున్న కిరణ్, "చిన్న బాబూ" అనే పిలుపు విని గుమ్మంవైపు చూచాడు. ఎదురుగా చిన్నవదిన జానకి నవ్వుతూ నిల్చుంది.

"ఏం వదినా? రండి కూర్చోండి." అన్నాడు లోపలికి వచ్చిన ఆమెదగ్గరగా ఒక కుర్చీ లాగుతూ.

"పిన్నీ పిన్నీ!" ఉత్సాహంగా జానకితో చెప్పసాగింది లక్ష్మి; "బాబయ్యగారు నాకు వీణ తెస్తానన్నారు. నేనుకూడా వాళ్ళ రాణీలాగా చక్కగా సంగీతం నేర్చు

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణలు
## ప్రతులకు: కళాభవన్, హైదరాబాదు-4

| | | రు. పై. |
|---|---|---|
| 1. | తెలుగు సామెతలు : ప్రధాన సంపాదకులు శ్రీ విశ్వనాథసత్యనారాయణ | 10-00 |
| 2. | పదబంధ పారిజాతము (1, 2 భాగములు) " శ్రీ నార్ల వెంకటేశ్వరరావు (ఒక్కొక్కటి) | 10-00 |
| 3. | నన్నయ పదప్రయోగ కోశము " శ్రీ అబ్బూరి రామకృష్ణారావు | 40-00 |
| 4. | రవీంద్ర శతవార్షిక విశేషసంచిక " శ్రీ ఆచంట జానకిరామ్ | 10-00 |
| 5. | నన్నెచోడ పదప్రయోగ సూచిక - ముఖ్య సంపాదకులు శ్రీ దివాకర్ల వేంకటావధాని | 20-00 |
| 6. | మాండలిక వ్యవసాయ వృత్తి పదకోశము - ముఖ్యసంపాదకులు శ్రీ బి. హెచ్. కృష్ణమూర్తి | 25-00 |
| 7. | దక్షిణ భారత సాహిత్యములు — — | 3-00 |
| 8. | సాహిత్యోపన్యాసములు I, II, V సంపుటాలు | 1-50 |
| | Do III, IV సంపుటాలు | 1-25 |
| 9. | ఆంధ్ర క్రియా స్వరూప మణిదీపిక - ముఖ్య సంపాదకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 20-00 |
| 10. | ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము - కందూరి ఈశ్వరదత్తు | 10-00 |
| 11. | సూక్తి సుధాకరము-సంపాదకులు- శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు | 20-00 |
| 12. | ఉర్దూ కథానికలు - అనువాదకులు - శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి | 5-00 |
| 13. | ఉర్దూ సాహిత్య చరిత్ర, " శ్రీ యస్. సదాశివ | 6-00 |
| 14. | సి. పి. బ్రౌన్ - శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు | 5-00 |
| 15. | ఆంధ్ర శతకావళి - అనువాదకులు - శ్రీ తి. గు. వరదాచార్యులు | 1-50 |
| 16. | శ్రీ మహాభాగవతము (సంపాదకులు: శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, దివాకర్ల వెంకటావధాని, తాపీ ధర్మారావు, దీపాల పిచ్చయ్యశాస్త్రి, బి. రామరాజు) | 20-00 |
| 17. | సూరదాసు పదాలు : అనువాదం : దుర్గానంద్ | 1-00 |
| 18. | రాఘవాభ్యుదయము : సంపాదకులు : డా. బి. రామరాజు | 4-00 |
| 19. | రసగంగాధరం : అనువాదం : శ్రీ ధరణికోట వెంకటసుబ్బయ్య | 6-00 |
| 20. | అమ్జద్ రుబాయీలు : అనువాదం : శ్రీ సదాశివ | 1-50 |
| 21. | సుమతీ, వేమన శతకాలు: అనువాదం : శ్రీ యస్. టి. జి. వరదాచార్యులు | 1-00 |
| 22. | అఖిలభారత కవయిత్రులు: సంకలనం: శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 7-00 |
| 23. | ఉత్తర భారత సాహిత్యములు | 4-00 |
| 24. | విష్ణు పారిజాతం : రచయిత్రి : తరిగొండ వెంకమాంబ | 2-50 |
| 25. | ఉత్తర రామ చరిత్ర - సంపాదకులు: శ్రీ నేలటూరి రామదాసయ్యంగార్ | 8-00 |
| 26. | ఆంధ్రదేశ హాస్య కథలు - శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి | 0-75 |
| 27. | నెహ్రూ సంచిక - సంపాదకులు : శ్రీ అడపా రామకృష్ణారావు | 8-00 |
| 28. | బ్రౌన్ డిక్షనరీ | 30-00 |

(Kuchi)



కుంటాను." ఆనందంతో కళ్ళు విశాలం చేసి చెప్తూన్నలక్ష్మి హఠాత్తుగా బెదరి ఆగి పోయింది, జానకి చేసిన గర్జన విని.

"దొరక్క దొరక్క అదే దొరికింది నాకు ఆదర్శం;'' అంది జానకి ఈసడింపుగా.

కారణ మేమో తెలియని కిరణ్, పసిపిల్లలక్ష్మికూడా నివ్వెరపోయారు.

జానకి తనధోరణినే పూర్తిచేయసాగింది: ''మహా నేనమ్మా ఎమ్మే పాసయ్యాను, సంగీతవిద్వాంసురాలిని అన్నట్టు విఱ్ఱవీగుతూ తిరుగుతుంది. ఆ తల్లీ, తండ్రీ అసలే - మా అమ్మాయి ఇంతగొప్ప దనుకొంటూ మురుస్తారు. ఎందుకొచ్చిన జన్మలు — ఎందుకొచ్చిన చదువులు? పాతికేళ్ళున్నాయి - పెళ్ళీ పెటాకులూలేవు!"

నిర్ఘాంతపోవడం మినహా ఏమీ మాట్లాడలేకపోయాడు కిరణ్. చిన్నవదిన జానకి దురుసుతనమూ, విమర్శనాత్మక స్వభావమూ తనకు తెలియనివికావు. ఒక్క తనపై తనకేకాని ఇంకెవరిపైనా ఆమెకు ప్రేమా, సద్భావమూ వుండవు. ఇంటా బయటా అందర్నీ ఇట్లాగే విమర్శిస్తుంది

"అయినా నాకు తెలీకడుగుతానూ, ఆడదానికింత చదువెందుకు చిసబాబూ, ఓవంక తాడిచెట్లల్లే ఎదిగిపోతూ? పోనీ ఇంతా చదివి ఏమైనా ఉద్యోగం చేస్తుందా

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు - 26

అంటే అదీలేదు—ఇంట్లో కూర్చుంది. 'మా కేం తక్కువండీ ఉద్యోగం చేయడానికి?' అని షోకులుపోతూ చెప్తుంది. మరి ఎందుకు చదువుకున్నట్లుటా ?”

బలవంతంగా నవ్వాడు కిరణ్, మనస్సులో కష్టంగా ఉన్నా, అటువంటి విషయాలలో జానకితో వాదించి లాభంలేదని అతడికి తెలుసు. ఇతరులపై ప్రసరించి పోతూన్న విమర్శలూ, దూషణలూ అడ్డుతగిలినవారిమీదుగా మళ్ళీపోగలవు. ఆ తీవ్రతలో. మౌనంగా ఊరుకున్నా ప్రయోజనముండదు - ఎంతటి అమూల్యమైన కాలమైనా ఆ హేళనా విమర్శలతో హారతికర్పూరంలా హరింపజేసేయగల తీవ్ర పరనిందానురక్తి గల స్వభావం జానకిది.

“ఆ అమ్మాయి నా కేమౌతుంది వదినా, ఆమె తరఫున నేను సమాధానం చెప్పడానికి?”

హాస్యంగా ఎగరగొట్టబోయాడు కిరణ్. “అహఁ, మాటవరసకు లేదీ” జానకి వాక్ప్రవాహం ఇసుమంతైనా కట్టుబడలేదు. అందుకే యుక్తిగా ప్రసంగం మార్చాడు కిరణ్. “కూర్చోండి వదినా, నిల్చుని మాట్లాడుతున్నారు.”

జానకి కూర్చుని, తిరిగి సంభాషణను పునఃప్రారంభం చేసేలోగా తానే మాట్లాడాడు కిరణ్: “ఈ సంవత్సరం పంటలవీ చాలా బాగున్నట్లున్నాయి వదినా.”

“అవును. మా పుట్టింటివారి పొలాలు ఇంకా బాగా పండాయట. మొన్న మా నాన్నగారు ఉత్తరం వ్రాశారు. అయినా వాళ్ళకు ఖర్చేముంది గనుక? అంతా ఆదాయమే. ఇప్పటికే లక్షలు లక్షలు గడించారు మా నాన్నగారు......

ఈ సంభాషణనుకూడ ప్రయత్నపూర్వకంగా మార్చవలసిన అవసరం తటస్థించింది కిరణ్‌కు. యధాలాపంగా అడిగాడేకానీ, పొలాలూ, పంటలూ సంభాషణ అంటే అతడికంత ఆసక్తిలేదు.

“మీవాళ్ళంతా—అమ్మగారూ, నాన్నగారూ అంతా కులాసానా వదినా?”

“ఆ. అంతా కులాసానే; ఆ విషయం చెప్దామనే వచ్చాను. మీ గొప్ప పని చేసిపెట్టాలి చినబాబూ.”

“ఏమిటది?” అడిగాడు కుతూహలంగా.

మా చెల్లెలు ఇంద్రాణి తెల్సుగా?”

‘హతోస్మి!’ ఒక్కసారిగా నీళ్లుగారిపోయాడు లోలోన కిరణ్. ‘ఎన్ని సార్లు సంభాషణను మళ్ళించినా, ప్రతిదీ వచ్చి మెడకు చుట్టుకుంటూన్నది. తప్పదు ఇవ్వాళ దైవం తన కేదో అగ్నిపరీక్ష నిర్ణయించి ఉంచినట్లున్నాడు!’

“మాట్లాడ రేమిటి చినబాబూ? మా చెల్లెలు ఇంద్రాణి తెల్సుగా మీకు?”

"మీ పెళ్ళిలోనే చూచాను; అంతే. అంతకంటే నా కేం తెలియదు బాబూ," అన్నాడు కొంచెగా నవ్వుతూ.

"అదేనయ్యా, చాలా బుద్ధిమంతులే కాని... సెవెంత్ ఫారం పాసైందట. ఇంకా చదువుతా నంటూందట. నాన్నగారు నాకు వ్రాస్తే ఇంక అనవసరం, పెళ్ళి చేసేద్దాం అని వ్రాశాను నేను. ఒకసారి ఇక్కడికి పంపించమన్నాను...అదే మయ్యా అంత ఆశ్చర్యం?"

"మరి ఇంతకుముందే ఆడవాళ్ళ చదువు గురించి మీరు ఏమేమో మాట్లాడారు కదా? మీ ఇంట్లో ఆడపిల్లలకు కూడా ఇంతంత చదువు లున్నాయా అవి?"

మరది విసిరిన విసురుకు జానకి వదనం క్షణకాలం మాడిపోయినా, మరు క్షణమే అతితేలికగా నవ్వేసింది. "మరి ఈ కాలం పెళ్ళికొడుకులకు చదువుకున్న అమ్మాయిలు కావాలిగా? అందుకు చదివించారు. అయినా అదేమీ బియ్యేలా,

ఎమ్మేలూ చదవలేదుగా? ఏదో కాస్త ఈ కాలపు చదువూ, వ్రాతా వచ్చిన చదువు. ఫర్వాలేదు. అందుకేగా ఇక చాల్దా మనుకూంట?"

ఆశ్చర్యంతో మౌనం వహించాడు కిరణ్. 'పరులను తీవ్రంగా విమర్శించడంతో పాటు స్వజనులను చక్కగా సమర్థించుకోవటం కూడా వచ్చు చిన్నవదినకు' అనుకున్నాడు.

"ఇంతకూ అసలుసంగతి చెప్పింది జానకి. -ంద్రాణి సాయంకాలం బండికి వస్తుంది. మీరు వెళ్ళి తీసుకురావాలి. ఈ పల్లెదారులూ, బళ్ళూ దానికి క్రొత్త."

ఆ మాటలు వింటూనే గతుక్కుమన్నాడు కిరణ్. 'స్టేషనుకు వెళ్ళి చెల్లెల్ని తీసుకురమ్మని మామూలుగా చెప్పక పుట్టింటి సంగతులన్నీ తనతో చెప్పుకోవడం దేనికీ? తానూ అవివాహితుడే కదా! కొంపదీసి–ఆమెకు లోపల వేరే కోర్కె ఏమీ లేదు కదా? చెల్లెలి వివాహం సంగతి అవివాహితుడైన మరదికి అంత ప్రత్యేకంగా చెప్పడం దేనికీ? అదీకాక ఈ ఇంట్లో ఆమె దేమీ వేరే కాపురం కాదు – సర్వాధి కారమూ లేదు. పుట్టింటివారి నందర్నీ తన చిత్తప్రకారం రప్పించుకోవడానికి అటువంటి విషయాలలో ముందు అత్త మామల అనుజ్ఞ తీసుకోవాల్సివుంటుంది; మరి ఆ లాంఛనా లన్నీ అయ్యాయో లేదో?'

"ఏమిటి చినబాబూ అంత ఆలోచన ఈ మాత్రందానికి?"

"ఆలోచ నేం లేదు వదినా. అయితే... నాన్నగారికి తెలుసా ఈ సంగతి?"

నవ్వుతూన్న జానకి ముఖంలో ఒక్కసారిగా అస్పష్టక్రోధరేఖ లావరించాయి

"ఏం నా కామాత్రం స్వతంత్రం లేదా? ముందుగా ప్రాధేయపడవలసిన అవసరం నా కేమీ లేదు. నా చెల్లెలు నా ఇంటికి వస్తుంది. వచ్చాకనే అందరకూ తెలుస్తుంది;' నిష్కర్షగా అంది.

జానకి స్వభావం తనకు తెలిసినదే గనుక కిరణ్ అందు కేమీ తర్కించ లేదు. మందహాసంతో ప్రసన్నవదనంతో అన్నాడు: "నేను అటువంటి ఉద్దేశ్యంతో అనలేదు వదినా. ఎటూ నాన్నగారు స్టేషనుకు మనుష్యులనూ, బండినీ పంపిస్తారు కదా, ఇక నేను దేనికీ అని?''

తిరిగి ప్రసన్నమైంది జానకి వదనం. "అదా? నౌకర్లు వెళ్తే ఏం బాగుంటుంది? మీరైతే కాస్త మర్యాదగానూ వుంటుంది; దానికీ క్రొత్తా, ఇబ్బందీ ఉండదు."

"నాకు తీరికుండదు వదినా. వేరే పని ఉంది. అదీకాక చిన్నన్నయ్యనో, మన గుమాస్తానో పంపిస్తే బాగుంటుంది; కాని నేను వెళ్ళడం సమంజసంగా ఉండ దను కుంటాను.

జానకి నవ్వింది: "అవన్నీ నేనాలోచించలేదంటారా? చదువుకొన్నవాళ్ళకు కూడ అంత సంకోచమైతే ఎలా?"

"ఏమనుకోకండి వదినా. నావల్ల కాదు."



అంటూ ఆమె మాటలైనా విన్పించుకోకుండా అక్కడినుంచి వెళ్ళిపోయాడు కిరణ్

## 4

మధుర మనోహరసంధ్య. కిలకిలారావాలతో పక్షులు నిజనివాసోన్ముఖమైనాయి. పశులమందలు గృహాభిముఖంగా నడుస్తున్నాయి

గ్రీష్మతాపానికి ముకుళించుకుపోయి సోలిపోయిన ప్రకృతికి మలయపవనుడు వింజామరలు వీచి సేద దీర్చుతున్నాడు.

స్వర్ణకాంతులతో నిగనిగలాడే పచ్చనిశరీరం ఆ నీరెండలో మరింత శోభాయమానంగా ప్రకాశిస్తూండగా, నడకవేగానికి ఉంగరాలజుట్టు ఎగిరెగిరి నుదుటిపై పడ్తూండగా, మధురభావా లూరే మనస్సుతో, కలులు గనే కండ్లతో, మహోత్సాహంతో ఊరికి తూర్పుగా నున్న పొలాలవైపు నడక సాగించాడు కిరణ్: అంతరంగంలో నూతన రాగాంకురాలు ఊరికలెత్తిన అతడికి జగమే ప్రేమమయంగా, ఆనందపూరితంగా కన్పిస్తూంది.

రాయుడుగారి మేడను సమీపించి ఒక్క-క్షణం కాంపౌండు గేటుదగ్గర నిలుచు న్నాడు. ఆవరణలోని మొక్కలకు నీళ్ళు పోస్తోంది దేవరాణి. శరత్చం... రిని బోలిన ధవళవస్త్రాలు ధరించింది, చేతులకు రెండేసి ముత్యాలగాజులు. మెడలో ఒక ముత్యాలహారం, సిగలో, అప్పుడే వికసించబోతూన్న మల్లెలమాల

సర్వాలంకరణలూ శ్వేతవర్ణంలోనే. నిర్మలమైన ఆమె హృదయం వలెనే. స్వచ్ఛంగా ఉండే ఆ ధవళకాంతి అంటే ఆమెకంత ఇష్టంకాబోలు!

"అక్కడే నిల్చున్నా రేమిటి? రండి లోపలకు." చేతులు తుడుచుకుంటూ వచ్చి కిరణ్‌కు తీయగా స్వాగతం పలికింది.

"కూర్చోండి. నాన్నగారు పొలం చూడ్డానికి వెళ్ళారు. వచ్చేవేళైంది," అంది.

చిరునవ్వుతో, పూలమొక్కలమధ్య సిమెంటు అరుగులపై కూర్చున్నా రిరువురూ.

"మీకు పూలమొక్కలు పెంచడమంటే సరదా అనుకుంటాను?" అన్నాడు కిరణ్.

నవ్వింది రాణి. "ఏదో కాలక్షేపం, అంతే. సాయంకాలం ఏమీ చదువను, పాడను. పూల మొక్కలమధ్య నుంటే హాయిగా గడచిపోతుంది. అవి తలలూగిస్తూ 'కలకల నవ్వుతూ మూగగా సంభాషిస్తాయి మనతో. వాటి సౌందర్యం నేత్ర పర్వంగా ఉంటుంది. అంతకంటె ఏం కావాలి?"

"అయితే వీనులవిందుగా చక్కని గానం చేయడమే కాదు, మధురంగా కవిత్వంకూడ చెప్పగలరన్నమాట!" అంటూ నవ్వేశాడు కిరణ్.

రాణికూడ చిన్నగా నవ్వింది, ముగ్ధమోహనంగా.

ఆ సంభాషణతో, ఆ స్వచ్ఛ హృదయపూర్వక హాస ప్రతిహాసాలతో వారి మధ్యగల దూరం తగ్గి చనవు ఏర్పడింది.

"మీ రేం చదివారు?" అని చనవుగా అడిగాడు కిరణ్ రాణిని; విషయం విని ఉన్నా ఆమె నోటివెంటనే స్పష్టంగా వినాలనే ఆసక్తితో.

కన్పించీ కన్పించని చిరునవ్వుతో అన్నది రాణి తలవాల్చి! "చదువుల కేం లెండి. మనుష్యుల విలువలు చదువులతో కొలువలేంగా?"

"అది నిజమేలెండి. కాని అలా అడగడం పరిపాటి ... మిమ్మల్నీ, స్నేహ మర్యాద లెరిగిన మీ ప్రవర్తననూ చూస్తూంటే దాని వెనుక విద్యాధికతా, ఉత్తమ సంస్కారాల గట్టిపునాదీ ఉండివుంటుందని భావించాను. మీకు అభ్యంతరమైతే మాత్రం చెప్పనవసరం లేదులెండి."

"అభ్యంతరం లేదులెండి. ఎమ్మే పాసయ్యాను. కాని అది అంతగా చెప్పుకో తగిన విషయంగా నాకు కన్పించదు. ఈ కాలంలో చాలమంది అంతకంటె పెద్ద చదువులే చదువుతున్నారు."

విన్న విషయం దృఢపడడంతో కిరణ్ నేత్రాలూ, వదనమూ ఆశ్చర్యం ప్రకటించకుండా వుండలేకపోయాయి.

"ఏం, అంత ఆశ్చర్యం?"

"ఏం లేదులెండి; ఇంత చదివిన మీ నిరాడంబరత్వానికి ఆశ్చర్యపోతున్నాను అంతే."

గంభీరంగా అన్నది రాణి. "ఎందుకండీ ఆడంబరాలూ, గర్వాలూను? శాస్త్ర చదువు అబ్బినందుకే మనం గర్వపడ్డామంటే మరి మహామహా వ్యక్తులంతా ఎంత గర్వ పడాలంటారు?"

రాణివిపరీతంగా చూస్తూ, ఆమెమాటలు శ్రద్ధగా వింటూన్న అతడు మాట్లాడలేదు.

ఆమే అన్నది, స్వగతం లాగా, తల అడ్డంగా త్రిప్పుతూ: "గర్వం కూడదు. గర్వమనేది వ్యక్తి పతనావస్థకు ప్రథమసోపానం."

'ఈ మాటలు చిన్నవదిన జానకి వింటే?' అనుకొన్నాడు కిరణ్, పైకి ప్రకాశంగా అన్నాడు. "చూడండీ, మీ రేమీ అనుకోనంటే ఒక్క మాట..." అర్ధోక్తిలో ఆగిపోయాడు

"చెప్పండి."

"పొగుడుతున్నానని మాత్రం అనుకోకండి. నాకు సూటిగా మాట్లాడమే కాని, మర్మం తెలియదు. నిన్న విన్న మీపాట నన్ను ఇంకా వెంటాడుతూనే వుంది. ఇంత వరకూ ఎక్కడా ఎవరి కంఠంలోనూకూడ నే నంత ప్రత్యేకతను చూడలేదు; ఎవరి గానం న న్నింతగా ఆకర్షించలేదు - ఆకర్షించబోదు. మళ్ళీ ఒక్కసారి నిన్నటి పాట - నే నిక్కడికి వచ్చేసరికి పాడుతున్నారే - అది పాడగలరా?" బ్రతిమాలుతున్న ధోరణిలో అడిగాడు.

విస్ఫారిత నేత్రాలతో చూస్తూ అడిగింది దేవరాణి. "అయితే మీకుకూడ చక్రవాకరాగం అంత ఇష్టమా? అది కొద్ది విషాదమిశ్రితం. సాధారణంగా అందరూ దాన్ని ఇష్టపడరు - ఎక్కడో నావంటివాళ్ళు మినహా."

పకపకా నవ్వేశాడు కిరణ్: "సంగీతం విషయంలో నేను కేవలం పసివాళ్ళతో - పామరులతో సమానం. మీరు రాగ తాళ విమర్శలు జరిపితే నాకు మతిపోవచ్చు. విని పరవశమవ్వడమే కాని నాలో నేను ఒక్క కూనిరాగమైనా తీయలేను," అన్నాడు కొద్దిగా సిగ్గుపడుతూ.

"అంత అభిమానం దేనికండీ సంగీతం రాకపోతే?" విస్మయంతో కాకపోయినా, వివేకంగానే అడిగింది. "రసాస్వాదన మాత్రం అంత తేలికైనదా? సంగీత శ్రవణంవల్ల చలింపని వ్యక్తని షేక్స్పియర్ ఏమన్నాడో తెల్సుగా? సుకుమార హృదయ మైతేనే రాగంవలన రంజిత మౌతుంది."

సమాధాన మివ్వకుండా మందహాసం చేసి ఊరుకున్నాడు కిరణ్; గాలికి వూగుతూన్న గులాబీకొమ్మను దగ్గరగా వంచి, ఆ గులాబీ పుష్పాన్ని మృదువుగా స్పృశిస్తూ.

ఆ కుసుమం పైననే దృక్కులు నిలిపి గంభీరంగా అన్నది దేవరాణి: "సృష్టిలో గల సౌందర్యమంతా ఈ కుసుమలోకంలో మూర్తీభవించింది. అందుకే సౌందర్యోపాసక నేత్రాలు ఆ పుష్పాలను చూచి తన్మయ మౌతాయి; వాటి సువాసనను ఆఘ్రాణించి నాసిక ప్రీతి జెందుతుంది. ఇలా శరీరంలో ఏదో ఒక అవయవానికి కాకుండా యావత్ శరీరానికే ఆధారభూతమైన హృదయాన్నే పరవశం జేస్తుంది సంగీతం. చతుఃషష్టికళలలోనూ ఈ ఒక్క సంగీతానికే మానవజీవితంతో అతి సాన్నిహిత్యమైన సంబంధం వుంది. ఒక్క మానవులే కాదు—పశు, పక్షి, వృక్షాదులు సహితం, ఇంచుమించు జీవకోటి నంతనూ స్పృశిస్తుంది సంగీతం

"కాని ఆలోచనా శక్తి, విమర్శనా దృష్టిగల వ్యక్తియొక్క రసాస్వాదనకూ, తదితర పామరుల శ్రవణానికీ సహస్రాంశం భేదం వున్నది. ప్రథములు ఉత్తమ సంగీతంతోనే కాని తృప్తిపడక పోతే, మరొకరు తేలిక రాగానికే సంతోషిస్తారు. సంతోషానికీ, పరవశతకూ తేడా వుంది. ఉన్నతశ్రేణిజీవినికూడ సంతోష జలధినుండి బాహ్య ప్రపంచజాలాన్నంతనూ విస్మరింపజేసి, హృదయాన్ని ఊర్ధ్వ లోకాలకు లాక్కుపోయేదే రాగ తాళ లయబద్ధమైన అమృతగానాంబుధి.

"ఈ గానం అనేక రాగాల మాల; కొన్ని సంతోషంతో ప్రవహించేవి, కొన్ని విషాదాత్మకమైనవి; ఆనంద విషాదాల మేళవింపులు కొన్ని. ఈ మూడు రకాలలోనూ విషాదరాగాస్వాదనలోనే విశేషముంది: విషాదరాగంవల్ల రంజితమయ్యేది పరిపక్వహృదయం. జీవితపు లోతుపాతుల నెరిగి, మంచిచెడ్డలను సమదృక్పథంతో సమీక్షించి, విషాదంలో సహితం ఆనందాన్ని చవి చూడగల విగ్రహశక్తియే హృదయానికి పరిపక్వత నాపాదించుతుంది. విషాద రాగరంజితమే ఆ హృదయ పరిపక్వతకు నిదర్శనం."

భావోద్వేగంతో దేవరాణి వదనా న్నావరించిన అరుణిమ అతడి హస్తాలలోని గులాబీపుష్పం యొక్క కెంపువర్ణంతో పోటీ పడసాగింది. అస్తాద్రి కేగుతూన్న ఆదినారాయణుడు అవనినంతనూ తన అరుణకాంతులలో ముంచివేశాడు. పుష్పసౌరభాలు మిళితమైన పిల్లగాలులు మేనిని చల్లగా సోకుతున్నాయి.

(సశేషం)

Printed and Published by Sri A. Sudhakar Rao for Yuva Concerns at Yuva Press, Hyderabad-1. Telephones, 36336, 34567; Press, 34400
Controlling Editor: Sri "CHAKRAPANI"

